# 1994 నీటి పారుదల పోరాట సంవత్సరంగా పాటించండి !

రాష్ట్రం వరుసగా కరువులకు గురౌతున్నప్పటికీ నీటి వనరుల అభివృద్ధి పట్ల రాష్ట్ర ప్రభుత్వ తీవ్ర నిర్లక్ష్య వైఖరి కొనసాగుతుండటం విచారకరం. బచావత్ కమీషన్ నిర్ణయం ప్రకారం 2 వేల సంవత్సరం లోగా మిగులు జిలాలపై మనకున్న హక్కును వినియోగించుకోవాల్సి ఉంది. కాని సమయం దగ్గర పడుతున్నప్పటి ఈ ప్రాజెక్టుల నిర్మాణం ఒక కొలిక్కి రాలేదు. ఇంతవరకు కొన్ని ముఖ్యమయిన ప్రాజెక్టులకే కేంద్రం అనుమతి నివ్వలేదు. శ్రీశైలం ఎడమ గట్టు కాలువ, హంద్రీ-నీవా, పొలవరం వంటి ముఖ్యమయిన ప్రాజెక్టులకే కేంద్రజలవనరుల సంఘం తాజాగా అనుమతి నిరాకరిస్తూ రాష్ట్రానికి వర్తమానం పంపింది. అయినా రాష్ట్ర ప్రభుత్వం ఇంతవరకు దానిపై స్పందించలేదు. నిత్యకరువుకు గురౌతున్న ప్రాంతాలకు నీటి సౌకర్యం కల్పించే శ్రీరాం సాగర్, జూరాల, తెలుగు గంగ, తుంగభద్ర వంటి ప్రాజెక్టుల పనిలో పురోగతి లేదు. ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వున్నట్లుగా గత దశాబ్ది కాలంగా ప్రాజెక్టుల క్రింద అదనపు నీటి సౌకర్యం కలగలేదు. ఉన్న ప్రాజెక్టుల క్రింద కూడా నీటిని పూర్తిగా సద్వినియోగం చేసుకోలేక పోతున్నాము. శ్రీరాంసాగర్ డ్యాం పూర్తయినప్పటికీ కాలువల నిర్మాణం పూర్తి కానందున గోదావరి నీరు వృధా అవుతున్నది. నాగార్జున సాగర్ క్రింద ఇంకా 3 లక్షల ఎకరాలకు నీరివ్వ గలిగిన స్థితిలో యంత్రాంగం లేదు. కాలువల నిర్మాణంలో వున్న లోపాల కారణంగా కాలువ చివర భూములకు అసలే నీరందటం లేదు. పదే పదే గట్లు తెగిపోయి రోజుల తరబడి నీరివ్వకపోవడం రైతులకు తీవ్ర ఆందోళనకు గురి చేస్తున్నది. తాజాగా ఎడమ కాలువకు కొణిజర్ల వద్ద టన్నల్‌పై గండి పడింది. ఇప్పుడు మొదటి పంట పూర్తి కాకుండానే రెండో పంటకు నీరిస్తామని ప్రభుత్వం ప్రకటించడంతో కాలువ చివరి భూముల్లో వున్న రైతుల్లో ఆందోళన మరింత పెరుగుతున్నది. డైవర్షన్, లిఫ్ట్ ఇరిగేషన్ స్కీములు అనేకం ఇంకా పెండింగులో వున్నాయి. వాటిని నిధుల కొరత సమస్య వెంటాడుతున్నది. ఈ సంవత్సరాన్ని చిన్న నీటి వనరుల సంవత్సరంగా ప్రకటించినప్పటికీ ఇంతవరకు ఒక్క అడుగు ముందుకు పడలేదు. ప్రచార ఆర్భాటం తప్ప మరమ్మత్తులు జరగలేదు. 30 శాతం చెక్ డ్యాం అసలు అడ్రసు లోనే లేవని ఇటీవల చిన్న నీటివనరుల శాఖామాత్యులు ప్రకటించిన సత్యం ప్రభుత్వ అసమర్థతకు, అవినీతికి అద్దం పడుతున్నది. భూగర్భ జలాల వినియోగంలో పేదరైతులు తీవ్రమయిన అన్యాయానికి గురౌతున్నారు. తగిన ఆర్థిక వనరులు లేక చిన్న చిన్న బోర్లు వేసుకుంటే, మరోవైపు కొందరు ధనిక రైతులు పెద్ద పెద్ద బోర్లు లోతుగా వేసుకుంటున్నందున చిన్న బోర్లన్నీ ఎండిపోతున్నాయి. భూగర్భ జలాల వినియోగంపై ఒక సమగ్రమైన చట్టాన్ని తీసుకొచ్చి నిక్కచ్చిగా అమలు జరపాల్సిన అవసరం ఉంది.

ఈ సమస్యలపై పదే పదే రైతులు, రైతు సంఘాలు ఆందోళన చేస్తున్నారు. నల్లగొండ, వరంగల్, మహబూబ్ నగర్ జిల్లాలలో పరిస్థితి బంద్ ల వరకు పోయింది. ఇంకా కార్యాచరణను తీవ్రతరం చేయడానికి వాళ్లు ఆలోచిస్తున్నారు. అయినా ప్రభుత్వ నిర్లక్ష్యం కొనసాగుతూనే వున్నది. దీనికి వ్యతిరేకంగా 1994 సంవత్సరమంతా నీటి వనరుల సాధన పోరాట సంవత్సరంగా పాటించి వివిధ రూపాల్లో ఆందోళనలు సాగించి ప్రభుత్వంపై ఒత్తిడి తేవాలని అఖిలభారత కిసాన్ సభ నిర్ణయించింది. దేశ వ్యాప్తంగా జరిగే ఈ పోరాటంలో భాగంగా మన రాష్ట్రంలో ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం డిసెంబరు 3వ వారంలో హైదరాబాద్‌లో ఒక సెమినార్ నిర్వహించాలని భావించింది. ఆ సందర్భంగా భవిష్యత్ కార్యాచరణను రూపొందించుకొని రైతాంగం ముందుకు సాగాల్సిన అవసరం వున్నది.

మన

# రైతు వాణి

1993, నవంబర్–డిసెంబర్
సంపుటి : 4 సంచిక : 12
వెల : రు. 5.00 పేజీలు : 76



సంపాదక వర్గం :

బోడేపూడి వెంకటేశ్వరరావు
భీమిరెడ్డి నరసింహారెడ్డి
పి. మధు
వి. శ్రీనివాసరావు
(ఎడిటర్)

చిరునామా :
ఎడిటర్, మన రైతువాణి
30ఎ, పాత ఎం.ఎల్.ఏ. క్వార్టర్స్,
హిమాయత్‌నగర్, హైదాబాద్–29.

గమనిక : చెక్కులు, డిడీలు
మన రైతువాణి పేరుతో పంపవగలరు.

## లోపలి పేజీల్లో....



## మండిపోతున్న ధరలు

ఒకవైపు ప్రభుత్వం ద్రవ్యోల్బనం అదుపులో వుందంటూ కోతలు కోస్తుంటే ధరలు నక్షత్రాలకు ఎగబాగుతున్నాయి. సామాన్య మానవునికి అందుబాటులో లేకుండా పోతున్నాయి. వ్యవసాయ మార్కెట్ సీజన్‌లో ధరలు తగ్గించి తక్కువ ధరలకు ఉత్పత్తులను కొని ఆ తర్వాత దళారులు, వ్యాపారస్తులు మార్కెట్‌ను తమ గుప్పెట్లో పెట్టుకొని ధరలు పెంచేస్తున్నారు.

ఉల్లిపాయలు మార్చి వరకు రైతుల వద్ద నుండి క్వింటాల్ రూ.70-80 లకు కొన్నారు. మేలో ప్రభుత్వం నాఫెడ్ ద్వారా రూ. 200లకు కొనుగోలు చేసింది. ఇప్పుడు మార్కెట్‌లో ఉల్లిపాయలు ధరలు రూ.1600లకు ఎగిరిపోయింది. గతంలో ఎన్నడూ వుల్లిపాయకింత ధర లేదు. వినియోగదారులు ధారపోసే ఈ డబ్బునంతా వ్యాపారులే కాజేస్తున్నారు తప్ప రైతులకు ఒక్కపైసారాదు.

ఈ మార్కెట్‌ను ఎవరు కంట్రోలు చేస్తున్నట్లు?
ప్రభుత్వమా? పెట్టుబడి దారులా?

Laser Typesetting : SHRAVANI GRAPHICS,
3-4-610/3, Lane Opp. to Deepak Mahal Bus Stop,
Narayanguda, Hyderabad - 29.

# ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయాభివృద్ధి సాధక బాధకాలు

డా. ఎమ్.వి. రావు, ఉపాధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్, వ్యవసాయవిశ్వ విద్యాలయము

ఆంధ్రప్రదేశ్ మన దేశములోని పెద్ద రాష్ట్రములలో ఐదవది. మన రాష్ట్ర ఆదాయంలో వ్యవసాయ ఆదాయం 39 శాతం ఉండుటే గాక రాష్ట్రంలో 70 శాతం ప్రజలకు జీవనాధారమైనది. మనకున్న 93 లక్షల వ్యవసాయ కమతాలలో అత్యధికం అనగా 77.3 శాతం చిన్న-సన్నకారు కమతాలు. రాష్ట్ర విస్తీర్ణం (274.4ల హె.) లో 48.0 శాతం (131.9 ల. హె) విస్తీర్ణంలో పంటలు సాగు అవుచున్నవి. అందులో 56 శాతం విస్తీర్ణంలో అనగా (74.3 ల.హె.) ఆహారధాన్యాలు పండించి జాతీయ ఆహార ధాన్యాల అవశ్యకతలో సుమారు 7 శాతం (117.1ల. టన్నులు) వరకు సమకూర్చు తున్నాము. పైనుదహరించినట్లుగా ప్రజలకు పశువులకు అవసరమైన ఆహారము సమకూర్చటమే కాకుండా వ్యవసాయక పరిశ్రమలకు కావలసిన ముడి పదార్థములను సరఫరా చేయుట ద్వారా రాష్ట్రంలో పంచదార, జనపనార, నూలు-బట్టలు, పొగాకు, బియ్యం, నూనె మిల్లుల ఏర్పాటుల ద్వారా చాలమందికి ఉద్యోగ అవకాశములు కలుగుచున్నవి. వ్యవసాయాభివృద్ధి ద్వారా మన రాష్ట్రం ఆర్థిక, సాంఘిక మరియు రాజకీయ రంగాలలో కూడా చాలా ముందుకు సాగుతున్నది.

*మన దేశములో ఆంధ్రప్రదేశ్ వరి పంట ఉత్పత్తిలో మొదటి లేదా రెండవ స్థానములో ఉండుటేగాక సుమారు 10–15 లక్షల టన్నుల మిగులు ధాన్యాలను దేశ నిల్వలకు జమ చేయుచున్నది. 1992–93 సంవత్సరములో రికార్డు స్థాయిలో 30 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను దేశ నిల్వలను జమ చేసింది.* వ్యవసాయ పంటల సగటు దిగుబడులలో కంది మరియు ఆముదము మినహా మిగిలిన పంటలలో మన రాష్ట్రము గణనీయమైన అభివృద్ధి సాధించినది. మన రాష్ట్రములో ముఖ్యమైన పంటలగు వరి, మొక్కజొన్న, జొన్న, చెఱకు, ప్రత్తి, మిరప మరియు మినుముల సగటు హెక్టారు దిగుబడులు దేశంలోనే అధికంగా నున్నవి. మన రాష్ట్రములోని ఆహార ధాన్యాల ఉత్పత్తి 1956–57 లలో 52.6 లక్షల టన్నుల నుండి 1991–92 సంవత్సరములో 117.1 లక్షల టన్నులకు పెరుగుటే ఇందుకు నిదర్శనము.

వట్టిక : ఆంధ్రప్రదేశ్‌లో వివిధ పంటల దిగుబడి, ఉత్పత్తి

| పంట | ఉత్పత్తి (లక్షల టన్నులు) 1964-65 | 1991-92 | దిగుబడి క్వి./హె. 1964-65 | 1991-92 |
|---|---|---|---|---|
| వరి | 50.07 | 94.65 | 14.47 | 24.14 |
| జొన్న | 11.38 | 6.73 | 4.56 | 6.26 |
| సజ్జ | 2.87 | 1.39 | 4.80 | 7.3 |
| మొక్కజొన్న | 2.57 | 6.39 | 12.43 | 20.3 |
| రాగి | 2.92 | 1.52 | 8.61 | 10.99 |
| కంది | 0.87 | 1.24 | 4.87 | 3.68 |
| మినుము | 0.53 | 3.4 | 2.2 | 6.1 |
| పెసర | 0.80 | 2.2 | 1.8 | 4.3 |
| మొత్తం ఆహార ధాన్యాలు | 77.04 | 119.59 | 8.17 | 16.1 |
| వేరుశనగ | 9.14 | 22.35 | 8.37 | 8.95 |
| ఆముదాలు | 0.54 | 0.91 | 1.88 | 2.74 |
| నువ్వులు | 0.42 | 0.39 | 1.85 | 2.24 |
| మిరప | 1.28 | 2.60 | 7.78 | 11.95 |
| ప్రత్తి | 1.52 | 13.14 | 69.4 | 315.5 |
| | | లక్షల బేళ్ళు బేలుకు 170 కిలోల ప్రత్తి | కేజీలలో | కేజీలలో |

ఆహార ధాన్యాల ఉత్పత్తి 1969-70 నుండి 1991-92 వరకు ఉన్న సగటు సంవత్సరాభివృద్ధి దేశం మొత్తంలో 2.7 శాతం ఉండగా ఆంధ్రప్రదేశ్ 2.5 శాతంతో గణనీయమైన అభివృద్ధి సాధించిన 6 రాష్ట్రాలలో మన రాష్ట్ర మొకటైనది. ఇందుకు ముఖ్యంగా మన రాష్ట్రంలోని వ్యవసాయ విశ్వ విద్యాలయము

వారు పరిశోధనల ద్వారా రూపొందించిన క్రొత్త రకాలు (200) మేలైన సాగు పద్ధతులు కారణమని చెప్పవచ్చును. వ్యవసాయ ఆధార పరిశ్రమలగు చక్కెర, బియ్యపు మిల్లులు, నూనె మిల్లులు, ఎరువులు, పురుగు మందుల పరిశ్రమలు మరియు ఆహార ధాన్యాలు, పండ్ల నుండి వివిధ పదార్థాలు తయారుచేయు పరిశ్రమలు గణనీయంగా పెరిగినవి.

పట్టికలో నుదహరించిన పంటలలోనే కాకుండా పొగాకు, పండ్లు, కూరగాయల ఉత్పత్తులలోను మన రాష్ట్రము మంచి అభివృద్ధి సాధించినది. మన మామిడి రకాలు బంగనపల్లి, కలక్టరు పండ్లకు దేశములోని వివిధ ప్రాంతాలలో మంచి గిరాకీ ఉన్నది. వాటి నుండి తయారైన తాండ్ర రసాల ఎగుమతులు మనకు విదేశద్రవ్యమును ఆర్జించుచున్నవి. మన రాష్ట్రము నుండి వెళ్ళే అరటి, ద్రాక్ష, సీతాఫలము మరియు కూరగాయలకు చాలా గిరాకీ ఉన్నది. మన రాష్ట్రంలో ఇంకా గణనీయ ప్రగతి సాధించుటకు వీలైన సహజ వనరులు, సారవంతమైన నేలలు, అనుకూల వాతావరణము, నదులు – నీరు, అధిక మానవశక్తి మరియు ప్రగతి శీలురైన కర్షకులు, అభివృద్ధి పథంలో నున్న పరిశ్రమలు వున్నవి. ప్రస్తుతం మన రాష్ట్రంలో పంటల సాంద్రత 116 శాతం. దానిని ఇంకా పెంచుటకు అవకాశము కలదు. అత్యధిక విద్యుచ్ఛక్తి సదుపాయము ఉన్న బావులు గల రాష్ట్రాలలో మనది మూడవది. అంతేగాక దేశములోని 68 శాతం పల్లెలకు విద్యుచ్ఛక్తి సదుపాయమంటే మన రాష్ట్రంలో 87 శాతం పల్లెలకు విద్యుచ్ఛక్తి సదుపాయముండుట మన వ్యవసాయాభివృద్ధికి తోడ్పడుతుంది. కాని మన రాష్ట్రమునకు తరచుగా తుఫాను బీభత్స ములు, అధిక వర్షాలు, వరదలు, వర్షాభావ పరిస్థితులు మరియు పంటలపై విపరీతమైన చీడ-పీడల బెడద మనలను భీతిల్ల చేయుటేగాక బలహీనపరుస్తున్నాయి. దీనికి తోడు మన రాష్ట్ర ములోని రాయలసీమ-తెలంగాణా ప్రాంతాలలో తక్కువ నీటి వనరులుండుట వలన రాష్ట్రాభివృద్ధికి కొంత వరకు ఆటంకముగా నున్నది. అయినప్పటికి మనకున్న సారవంతమైన డెల్టా ప్రాంతము-విశిష్టమైన కాలువల ద్వారా సాగు మరియు దేశంలో కెల్లా మనకున్న అధిక చెరువులు – బావులతోపాటు మనం ఇంతవరకు మెట్టసాగులో సాధించిన సాంకేతిక పరిజ్ఞానముతోను, భూమిలో తేమ నిల్వచేయు కొత్త పద్ధతులు, అనుకూల పంటల సరళులు మొదలగు అంశాలపై పరిశోధనలు జరుపుచున్న వ్యవసాయ విశ్వవిద్యాలయము మరియు ఇతర పరిశోధనా లయాలు వ్యవసాయ సంబంధిత శాఖల సహకారాల ద్వారాను ఇప్పటి వరకు సాధించిన వ్యవసాయాభివృద్ధిని స్థిరీకరించు కొనుటే కాక మరింతగా అభివృద్ధి చేయుటకు అవకాశాలు కలవు. అందుకు ఈ క్రిందనుదహరించిన మార్గములు దోహదపడతాయని నానమ్మకం.

## 1. ప్రజలకు సమపోషకాహారం సమకూర్చు విధానము :

వ్యవసాయకముగా సంపన్నమైనను మన రాష్ట్ర ప్రజలకు అవసరమైన సమ పోషకాహారములు సమకూర్చుటలో చాల వెనుకబడి వున్నాము. ప్రతి మనిషికి రోజుకు సుమారు 500 గ్రాముల ధాన్యము, 50 గ్రాముల అపరాలు మరియు 100 గ్రాముల నూనె గింజలే కాకుండా పండ్లు – కూరగాయలు అవసరము. ఆ ప్రకారము మన *జనాభా పెరుగుదల సాలుకు 2 శాతం క్రింద లెక్కచేసినా,* మన రాష్ట్రానికి *1994–95 సంవత్సరానికి ఒక్క ఆహారధాన్యాలే 149.64 లక్షల టన్నులు అవసరము. అదే 2,000 సంవత్సరానికి 163.25 లక్షలు టన్నులు అవసరము. ప్రస్తుత ఉత్పత్తుల ప్రకారము చాల మందికి అవసరమైన మాంస కృత్తులందించు ఆహారముగాని పండ్లుగాని అందుబాటులో లేవు.* మన ఆహారపు అలవాట్లలో శక్తిమరియు పుష్టినివ్వగలిగే మాంస కృత్తులు అందించే పదార్థాల వినియోగము చాలా తక్కువగా నున్నది. అందువలన మనము ఎక్కువ ఉత్పత్తి చేయుటే కాకుండా మనము పండించే పంటల నుండి మరియు పశు సంపద నుండి మనకు కావలసిన అన్ని రకాల పోషకాలు అందేలాగ మిశ్రమ సాగుద్వారా కృషి చేయాలి.

## 2. సగటు హెక్టారు దిగుబడులు అధికం చేయుట:

మన దేశములో వరి హెక్టారు సగటు దిగుబడి (2 టన్నులు) కంటె కొరియా, జపాను, చైనా దేశాలలో (6 టన్నులకు పైన) సుమారు 3 రెట్లు అధికంగా ఉన్నది. మన రాష్ట్రములో 3 టన్నుల వరకున్నది. వరిసాగు 90 శాతం నీటి సదుపాయం క్రింద ఉన్నా, మేలైన విత్తనాలు, వ్యవసాయ పద్ధతులు, అధిక ఎరువులు (హెక్టారుకు 250 కిలోల వరకు) క్రిమి సంహారక మందులు వాడుచూ ఎక్కువ దిగుబడులు సాధించ లేకపోవుటకు ఏ కారణము లేదు. మన తీర ప్రాంతపు రైతులు చాల ప్రగతి శీలురు. వారికి ఉన్న వనరులు, సారవంతమైన నేలలు అనుకూలతలను సక్రమముగా వినియోగించుకొన్నచో అత్యధిక దిగుబడులు సాధించ గలరు. అధికోత్పత్తికి మనకున్న భూ వసతిని ఇంకనూ పెంచే అవకాశం లేదు గనుక హెక్టారు సగటు దిగుబడులు అత్యధికము చేయాలి. సారవంతమైన నేలలో వరిసాగుచేసికొని, తక్కువ సారవంతమైన నేలలను ప్రతికూల పరిస్థితులకు అనువైన వ్యవసాయ పంటలు, పండ్లతోటలు, పాడి,

కోళ్ళు, చేపలు మరియు పట్టుపురుగుల పెంపకం పరిశ్రమలకు ఉపయోగించు కోవాలి.

### 3. పంటల మార్పిడి :

మనము సాధించిన వివిధ పంటల అధిక దిగుబడులను స్థిరీకరించుటే కాక అధిక ఆదాయముపొందే పంటల మార్పిడి విధానము అవలంబించాలి. ఒకటి, రెండు పంటలను మాత్రమే అధిక విస్తీర్ణంలో పండించుట వలన వాటికి గిరాకీ లేక పంట కాలములో తక్కువ ధరలకు మధ్య దళారీలకు అమ్ముకోవలసి వస్తుంది. అంతేగాక ఒకేరకమైన పంట అధిక విస్తీర్ణములో వేయుట వలన చీడ-పీడల బాధ అధికమయ్యే అవకాశం ఉంది. వీటికి తోడు మనరాష్ట్రములో తరచు వచ్చు తుఫానులు, వరదలు, మరియు వర్షాభావ పరిస్థితులు దృష్టిలో ఉంచుకొని మనకు అనుకూలమైన పంటల సరళి, సాగు విధానములను ఎప్పటి కప్పుడు మార్పు చేసుకుంటూ వ్యవసాయ ఉత్పత్తులు పెరిగేలా కృషిచేసి రైతులు లాభించాలి.

### 4. పంటల మరియు మిశ్రమ సాగు పద్ధతుల సరళిలో మార్పు:

మన రాష్ట్రములోని రైతులు తమకున్న కొద్దిపాటి భూ వసతి నుండే వారి కుటుంబావసరాలు తీర్చుకొనుటకు రెండు లేదా మూడు పంటలు అంటే పంట సాళ్ళ నడుమ ఇంకొక పంట వేయుట లేదా కాలము వృధా కాకుండా ఒకపంట కోతకు వచ్చేముందు అందులోనే మరోపంట వేయుట ద్వారా అధిక దిగుబడులు పొందుటకు ప్రయత్నము చేస్తున్నారు. వారి కృషిలో మరింత విజయం సాధించేందుకు వీలుగా వారి భూములకు ఉన్నవనరులకు అనువైన పంటల సరళిని గురించి చెప్పవలసి వున్నది. అట్టి సాంద్ర వ్యవసాయములో చీడ-పీడలు పెరగని విధముగా వారికి సరియైన సమయానికి సలహాలివ్వాలి. ఈ విధముగా పంటల సరళి మార్చుటే గాక ఒకేభూమిలో పంటల జాతులు - చేపలు - పశువులు మరియు గొర్రెల మిశ్రమ సాగుచేసే క్రొత్త పద్ధతులను ప్రవేశ పెట్టి వారి ఆదాయాన్ని స్థిరీకరించాలి.

### 5. మెట్ట సాగు సాంకేతిక విజ్ఞానము :

మన రాష్ట్రములోని మూడు ప్రాంతాలు కూడ తక్కువ లేదా సాధారణ వర్ష ప్రాంతాలు. మనకున్న సాగునీటి వనరుల క్రింద ఎంత భూమిని అభివృద్ధి చేసినను, ఇంకా చాలాభూమి వర్షపునీరు మీదనే ఆధారపడ వలసి యున్నది. మన రాష్ట్రములో నున్న వ్యవసాయ విశ్వ విద్యాలయము, కేంద్రీయ మెట్ట వ్యవసాయ సంస్థ మరియు ఇక్రిసాట్ తదితర పరిశోధన సంస్థలు కనుగొనిన మెట్ట సాగు సాంకేతిక విజ్ఞానము పూర్తిగా ఉపయోగించుకొని వివిధ మెట్టపంటల ఉత్పత్తులలో స్థిరీకరణ సాధించాలి. అట్టి మెట్ట పరిస్థితులలో క్రమ పద్ధతులలో ఉత్పత్తులు పొందాలంటే మొత్తం సాగు భూమి, సాగునీరు, నీటియాజమాన్యములను క్రమపద్ధతులలో వాడుకోవాలి. అందుకొరకు నదీ పరీవాహక ప్రాంతాల అభివృద్ధి ప్రణాళికలు తయారుచేసుకొని నేలకోత, వర్షాభావము మరియు వరదలు మొదలగు ఇబ్బందులను తట్టుకొనుటకు మెట్ట సాగు విజ్ఞానమును ఉపయోగించుకొని అభివృద్ధి సాధించాలి.

### 6. విత్తనాలు :

ఏ రాష్ట్రములో గాని, ఏ దేశములో గాని వ్యవసాయాభి వృద్ధి వారికున్న దృఢమైన విత్తన విధానం మీద ఆధారపడి ఉంటుంది. హరిత విప్లవము అట్టి విత్తన విధానము వలనే వచ్చినది. వ్యవసాయోత్పత్తులు పెరగడానికి మేలైన విత్తనమే ప్రధాన కారణము. అందుచేత విత్తన కార్యక్రమమునకు ప్రాధాన్యత నివ్వాలి. విత్తన వంటల తణిఖీలు, వాడకానికి వాటి విడుదల చాలా పటిష్టంగా జరగాలి. ఆ విత్తనాలు రైతులకు స్వల్ప కాలంలో సమృద్ధిగా అందేలా చూడాలి. క్రొత్త వ్యవసాయసాగు విధానాలు ఖరీదైన వివిధ ఉత్పాదకాలతో కూడి ఉండుటచే చీడ-పీడలకు తరచు గురి అవుచున్నవి. అందుచేత మనకున్న రకాలను ప్రతి 4-5 సంవత్సరాలకు మార్పు చేసుకోవాలి. లేనిచో అవి క్రొత్త చీడ-పీడలకు గురి అవుతాయి. విత్తనాభివృద్ధిని కేంద్రీకృత అజమాయిషీ నుంచి తీసివేసి రైతులకు అందుబాటులో వుంటూ వారికి కావలసిన విత్తనాలు విత్తే సమయానికి అందేలా ప్రాంతాల వారి అజమాయిషీ క్రింద వుంచాలి. రైతులు మంచి విత్తనాలు దొరకుట లేదనే మాట విత్తన కార్యక్రమము సరిగాలేదని చెప్పటమే. కావున వ్యవసాయాభివృద్ధికి విత్తనము చాలా ముఖ్యము.

### 7. తోటల అభివృద్ధి :

మన రాష్ట్రము వివిధ రకాల పండ్లను పండించుటలో ప్రసిద్ధమైనది. మన మామిడి, అరటి, ద్రాక్ష, సీతాఫలములు దేశములోనే చాలా ప్రశస్తమైనవి. మన కలక్టరు మామిడి పండ్లు, తాండ్ర, రసాలు ఎగుమతుల ద్వారా విదేశీ మారక ద్రవ్యము లభిస్తున్నది. మన దేశములోని ప్రతీ నాలుగు మామిడి పండ్లలో ఒకటి మన రాష్ట్రము నుంచే వుత్పత్తి అవుతోంది. మన దేశంలో వివిధ పరిశ్రమలు, పెద్ద పెద్ద హోటళ్ళు నుంచి మంచి పండ్లకు కూరగాయలకు, పూలకు చాలా గిరాకీ పెరుగుతోంది. అయితే వీటి ద్వారా

రైతులకు సరియైన ఆదాయం పొందాలంటే వాటిని గ్రేడింగు, తయారీ రవాణాతట్టుకొనేలా ప్యాకింగు మరియు చెడిపోకుండా నిల్వచేయు సదుపాయములు కలుగ చేయాలి.

తక్కువ వర్షపాత ప్రాంతాలైన రాయలసీమ, తెలంగాణాలు రేగు, దానిమ్మ, పాల్స పండ్ల రకాల సాగుకు అనుకూలము. ఇట్టి మెట్ట ప్రాంతాలలో తోటలు పెంచి గుజరాత్, మహారాష్ట్ర హర్యానా రైతులు అధిక లాభాలు పొందుచున్నారు.

మన రాష్ట్రములో ద్రాక్ష సాగులో రైతులు అత్యధిక ఉత్పత్తిసాధించుట జరిగినది. అదే విధముగా నిమ్మజాతి ఉత్పత్తులు అధికం చేయుటలోను మనరాష్ట్రం ప్రసిద్ధిగాంచినది. వాటిపై ఆధారపడే పరిశ్రమలు చాల పెరిగినవి. పట్టణాలకు, నగరాలకు దగ్గరలో పుట్టగొడుగుల పెంపకం కుటీర పరిశ్రమగా అభివృద్ధి చెందుటకు చాలా అవకాశాలు కలవు. అలాగే ఔషధ మరియు సుగంధ సంబంధిత మొక్కలు మరియు జీడి మామిడి పెంపకానికి మనరాష్ట్రము మరింత అనువైనది.

## 8. పామాయిల్ పెంపకం :

ఆంధ్రప్రదేశ్‌లో సుమారు 2.5 లక్షల హెక్టార్ల డెల్టా ప్రాంతములో నీటి వసతి క్రింద ఆఫ్రికన్ పామాయిల్ వేయుటకు అనుకూలముగా గుర్తించబడినది. ఈ పామాయిల్ హెక్టారుకు ఏ నూనెగింజల పంట ఇవ్వలేనంత నూనె దిగుబడినిస్తుంది. మలేషియా, ఇండోనేషియాలలో హెక్టారు దిగుబడులు 5-6 టన్నులనూనెకాగా, మనరైతులు మేలైన సాగు పద్ధతుల ద్వారా 11-12 టన్నుల నూనె వరకు పొందే అవకాశమున్నది. అట్టి పామాయిల్ అభివృద్ధి చెందాలంటే మనకు నూనె తీయు పరిశ్రమల స్థాపన ముందుగా జరగాలి. ఈ తోటలలో అంతర కృషికి అనుకూలమైన ఇతర పంటల గురించి తెలిసికోవలసిన అవసరమున్నది. మన రాష్ట్రములో భూకమతాల గరిష్ఠ పరిమితి చట్టం అమలు వలన చాలా చిన్న-సన్నకారు కమతాలున్నాయి. అందువలన ఎక్కువ విస్తీర్ణంలో తోటలు వేయుట, వాటిని బట్టి పరిశ్రమల స్థాపన, సహకార సంస్థల ద్వారాగాని లేదా వేరేపెద్ద కంపెనీల అజమాయిషీ లోనైనజరగాలి, లేనిచొ పామాయిల్ సాగు లాభసాటిగా ఉండదు.

> “పంటల మార్పిడి విధానం అవసరం. ఒకే రకమైన పంట అధిక విస్తీర్ణంలో వెయ్యడం చీడ-పీడలకు అవకాశం ఇవ్వటమే”

## 9. వ్యవసాయ పరిజ్ఞానము రైతులకు అందజేయు విధానము :

క్రొత్త వ్యవసాయ విషయాలు మరియు సాంకేతికాభివృద్ధి రైతులకు అందచేయుటలో విపరీతమైన ఆలస్యమగు చున్నది. అందువలన రైతులు వాటిని ఆచరించుటలో సమయం వృథా అగుటయే గాక వ్యవసాయ ఉత్పత్తుల అభివృద్ధి నెమ్మదిగా సాగు చున్నది. ఒకొక్కసారి సరైన సమయానికి అవసరమైన సాంకేతిక పరిజ్ఞానము అందక పంటలు చీడ-పీడల వలన వివరీతమైన నష్టం జరిగి రైతులు ఆర్థికంగా నష్టపోవుచున్నారు. సాంకేతిక పరిజ్ఞానం రైతులకు అందించు అన్నిశాఖలను క్షుణ్ణంగా పరిశీలన చేసి ఆశాఖలు సాంకేతిక విషయాలు ఎప్పటికప్పుడు వివరముగా రైతులకు అందించి ఉపయోగపడేలాచేయాలి. ఇందుకు అవసరమైతే అట్టి శాఖలలో అనుభవజ్ఞులైనవారిని ఉపయోగించుటయే గాక పురుషులతోబాటు స్త్రీ సిబ్బందిని నియమించాలి. స్త్రీలు వ్యవసాయములో బాటు పోషకాహార వినియోగము మరిము కుటుంబ ఆరోగ్య విషయాలు తెలుపుట ద్వారా వ్యవసాయా భివృద్ధిని త్వరితగతిని సాధించు అవకాశము కలదు.

## 10. నూనె గింజల చెక్కమరియు పిండి వాడకం:

అధిక మాంసకృత్తులు కలిగిన నూనెగింజల చెక్క-పిండులను మానవ లేదా పశువుల ఆహారాలలో మనం ఎక్కువగా ఉపయోగించక వృథాచేస్తున్నాము. నూనె తీయకుండానే ప్రత్తి గింజలను తరచు పశువులకు పెట్టటం జరుగుచున్నది. అందలి నూనె పశువులకు ఏ మాత్రం అవసరం లేదు. నూనె తీసిన చెక్కపిండులనుండి మంచి పోషక విలువలుగల ఆహార పదార్థాలను తయారు చేయవచ్చును. వరి, ప్రత్తి సాగులో ప్రసిద్ధి గాంచిన మన రాష్ట్రములో తవుడు నుండి తీసిన నూనె త్వరగా పాడగుట కారణాన ఆ నూనె వాడటం అంత ప్రసిద్ధి చెందలేదు. అయినా ఈ మధ్య మెరుగైన పద్ధతులలో నూనె తీయుట వలన దీనికి మంచి గిరాకీ పెరుగుతున్నది. అదే విధముగా ఆరు లక్షల హెక్టారులలో పండించే ప్రత్తి పంటనుండి వచ్చే మొత్తం గింజల నుండి మేలైన విధానములో నూనె తీసిన, వాడకం పెరుగును. అంతేగాక చెక్కపిండుల నుండి మంచి పశువుల దాణా చేయవచ్చును. ఈ విధముగా సుమారు నాలుగు లక్షల టన్నుల

ప్రత్తినూనె ఉత్పత్తి చేసి దిగుమతి చేసుకొనే నూనె తగ్గించుకో వచ్చును.

## 11. గిరిజన ప్రాంతాల అభివృద్ధి :

మనకున్న గిరిజన ప్రాంతాలలో కాఫీ, మిరియాలు, కోకో మరియు ఇతర సుగంధ ద్రవ్యాల పంటలు పండించి అధికదిగుబడులు పొందుటకు వీలున్నది. కాఫీ పంటకు చాలా అనుకూలమైన కూర్గులో లాగే మన రాష్ట్రములోని చింతపల్లి, పాడేరు మరియు మారేడుమిల్లి ప్రాంతాలలో కాఫీ బాగానే వస్తుంది. ఈ ప్రాంతాలు ఆర్కిడ్ తోటల అభివృద్ధికి కూడా అనుకూలమైనవి. ప్రాథమిక సమాచారమును బట్టి మన రాష్ట్రములోను సోయా చిక్కుళ్ళు, ఆవాలు పండించుకోవచ్చునని తెలిసినది. సోయా చిక్కుళ్ళు ఖరీఫ్-రబీ పంటగా కూడా వేయవచ్చును.

## 12. నత్రజని స్థిరీకరణ పంటల సాగు ద్వారా పంట భూములను ఎక్కువ సారవంతము చేయుట:

పంట భూములను సారవంతము చేయుటకు సూక్ష్మ పోషక పదార్థాలు సమతుల్యంగా ఉండుటకు పచ్చిరొట్ట ఎరువుల వాడకం అత్యవసరం. పచ్చిరొట్ట పంట రకాలలో సస్బేనియా రోస్ట్రేట, ఎసినోమోన్, ఎగ్రస్పెర్మ అనేవి ప్రస్తుత రకాలగు జీలుగ, జనుము, పిల్లి పెసరల కన్న ఎక్కువ నత్రజని నేలకు అందించుటే గాక ఎక్కువ సేంద్రీయ పదార్థములనిస్తాయి. ఇదే కాకుండ నత్రజని స్థిరీకరణలో పప్పుధాన్యాల పంటలకు ప్రోత్సాహమునకు బయోఫెర్టిలైజర్స్ వాడాలి. దీనితో పాటు మన పంటల సరళిలోను, మిశ్రమ పంటల సాగులోను ఏదో ఒక పప్పు పంటసాగు ద్వారా మన భూములను సారవంతము చేయుటే గాక మనము వేసే పంటలకు వాడే రసాయనిక ఎరువుల వాడకం 30-50 కిలోల నత్రజనిని ఆదాచేసుకోవచ్చును.

## 13. సంకర వరి రకాలు :

మొక్కజొన్న, జొన్న, సజ్జ, పొద్దు తిరుగుడు, ఆముదము, ప్రత్తి, కొబ్బరి మొదలగు పంటల దిగుబడులు సంకర విత్తనాల ద్వారా గణనీయంగా పెరిగినవి. వరిలో కూడ అట్టి సంకర విత్తనాల తయారీలో వివిధ ఇబ్బందులను అధిగమించి చైనా సుమారు 8 మిలియన్ల హెక్టారులలో సాగుచేయట ద్వారా అధికోత్పత్తి సాధించుచున్నాము. మన దేశములోని భారతీయ వ్యవసాయ పరిశోధనా సంస్థ, మన రాష్ట్రములో మారుటేరులోను, బెంగుళూరు వ్యవసాయ విశ్వవిద్యాలయము, తమిళనాడులో అడుతురై లోను ఈ రకమైన పరిశోధనలు విరివిగా సాగుచున్నవి. అట్టి ప్రయత్నాల ద్వారా ఈ మధ్యనే కొన్ని వరి సంకర రకాలు సాంద్ర వరిసాగు ప్రాంతాలలో వాటి అనుకూలత, దిగుబడులు తెలిసికొనుటకు రైతులకు ఇవ్వడమైనది. అట్టి ప్రదర్శనలు వరి అధికోత్పత్తికి అవకాశముగల తూర్పు, పశ్చిమ గోదావరి, కృష్ణా, నెల్లూరు జిల్లాలు మరియు ఇతర ప్రాంతాలలో జరుగుచున్నవి. ఈ సంకర వంగడాలు ఆగు (యంటియు 2001 నుండి 2010) వేయుట ద్వారా వరి అధికోత్పత్తులు సాధించుటకు ప్రయత్నాలు జరుగుచున్నవి.

## ముగింపు :

ఈ విధముగా ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయాభివృద్ధి ద్వారా మనకున్న ముఖ్యపంటలగు వరి, నూనె గింజలు, పొగాకు, ప్రత్తి, చెఱకు, పండ్లు, పూలు, కూరగాయలు, జనపనార, ఆపరాలు మొదలగు వాటి ఉత్పత్తులు గణనీయంగా పెంచుకోవచ్చును. ఈ పంటలపై ఆధారపడే పరిశ్రమల ఏర్పాటు ద్వారా చాలా మందికి ఉద్యోగావకాశాలు ఏర్పడతాయి. అనుకూలమైన పంటలతోపాటు రైతులు ఎక్కువగా ఆదాయాన్నిచ్చు క్రొత్త పంటలగు సోయా చిక్కుడు, పొద్దు తిరుగుడు, పామాయిల్, మల్బరీ, తేనెటీగల పెంపకం ద్వారా అభివృద్ధి పొందే అవకాశాలు చాలా గలవు. మన సాంద్ర వ్యవసాయానికి వ్యవసాయ పనిముట్లు కూడ చాలా అవసరము. ముఖ్యముగా త్వరితగతిని తక్కువ ఖర్చులోను కూలీ తగ్గించే పనిముట్లు ట్రాక్టర్లు, దమ్ము నాగళ్ళు, దుక్కి, విత్తులువేయు నాగళ్ళు, పైపాటుకు ఉపయోగ పడే గొర్రులు మరియు నీటి వాడకం తగ్గించే స్ప్రింకర్లు, సస్యరక్షణ పనిముట్లు, కోత-నూర్పిడి యంత్రాలు, మెట్ట సాగులో ఉపయోగపడే నాగళ్ళ-పనిముట్లు మొదలగునవి మన వ్యవసాయాభివృద్ధికి చాలా దోహదం చేస్తాయి.

మన రాష్ట్రములో పలు విధాల వ్యవసాయాభివృద్ధి చెందుతున్నా, అడవుల పెంపకం, గిరిజన ప్రాంతాల అభివృద్ధిలోను, వ్యవసాయ ఉత్పాదకాలను (inputs) పురుగు-తెగుళ్ళు కలుపు నివారణ మందులు మరియు మొక్కల పెరుగుదల ప్రేరకాలు (Hormones) ఎరువులు మొదలగు వాటి నాణ్యతలపై నియంత్రణలోను, మెట్ట సాగులో ఉత్పత్తుల స్థిరీకరణలోను, చౌడు-క్షార మరియు నీటి ముంపు-మురుగు నీటి పారుదల సరిగాలేని నేలలల అభివృద్ధిలోను, నీటి వాడకం మరియు చిరుధాన్యాల దిగుబడుల పెంపకంలోను, నూనె గింజల చెక్క-పిండిలోని పోషకాల పూర్తివినియోగంలోను మరియు రాష్ట్ర సాంఘిక-సంక్షేమ కార్యక్రమాలలోను చాల కృషిచేయవలసి ఉన్నది. అప్పుడే మన రాష్ట్రం సర్వతాభివృద్ధి చెందినట్లు అగును.





గుత్తా సుఖేందర్ రెడ్డి
చైర్మన్

ఉత్పత్తిదారులు, వినియోగదారుల మధ్య వారధి

# నల్లగొండ-రంగారెడ్డి జిల్లాల పాల ఉత్పత్తిదారుల యూనియన్ లిమిటెడ్

మదర్ డెయిరీ, హయాత్ నగర్, హైదరాబాద్. ఫోన్లు: 531695, 530358, 530646

> పాల ఉత్పత్తిదారుల శ్రేయస్సే మా లక్ష్యం
> మా సేవలే ఇందుకు సాక్ష్యం

## మా కృషి ఫలితం

- మన రాష్ట్రంలోనే అత్యధిక ధర కిలో గేదెపాల వెన్నకు 105 రూ., ఆవుపాలు కిలో ఘన పదార్థములకు 45 రూపాయలు చొప్పున పాల ఉత్పత్తిదారులకు గిట్టుబాటు ధర చెల్లిస్తున్నాము.
- ప్రతి 15 రోజులకు ఒకసారి పాల ఉత్పత్తిదారులకు సకాలములో పాల బిల్లులు చెల్లిస్తున్నాము.
- పాల ఉత్పత్తికి కావల్సిన సాంకేతిక సదుపాయాలు సంయుక్తత, దాణా, పశువుల బీమా, పశు మందులు, గడ్డి విత్తనములు సబ్సిడీ ధరపై అందిస్తున్నాము.
- సుమారు 55 వేల మంది పాల ఉత్పత్తిదారులు ఈ సదుపాయాల వల్ల లాభము పొందుచున్నారు.
- పాల ఉత్పత్తిదారులకు 1992-1993 సంవత్సరంలో 9 కోట్ల రూపాయలు చెల్లించాము.
- నల్లగొండ-రంగారెడ్డి జిల్లాల్లో గల పాల శీతల కేంద్రాలు: నల్లగొండ (ఫో: 2275), చిట్యాల (ఫో: 331), భువనగిరి (ఫో: 2104), మార్యాల (ఫో: 20240), మల్లేపల్లి (ఫో: 227), ఆలేరు (ఫో: 28), తాండూరు (ఫో: 2079), వరిగ (ఫో: 22232).
- హైదరాబాద్, నల్లగొండ, నాగార్జునసాగర్, సూర్యాపేట, భువనగిరి, యాదగిరిగుట్టలలో వినియోగదారుల కొరకు pasteurized టోన్డుపాలు లీటరుకు 8 రూ. చొప్పున పాకెట్ల ద్వారా సరఫరా చేయుచున్నాము.
- జంటనగరాలలో ఆటోమాటిక్ మిల్క్ వెండింగ్ ద్వారా 70 వేల లీటర్లు రోజూ సరఫరా చేయుచున్నాము.
- నల్లగొండ-రంగారెడ్డి పాల ఉత్పత్తి సహకార యూనియన్ పాల ఉత్పత్తిదారులచే ఎన్నిక కాబడిన పాలకవర్గం, పాల ఉత్పత్తిదారుల శ్రేయస్సు కొరకు వివిధ కార్యక్రమాలను చేపట్టి కృషి చేయుచున్నది. ఈ అవకాశమును వినియోగించుకొని పాల ఉత్పత్తిదారులు గేదెలతో పాటు సంకరజాతి ఆవులను పెంచి ఎక్కువ ఆదాయమును పొందుటకు ఈ అవకాశమును వినియోగించుకొనగలరని కోరుతున్నాము.

సదా మీ సేవలో...

డా. రావి కోటేశ్వరరావు
జనరల్ మేనేజర్

చైర్మన్, బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ & స్టాఫ్

### బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్

| | |
|---|---|
| గుత్తా సుఖేందర్ రెడ్డి | చైర్మన్ |
| జె. మధుసూధన రెడ్డి | డైరెక్టర్ |
| పి. కృష్ణారెడ్డి | డైరెక్టర్ |
| జి. రంగారెడ్డి | డైరెక్టర్ |
| కె. అంజిరెడ్డి | డైరెక్టర్ |
| బి. లింగారావు | డైరెక్టర్ |
| వి. రాంబాబు | డైరెక్టర్ |
| సి.హెచ్. లింగయ్య | డైరెక్టర్ |
| జి. కృష్ణారెడ్డి | డైరెక్టర్ |
| కె. దావయ్య | డైరెక్టర్ |
| కె. పత్తిరెడ్డి | డైరెక్టర్ |
| వి. రాంరెడ్డి | డైరెక్టర్ |

# ప్రత్తి పైరు పై పచ్చపురుగు, తెల్లదోమల ఉధృతికి కారణాలు



డా॥ యస్. వేణుగోపాలరావు
లాం ఫారం, గుంటూరు- 522034

ఆంధ్రప్రదేశ్‌లో వివిధ జిల్లాల్లో షుమారు 6.5 లక్షల హెక్టార్ల విస్తీర్ణంలో సాగు చెయ్యబడుతున్నప్రత్తి ఒక ముఖ్య వాణిజ్య పంట. ఈ పైరుపై షుమారు 130 బెడద పురుగులను గుర్తించినప్పటికీ మన వాతావరణంలో కేవలం పది పురుగులు మాత్రమే సమస్యాస్థాయిలో వచ్చి నష్టం కల్గించుచున్నట్లు తెలుస్తున్నది. (పట్టిక.1) అయితే, ప్రస్తుత స్థితిలో కేవలం 'పచ్చపురుగు' మరియు 'తెల్లదోమలు' ఉధృతస్థాయిలో వచ్చి గత 7-8 పంటకాలాల్నుండి పైరుపై రు. 2500 నుండి రు.3500 (ఎకరాకు) ఖరీదు చేసే పురుగు మందుల్ని వాడేట్లు చేస్తూ ఎక్కువ ప్రాంతాల్లో అది నష్టకరంగా పరిణమించే స్థితి వస్తున్నట్లు మన అనుభవం చెప్తున్నది. ఈరీత్యా ప్రస్తుత అంచనాలననుసరించి ఒక్క గుంటూరు జిల్లాలోనే షుమారు 4 లక్షల ఎకరాల ప్రత్తిపై, 120 కోట్ల రూపాయల విలువ చేసే పురుగు మందులు వాడబడుచున్నవి. ఈ స్థితి కలగటానికి కారణాలు పరిశీలిస్తే మనకీ పురుగుల యాజమాన్యం విషయంలో చేయదగ్గ పనులు గుర్తించినట్లే.



తెల్ల బంగారం

" పచ్చ పురుగు" విశ్వవ్యాపితంగా అన్ని ప్రాంతాల్లో ముఖ్యంగా ప్రత్తి పండించే ప్రాంతాల్లో ఈనాడు పెద్ద బెడదగా మారింది. అదేవిధంగా " తెల్లదోమ" కూడా పెక్కుపైర్లపై వైరస్ తెగుళ్ల వ్యాప్తిచేసే ముఖ్యరసం పీల్చే పురుగ్గా అన్నియు ఖండాల్లో గుర్తించ బడినది.

అయితే ఈ రెండు పురుగులు భారత దేశ ప్రత్తి వ్యవసాయంలో 1980వ దశకంలో ప్రవేశించి 1984 - 86 పంటకాలాల్లో తెల్ల దోమ మరియు 1986 - 93 పంటకాలాల్లో పచ్చపురుగు తీవ్ర నష్టాన్ని కల్గించాయి. కావున మనకు బెడదగా మారిన 10పురుగుల్లో ఈ రెండే అతికీలకమైనవిగా మారేందుకు దోహద పడుతున్న పరిస్థితులేమిటి?

**1. సాగు విధానంలో వచ్చిన మార్పు :** ఆంధ్రప్రదేశ్‌లో ఆనవాయితీగా దేశీయ ప్రత్తి వంగడాలను సాగు చేస్తూ వచ్చిన కర్నూలు, ఆదిలాబాద్, వరంగల్ జిల్లాల్లో కంటే ముందుగా అమెరికన్ ప్రత్తి రకాలను గుంటూరు, ప్రకాశం, కృష్ణా జిల్లాల్లో ఆదరించడం జరిగింది. 1975 -76 నాటికల్లా గతంలో పండించబడుతున్న జొన్న, వేరుశనగ, మొక్కజొన్న, పెసర, నువ్వు, కంది, మినుము, మిర్చి, పొగాకు, ధనియాలు, శనగ, మెట్ట వరి వంటి పంటల స్థానంలో నల్లరేగడి భూముల్లోకి ఈ ప్రత్తి ప్రాకటం జరిగింది. 1979 - 80 నాటికి షుమారు 5 లక్షల ఎకరాలు ఈ మూడు జిల్లాల మెట్టభూముల్లో ఈ పైరు వేయటం జరిగింది. దీనికి ముఖ్యకారణం యితర మెట్ట పైర్లకంటే ఇది లాభసాటిగా మార్పు చెందిందింది. ప్రభుత్వ పరంగా ప్రత్తి విస్తారంగా సాగు చేసేట్లుగా ప్రచారం సాగించి, మంచి మద్దతు ధరల్ని యిప్పించడం జరిగింది. అంతేగాక పొగాకు వ్యాపారం స్థానే ప్రత్తి వ్యాపారం ప్రాకి, ఎక్కువ మంది వ్యవసాయ కూలీలకు పని దొరుకుతున్నట్లు ఆశాజనకంగా పైకి కనబడుతూవచ్చింది, ఈ స్థితిలో ప్రపంచ వ్యాపితంగా

వ్యవసాయంలో వచ్చిన మార్పులో భాగంగా అధిక కృత్రిమ ఎరువులు మరియు ఇతర రసాయనాలు మార్కెట్ లోకి ప్రవేశ పెట్టబడినాయి. దరిమిలా ఎక్కువ మండలాల్లో మెట్ట ప్రాంతమంతా అమెరికన్ ప్రత్తి రకాల్ని రైతులు సాగు చేసే స్థితికొచ్చారు. ఈ క్రమంలో వివిధ ఇతర వృత్తుల వాళ్ళు కూడా ప్రత్తి సాగుకు ఎగబడి ఇదొక అధిక లాభాన్ని తెచ్చి పెట్టే పైరుగా- వ్యాపారంగా-మార్చడం జరిగింది. తద్వారా గతంలో రైతు లాచరించే వివిధరకాల పైర్ల సాగు మరియు కాలు మార్చే (crop rotation) విధానాన్ని వదులుకొని ప్రత్తిని విస్తారంగా సాగు చేసారు. 1983-84 పంటకాలానికి షుమారు 4.8 లక్షల ఎకరాలు ఒక్క గుంటూరు జిల్లాలోనే ప్రత్తి వేయటం జరిగింది. తద్వారా ఆంధ్రప్రదేశ్ ప్రత్తి ఉత్పత్తి భారత దేశంలో అన్ని రాష్ట్రాలకన్నా ఎక్కువ జరిగినట్లు ధాఖలాలున్నాయి. అయితే 1984 నుండి "ప్రత్తిరైతు" నష్టస్థాయికి నెట్టివేయబడ్డాడు.



అధిక రక్షణ ద్వారా పెరిగిన ప్రత్తిపైరు

**2. ప్రత్తి వంగడాల వ్యాప్తి :** ఈ క్రమంలో పురుగుల, తెగుళ్ల స్పృహ లేకుండా వ్యవసాయ విస్తరణ శాఖ మరియు వ్యవసాయ శాస్త్ర పరిశోధకులు, కేవలం దిగుబళ్లకు మాత్రమే ప్రాముఖ్యతనిస్తూ, గతంలో మనం సాగుచేసే దేశీయవంగడాల ప్రత్యేకతను విస్మరించి, అన్ని విధాలా అమెరికన్ ప్రత్తి వంగడాల ఉత్పత్తికి, వ్యాప్తికి మరియు విస్తృత సాగుకు దోహదం చేశారు. అందువలన ఒకేలక్షణాలు గలిగిన ప్రత్తి వంగడాలు, హైబ్రిడ్లు ఎక్కువగా ఉత్పత్తి చేయబడి మొక్కల్లో ఉండే వైవిధ్యాన్ని పోగొట్టి కొన్ని జీవులకు అనుకూలంగా మార్పు చేయడం జరిగింది.

గతంలో ఎక్కువ ప్రాంతాల్లో సమస్యగా మరిన పచ్చదోమను దృష్టిలో పెట్టుకొని తయారు చేసిన ప్రత్తి వంగడాలనే మన వాతావరణంలో కూడా ప్రోత్సహిస్తూ , వాటి లక్షణాల్నే మళ్లీ మళ్లీ ఇతర రకాల్లోకి ఎక్కించి క్రొత్త వంగడాల్ని రూపకల్పన చేశాం. ఈ క్రమంలోనే, యం. సి.యు.5, ఎల్ ఆర్ ఎ, హెచ్-4 , జె.కె. హెచ్ వై 1, అమరావతి, సంగం, హెచ్6, బూరి 1007 వంటివి వచ్చాయి.

**3. అనుకూలమైన వాతావరణం :** ప్రత్తిపైరుకు అనుకూలించే ఈ ప్రాంత వాతావరణం పెక్కు పురుగులకు తెగుళ్లకు కూడా అనుకూలమనేది గమనించ వలసిన ముఖ్య విషయం. సగటు ఉష్ణోగ్రత 30-35° సెల్సియస్ మరియు గాలిలో తేమ 75-80 శాతం, జల్లుల స్థాయిలో వర్షపాతం ప్రత్తి సాగు కాలమైన జూలై, డిశంబర్ మాసాల్లో ఎక్కువగా ఉండటం వలన, పెక్కు పురుగులు గుబురుగా పెరగగలిగిన అమెరికన్ జాతి ప్రత్తి వంగడాలపై అభివృద్ధి చెందుతున్నాయి. ఎక్కువ వేసి, వర్షం పూర్తిగా ఆగిపోయిన ఫిబ్రవరి - మే మాసాల్లో కూడా తేమగా ఉండే ప్రాంతాల్లో పురుగుల పెరుగుదలకు సాంద్ర వ్యవసాయ పథకాల పరిణామంలో దోహదపడటం జరిగింది.

ఉత్తర భారతదేశంలో 40-105 రోజులు తీసుకొనే తెల్లదోమ జీవిత తెర (life cyle) ఈ ప్రాంతంలో 13.5 - 21 రోజుల్లోనే పూర్తిచేయగల మనేది గమనించవలసిన ముఖ్య విషయం. అదే విధంగా పచ్చపురుగు కూడా యిక్కడి వేడి, తేమల ననుసరించి అతి వేగంగా వృద్ధి చెందగలగటమే గాక, పంజాబ్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాల్లో మాదిరికాకుండా. ఇక్కడ ఏ రకమైన విశ్రాంతి కాలం (hiberation / aestivation periods) లేకుండా నిర్విఘ్నంగా తమ జీవిత చక్రాల్ని నడపగలిగే స్థితున్నది.

**4. సంవత్సరమంతా పురుగు జీవిత చక్రాల్ని నిలుపుతున్న సాగు పద్ధతులు :** నాగార్జున సాగర్ ప్రాజెక్టు ఆయకట్టు ప్రాంతంలో పరిశీలంచిన దాన్నిబట్టి ముఖ్య గడ్డు పురుగులు అయిన ఈ రెండు, వేసవిలో కూడా వివిధ కలుపు మొక్కలపై, కూరగాయపైర్ల పైన, పూల మొక్కల పైన, అదే విధంగా అక్కడక్కడా పండించబడే విత్తన ప్రత్తి పైన మరియు కాయధాన్య పైర్లపైన వృద్ధి చెందుతున్నట్లు గమనించ బడినది. అంతేగాక అధిక దిగుబడి స్పృహతో రైతులు, ప్రత్తి పంటకాలాన్ని మార్చి-ఏప్రిల్ నెలల వరకు పొడిగించడం వలన మరియు ప్రత్తి తీయగానే పొలంనుండి తీసివేయకుండా మిగిల్చిన మోళ్ళు చిగిర్చడం వలన, ఈ పురుగుల తెరలకు అడ్డు లేకుండా,

# ప్రగతి పథంలో తుళ్ళూరు గ్రామ పంచాయితీ

## తుళ్ళూరు మండలం, గుంటూరు జిల్లా.

### గత ఐదు సంవత్సరములలో సాధించిన ప్రగతి

#### జిల్లా ప్రజాపరిషత్ నిధులు

| | | |
|---|---|---|
| 1. | రెండుమంచినీటి సరఫరా పథకం | 23.00 లక్షలు |
| 2. | తుళ్ళూరు నుండి వెలగపూడిరోడ్ | 1.50 లక్షలు |
| 3. | తుళ్ళూరు నుండి అబ్బరాజా పాలెంరోడ్ | 6.00 లక్షలు |
| 4. | తుళ్ళూరు నుండి నేలపాడు రోడ్ | 5.00 లక్షలు |
| 5. | తుళ్ళూరు నుండి అమరావతి రోడ్ | 3.00 లక్షలు |
| 6. | చెరువులు రిపేరు | 2.00 లక్షలు |
| 7. | 2 స్కూలు బిల్డింగ్స్ | 2.00 లక్షలు |
| 8. | టీచర్స్ సెంటర్ క్లాసు బిల్డింగ్ | 2.50 లక్షలు |
| 9. | బలహీనవర్గాల కాలనీలో రోడ్లు | 0.60 లక్షలు |
| 10. | వ్యక్తిగత మరుగుదొడ్లు | 3.50 లక్షలు |
| 11. | సామూహిక మరుగుదొడ్లు | 1.00 లక్షలు |
| 12. | పంచాయితీ బిల్డింగ్ | 1.30 లక్షలు |
| 13. | జడ్.పి.పి. స్కూలు బిల్డింగ్స్ రిపేరు | 2.00 లక్షలు |
| | మొత్తం రు. | 51.40 లక్షలు |

#### మండల ప్రజాపరిషత్తు నిధులు

| | | |
|---|---|---|
| 1. | తుళ్ళూరు నుండి వెలగపూడి రోడ్ | 0.80 లక్షలు |
| 2. | బలహీన వర్గముల కాలనీలో రోడ్లు | 0.30 లక్షలు |
| 3. | స్కూలు బిల్డింగ్స్ రిపేరు | 0.40 లక్షలు |
| | మొత్తం రు. | 1.50 లక్షలు |

#### పంచాయితీ నిధులు

| | | |
|---|---|---|
| 1. | రోడ్లు పంతెనలు, సైడ్ కాల్వలు | 3.00 లక్షలు |
| 2. | మంచినీటి పథకం పైపులైన్ విస్తరణ, పబ్లిక్ ట్యాపులు (స్కీంనిర్వహణ) | 3.00 లక్షలు |
| 3. | పంపులైను వద్దకు 3వ వైరు | 0.40 లక్షలు |
| 4. | బలహీన వర్గముల కాలనీలో కొత్తగా లైన్లు అండ్ లైట్లు | 2.00 లక్షలు |
| 5. | పబ్లిక్ హెల్తు | 1.00 లక్షలు |
| | మొత్తం రు. | 9.40 లక్షలు |

#### రోజ్‌గార్ నిధులు

రోడ్లు, పక్కా సైడ్ కాల్వలు, పంతెనలు, బావులు చేతి పంపులు, మంచినీటి పైపు లైన్స్ విస్తరణ మరియు పబ్లిక్ ట్యాపులు. 8.50 లక్షలు

(ఎస్.సి.ఎస్.టి.,బి.సి.లకు 5.00 లక్షలు ఖర్చు చేయబడినవి).

#### ఇతర గ్రాంటులు

| | | |
|---|---|---|
| 1. | బలహీనవర్గముల వారికి పక్కా ఇండ్లు | 20.00 లక్షలు |
| 2. | నర్సింగ్ ట్రైనింగ్ సెంటర్ బిల్డింగ్ | 15.00 లక్షలు |
| 3. | ఎస్.సి.బాలికల హాస్టలు బిల్డింగ్ | 10.00 లక్షలు |
| | మొత్తం రు. | 45.00 లక్షలు |

మరియు గ్రామములో రు. 5.00 లక్షలు విలువ కల్గిన పనులు ప్రారంభించబడినవి.



సర్పంచ్

శ్రీ నిమ్మగడ్డ పూర్ణ చంద్రరావు

(ఉరఫ్ సాయిబాబు)

పాలకవర్గము : శ్రీ తాడిపనేని రాఘవయ్య, ఉప సర్పంచ్

శ్రీ నేలపాటి బుజ్జితరావు
శ్రీ మేకల జీవరత్నం
శ్రీ కంతేటి పెదనాగేశ్వరరావు
శ్రీ కొమ్మినేని అప్పారావు
శ్రీ కామినేని కృష్ణారావు
శ్రీ ఆలూరి శేషయ్య
శ్రీ ధరావత్ చిన్న నాయక్
శ్రీ జమ్ముల గోపాలరావు
శ్రీ వరుపూరామమోహనరావు
శ్రీమతి కొండపనేని వెంకటనరసమ్మ
శ్రీమతి జొన్నలగడ్డ ప్రభావతి
శ్రీ షేక్ అల్లాబక్షు

సిబ్బంది : శ్రీ యం.డి.రామిరెడ్డి, జూనియర్ అసిస్టెంటు; శ్రీ సి.హెచ్.గాలయ్య; బిల్‌కలెక్టర్ శ్రీ వి. కోటయ్య; అటెండరు; శ్రీ బి. బాబురావు, శ్రీ షేక్ ఆదంసాహెబ్, పి.డబ్ల్యు.ఎస్. సిబ్బంది శ్రీ బి. చంద్రయ్య, శ్రీ వి. కోటయ్య, శ్రీ బి. వెంకటేశ్వర్లు, శ్రీ యం. శ్రీను, స్వీపర్లు.

గడ్డుకాలంలో కూడా వృద్ధి అయ్యేందుకు దోహద పడుతున్నది. మే-జూన్ మాసాల్లో అధికంగా నీటి వనరులున్న తెనాలి, విజయవాడ, మంగళగిరి ప్రాంతాల్లో గమనించిన విషయం - ఈ ప్రాంతంలో సాగు చెయ్యబడుతున్న లిల్లీలు, కనకాంబరం వంటి పూల పైర్లపై బెండ, వంగ, దోస, బీర పైర్లపై కూడా పచ్చపురుగు, తెల్లదోమ వృద్ధి చెందగలవు. అదేవిధంగా కొన్ని ప్రాంతాల్లో "నిమ్మ" మీద కూడా పచ్చ పురుగు పెరుగుతున్నట్లు గమనించడమైనది. కావున అధిక నీటివనరులు సాగులాయకమైన ప్రాంతాలున్నప్పుడు, పురుగుల వృద్ధి జరగటం సహజంగా ఉండే పరిణామం.

**5. ఎక్కువ వ్యవసాయక రసాయనాల వాడకం :** అధిక దిగుబడి "సస్య విప్లవం" వంటి ప్రపంచ వ్యాపితంగా వచ్చిన మార్పుల్లో విచక్షణా రహితంగా కృత్రిమ రసాయనిక ఎరువులు ఎక్కువ అందుబాటులోకి తేబడటం పురుగుల, తెగుళ్ల పెరుగుదలకు దోహదపడినట్లు యిప్పుడు అందరికీ తెలిసిన విషయమే.


తెల్లదోమ

అదే క్రమంలో కృత్రిమ రసాయనిక క్రిమి సంహారక మందులు, భారతదేశంలో స్వేచ్ఛావాణిజ్య ప్రతిఫలంగా విస్తృతంగా వ్యాపింప చేయబడ్డాయి. ఆర్గనోక్లోరిన్, ఆర్గనో ఫాస్ఫరస్, కార్బమేట్ తరగతి మందులు వివిధ దశల్లో ఈదేశ వ్యవసాయం లోకి చొప్పించబడి పెక్కు ప్రాంతాల్లో వరి, ప్రత్తి, చెఱకు, కూరగాయలు ఈ మందుల్లేనిదే పండించలేని స్థితికి తెచ్చుకొన్నాం. వివిధ దేశాల్లో ఎన్నో రకాల నష్టాల్ని కల్గించినట్లు అనుభవం చెప్తున్న "సింథటిక్ పైరెత్రాయిడ్స్" అనే క్రొత్త రకం మందులను కూడా ప్రవేశింపజేసి, ప్రత్తి దిగుబళ్ళు ద్విగుణీకృతం చేసుకొన్నట్లు చెప్పుకొన్నాం. కాని రానురాను ఈ విషాలే తమలో తెచ్చిన రెండవ చెడును బయటపెట్టాయి. గింజల్లో, గడ్డిలో, దూదిలో, పంచదారలో, పాలలో తమ అవశేషాలు మిగల్చడం వలన కలిగే నష్టాన్ని, వాతావరణ కాలుష్యాన్ని ఆర్థిక నష్టాన్ని పరిగణించలేని మన అంచనాలను గమనించలేకపోయినా, క్రొత్త పురుగులు అతిశక్తితో పాతపురుగులను జీవులను తొలగించుకొంటూ (replacement) ఊహించలేనంత వేగంగా పెద్ద గడ్డుసమస్యగా మారటం మనం గమనించాం. ఈ జీవ సమతుల్య ఛేదన వలన మనం ఎదుర్కొనలేని సమస్యల్ని భరించ వలసి వచ్చింది.

**6. మిత్రజీవుల నాశనం :** ప్రత్తిపైరుపై వివిధ దశల్లో వివిధ రకాల పురుగులు వస్తాయని మనం ముందుగానే చెప్పుకొన్నాం (పట్టిక -1). అయితే వీటి ననుసరించే శత్రుజీవులు కూడా పెరుగుతూండడం మన పైరు వాతావరణంలో గమనించవచ్చు. మొదటి దశలో వచ్చే రసం పీల్చే పురుగుల్ని తలనత్తను అనుసరించి వివిధ ఉపయోగమైన జీవులు పెరగటం అది సహజం. అయితే ఈ రసం పీల్చే పురుగుల అదుపుకు మనం కృత్రిమ మందులు చల్లినప్పుడు, మన మిత్రజీవులు సమూలంగా నాశనం చేయబడతాయి. ఇటువంటి స్థితి ఉన్నప్పుడు, తరువాతి దశలో ప్రవేశించే పురుగు పోటీ పురుగులు, సహజ అదుపులేని స్థితిలో పేట్రేగిపోవటం మామూలు. అటువంటి స్థితిలో మనం యింకా ఎక్కువ శక్తివంతమైన మందుల్ని వాడటం మొదలెట్టాం. అవి కొంత వరకు పని చేశాయి. తరువాత మార్పు మనం చూశాం.

**7. పురుగు మందుల వలన పురుగు వృద్ధి :** ప్రపంచ వ్యాపితంగా గమనించబడిన మరో ముఖ్య విషయం - పురుగు మందులు చల్లడం వలన పురుగు అతివేగంగా వృద్ధి చెందటం (resurgence) మరియు ఘాటైన మందుల్ని కూడా తట్టుకొనే శక్తి పెంపొందించుకొనడం (resistance) ఈ రెండు ముఖ్య ప్రక్రియలు మన ప్రత్తి పురుగుల్లో ప్రవేశించినట్లు మన అనుభవం చెప్తున్నది. పురుగు మందుల వలన పేను పురుగు, పచ్చదోమ, ముడుత పురుగులతో పాటు పెక్కు బదనిక పురుగులు సమూలంగా నాశనం చెయ్యబడిన స్థితిలో తెల్లదోమ రసం పీల్చే ముఖ్య పురుగ్గా ప్రవేశించి, సింథటిక్ పైరెత్రాయిడ్ మందులను తనకనుకూలంగా మార్చుకొని, అతి వేగంగా పెర్గ్గ లిగినట్లు గమనించబడినది. వాతావరణంలో బెట్ట, పైరు గుబురుగా (తద్వారా గాలిలో తేమ) పెరగడం, ఆకులపై ఎక్కువ నూగండటం, ఈ పురుక్కి యింకా అనుకూలంగా పరిణమించాయి. అదేవిధంగా, తలనత్త, పొగాకు లద్దెపురుగుల వంటి ముఖ్య కాయతొల్చే గూడతినే పురుగుల సమూల నశింపు వలన, మరియు పెక్కు ఉపయుక్త జీవుల నాశనం వలన, శనగ పచ్చ పురుగు ప్రత్తిలో పెరగటం మరియు ఘాటైన మందుల క్కూడా

# వ్యవసాయ మార్కెట్ కమిటీ

## జనగామ.

రైతు సంక్షేమమే – దేశ సౌభాగ్యం

శ్రీ పి. లక్ష్మయ్య,ఎం.ఎల్.ఎ

శ్రీ పి. నర్సింహస్వామి, చైర్మన్

జనగామ వ్యవసాయ మార్కెట్ కమిటి 1950వ సంవత్సరములో స్థాపించి గత 43 ఏండ్లుగా రైతు వెన్ను తట్టి దిన దినాభివృద్ధి చెందుతు అభివృద్ధి దిశలో పయనిస్తున్నది.

ప్రస్తుతము మార్కెట్ కమిటి ఆదాయము రు. 25.00 లక్షలకు చేరుకొని ఇంకా భవిష్యత్తులో సాలీనా ఆదాయము పెంచుటకు కమిటి కృషి చేస్తున్నది.

రైతుకు గిట్టుబాటు ధర పలికే వరకు ధాన్యము నిల్వ చేసుకొను వసతి సరుకులపై నెలవరకు వడ్డీ లేకుండ రు.10,000/- ల రుణ సౌకర్యము మిగతా (2) నెలల వరకు 6% సం.ము నకు వడ్డీ చొప్పున విధింపులో రు.8,46,300=00 ల వరకు (92) మంది రైతులు లబ్ధిపొందియున్నారు. ప్రస్తుతము ఈ రుణ సౌకర్యము అమలు జరుగుచున్నది.

మార్కెటు యార్డు ఆవరణ (28) ఎకరములలో విస్తరించి 4-00 ఎకరములలో కార్టింగ్ స్థలములో రు.10.00 లక్షల ఖర్చుతో మెంటింగ్ చేయబడినది.

రైతులకు విశ్రాంతి భవనము, మెరిక్యూరి లైట్ల సౌకర్యము, తూనిక హెడ్లు, త్రాగునీటి వసతి, గిడ్డంగులు, కార్యాలయ భవనము ఫలహారశాల మొదలగు సౌకర్యములతో జనగామ మార్కెటు యార్డుకు వచ్చు రైతులకు మరియు మార్కెట్ యార్డు వినియోగదారులకు వసతులు కల్పించ బడినవి.

మార్కెట్ యార్డు చుట్టు ప్రహరి గోడ నిర్మాణము, అప్రోచ్ రోడ్ల నిర్మాణము అదనపు విద్యుత్ సౌకర్యము మరియు త్రాగునీటి సౌకర్యముల కొరకై దాదాపు రు.40.00 లక్షల ఖర్చుతో అభివృద్ధి పనులు చేపట్ట బడుచున్నవి.

శ్రీ పొన్నాల లక్ష్మయ్య, శాసన సభ్యులు గారి నేతృత్వములో జనగామ వ్యవసాయ మార్కెట్ కమిటి అన్ని హంగులను దశలవారీగాఏర్పాటు చేసుకుంటు స్వావలంబన దిశగా పయనిస్తున్నది. అభివృద్ధి విషయములో సలహాలను సదా ఆహ్వానిస్తూ.

శ్రీ కె.దేవేందర్
ప్రత్యేకశ్రేణి కార్యదర్శి

శ్రీ వరవస్తు నరసింహస్వామి.
చైర్మన్

సర్వశ్రీ

1. గోపాల్ లోహియా,వైస్ చైర్మన్–వ్యాపార ప్రతినిధి
2. రామిని సుదాకర్–గౌరవ సభ్యులు ,,
3. పజ్జూరి జయహరి ,, ,,
4. యన్. సంజీవ రెడ్డి ,, రైతు ప్రతినిధి
5. కె.రామస్వామి ,, ,,
6. డి. వెంకట రెడ్డి ,, ,,
7. సి. హెచ్. మల్లయ్య ,, ,,
8. వై. బాల్ రెడ్డి ,, ,,
9. జిల్లెల్ల మల్లా రెడ్డి ,, ,,
10. గుగులోతుబోజ్య ,, ,,
11. ఆర్. బాల సోమయ్య ,, ,,
12. బి. పరుశురాములు ,, ,,
13. కె. సాయి మల్లయ్య ,, ,,
14. ఎన్. శ్రీశైలం ,, ,,
15. వి. వెంకట రాంరెడ్డి ,, ,,

తట్టుకొనటం, మనం జరిగిన విషయాన్ని క్రోడీకరించుకొంటే అర్థమౌతున్నది.

శనగ పచ్చ పురుగు లార్వా 1970-73 పంటకాలాల్లో కేవలం 0.07% మందుకు (ఎండోసల్ఫాన్) చచ్చే స్థితి ఉంది. అటువంటి పురుగు గత యిరవై సంవత్సరాల్లో వచ్చిన మార్పు వలన 3.5% మందుకు చచ్చేస్థితి కొచ్చింది. అదేవిధంగా సైపర్‌మెత్రిన్, ఫెన్‌వరేట్ వంటి కొత్త రకాల మందులకు కూడా 40-50 కారెట్ల తట్టుకొనే ఈ పురుగు మిగిలిన వాటి కంటే ప్రత్యేక లక్షణాలు కలదని తేలుతుంది. అంతేగాక, మన ప్రత్తి సాగులో రసాయనిక మందుల ద్వారా తెచ్చిన "అధిక వత్తిడి"కి యిది ఫలితమనేది మనమీనాడు అంగీకరించవలసిన సత్యం.

**8. స్వయసిద్ధ లక్షణాలు :** పురుగుల తరగతుల్లో ముఖ్యమైనదిగా పరిగణించబడే లెపిడొప్టెరా (పొలుసు రెక్కలుండే)కు చెందిన "హీలీ యోథిస్ (పచ్చపురుగు). అతి నష్టాలకు వివిధపైర్లలో దారితీస్తున్న, పొగాకు లద్దెపురుగు, ఆముదపు నామాల పురుగు, రెల్లరాల్చే పురుగులు, కంకి పురుగులు, ఆకు పురుగులు వంటి వాటి యొక్క దాయాదని గమనించాలి. అదేవిధంగా హెమూప్టెరా తరగతికి చెందిన తెల్ల దోమ, పేను బంక పురుగులకు, నుడి తెగులు పురుగులకు దగ్గరదని కూడా తెలిసికోవాల్సుంది. అంటే వైవిధ్యమైన ఆహార, వాతావరణ పరిస్థితుల్లో పెరుగుతూ, అభివృద్ధిచెంది నష్టస్థాయిలోకి మారేందుకు తగిన "శక్తి గలవనేది" మనం గుర్తించాలి. అయితే ఈ రెండు పురుగులపై బడనికలు అన్ని వాతావరణాల్లోనూ పెరుగుతూనే వుంటాయి.

ఈ ముఖ్య ప్రత్తి బెడద పురుగుల అదుపుకు సామూహిక పద్ధతులు అమలు చేయగల్గిన చైనా, ప్రత్తి పొలాల్లోకి వదలడంచేసి మంచి ఫలితాలు సోవియట్ యూనియన్ దేశాల్లో, బదనిక మరియు పరాన్న బుక్కులను కృత్రిమ వృద్ధిచేసి విస్తృతంగా పొందినట్లు ప్రపంచవ్యాపితంగా తెలిసిన సత్యం. కాని అభివృద్ధి చెందుతున్న భారత వ్యవసాయంలో దీనికి విరుద్ధమైన ప్రక్రియలు ఆచరణ లోకి వచ్చి పెక్కు దేశాల్లోకి ప్రత్తి వ్యవసాయం మాదిరి ఈనాడు కష్టాల ఊబిగా పరిణమించింది.

# భద్రత కలిగిన చిన్న మొత్తాల పొదుపు స్కీములో పొదుపు చేయండి.

# పెద్ద మొత్తంలో లాభాలను పొందండి.

కిసాన్ వికాస పత్రం



5 1/2 ఏళ్ళలో మీ సొమ్మును రెట్టింపు చేసుకోండి.

**కిసాన్ వికాస్ పత్రం :** అతి సులువైన, సురక్షితమైన ఈ పెట్టుబడి మీకు రెట్టింపు సొమ్మునీ అందిస్తుంది. 2-9-93 నుంచి కొన్న సర్టిఫికెట్టు చెల్లింపు విలువ రూ. 1000/- పెట్టుబడి పెట్టి, 5½ ఏళ్ళ తర్వాత 2000/- పొందండి.

ఉదా॥ (రూ. 1000 పెట్టుబడికి)

| కాలపరిమితి | మొత్తం (రూ.) |
|---|---|
| 2½ ఏళ్ళ తర్వాత | 1310 |
| 3 ఏళ్ళ తర్వాత | 1420 |
| 3½ ఏళ్ళ తర్వాత | 1500 |
| 4 ఏళ్ళ తర్వాత | 1620 |
| 4½ ఏళ్ళ తర్వాత | 1730 |
| 5 ఏళ్ళ తర్వాత | 1860 |
| 5½ ఏళ్ళ తర్వాత | 2000 |

★ 18% సామాన్య వడ్డీ అన్నమాట – 5 1/2 ఏళ్ళలో మీ పెట్టుబడి రెట్టింపు అవుతుంది.

★ **Rs. 100/-, Rs. 500/-, Rs. 1000/-, Rs. 5000/-, Rs.10,000/-** డినామినేషన్లలో దొరుకుతాయి.

★ 2½ ఏళ్ళ తర్వాత తిరిగి తీసుకొనే అవకాశం.

★ పెట్టుబడికి గరిష్ఠ పరిమితి లేదు.

★ ఒక్క విత్తుతో రెండు పంటలను పొందండి. కిసాన్ వికాస్ పత్రంలో జమచేసి రెట్టింపు లాభం పొందండి.







ఇతర వివరాలకోసం: నేషనల్ సేవింగ్స్ ఏజెంట్స్‌ని గానీ, స్పెషల్ తహసీల్దార్, కలక్టర్ కార్యాలయంలో గానీ, సమీప పోస్టాఫీసులో జాతీయ పొదుపు సంస్థ జిల్లా అధికారినిగానీ అడిగి తెలుసుకోండి!

కమీషనరు
చిన్న మొత్తాల పొదుపు సంస్థ, 5th Floor, ఇన్సూరెన్స్ బిల్డింగు
తిలక్ రోడ్, ఆబిడ్స్, హైదరాబాదు - 500 001.
Ph : 234412

ఈ కూపన్ పూర్తి చేసి ఈ రోజే పోస్ట్ చేయండి.

ఈ స్కీము నాకు ఏ విధంగా ఉపయోగ పడుతుందో ఇంకా తెలుసుకోవాలనుకుంటున్నాను. దయచేసి వివరాలు తెలుపండి.

పేరు : ......................................................

చిరునామా : ......................................................

స్కీము : ......................................................

Apple 316 93

మీ భద్రతే మా లక్ష్యం

# ప్రత్తి పైరు వివిధ దశల్లో ఆశించేపురుగు – వాటిననుసరించే ఉపయుక్త జీవులు

| పైరుదశ<br>వివరాలు | మొక్కదశ<br>(0–30 రోజులు) | గూడ–పూత–పిందెదశ<br>(35–75 రోజులు) | కాయ దశ<br>(75–110 రోజులు) | ప్రత్తి పగిలేదశ<br>(120–160 రోజులు) |
|---|---|---|---|---|
| ముఖ్య పురుగులు | • పచ్చదోమ<br>• మసిపేను<br>• ఆకు ముడత పురుగు<br>• తలనత్త | • తలనత్త లేక గూడపురుగు<br>• మసిపేను<br>• పచ్చపురుగు<br>• తెల్లదోమ | • పచ్చ పురుగు<br>• తెల్లదోమ<br>• పొగాకు లద్దెపురుగు<br>• నాంజెముడు పురుగు | • గులాబి రంగు కాయతొల్చే పురుగు<br>• పత్రనల్లి<br>• దూది మరక పురుగులు |
| కల్గించు నష్టం | 1. రసం పీల్చబడటం వలన మొక్క ఎదుగు దల తగ్గడం<br>2. తలనత్త వలన పెరిగే భాగం నాశనం చెయ్య బటం | 1. గూడ నాశనం చెయ్యబడటం<br>2. రసం పీల్చబడి మొక్క పెరుగుదల తగ్గడం<br>3. మసి తెగులు వ్యాపించి పరోక్షంగా ఎంతో నష్టం | 1. పూత, పిందె, కాయ ఆకులు నాశనం చేయబటం<br>2. ఉధృతంగా వచ్చినపుడు మొక్కలు మోడుగా మిగలటం<br>3. మసి తెగులు వ్యాపించడం<br>4. మొక్కలు ఎండిపోవటం | 1. కాయ లోపలి గింజలు డొల్లచేయబడడం<br>2. ఆకులు ఎర్రగా మారి త్వరగా రాలిపోవడటం<br>3. దూది లక్షణాలు చెడి పోవటం |
| పురుగుపై బ్రతికే ముఖ్య బదనికలు లేక పరాన్న భుక్కులు | 1.మచ్చల పెంకు పురుగులు (కాక్సినెల్లిడ్స్)<br>2. సిర్ఫిడ్స్=పువ్వుఈగలు<br>3. అల్లిక రెక్క పురుగులు<br>4. నేల పురుగులు (పెంకు జాతి)<br>5. తూనీగలు | (ఉ) అల్లిక రెక్క పురుగులు (క్రైసోపా)<br>2. సాలీళ్లు<br>3. కాక్సినెల్లిడ్స్<br>4.పెంటాటమిడ్ బగ్స్<br>5. ట్రైకోగ్రామా (గ్రుడ్ల బదనికలు)<br>6. ఎపాంటెలస్ బదనికలు | 1. సాలీళ్లు<br>2.పురుగులు తినే పక్షులు<br>3. ఈగజాతి బదనికలు<br>4. పురుగు=బూజు తెగుళ్లు<br>5. పురుగు=వైరస్ తెగుళ్లు<br>6. కందిరీగ జాతి బదనికలు<br>7. మైట్ బదనికలు | 1. పురుగులు తినే పక్షులు<br>2. పురుగు బూజులు<br>3. మైట్ బదనికలు<br>4. సాలీళ్లు<br>5. కందిరీగలు |

# మేలైన మిరపసాగు కొన్ని సూచనలు

డా॥ పమిడి వెంకటేశ్వర్లు
శ్రీమతి సింగారపు రత్నకుమారి, లాం, గుంటూరు.

మన దేశములో మిరప ముఖ్యమయిన వాణిజ్య పంట. ముఖ్యముగా ఆంధ్రప్రదేశ్‌లో 1.7 లక్షల హెక్టారులలో సాగుచేయబడుతూ 2.2 లక్షల టన్నుల ఎండుమిర్చి ఉత్పత్తి చేయబడుచున్నది. ఈ మిరప సాగు లాభదాయకముగా వుండాలంటే, సరియైన యాజమాన్య పద్ధతులను పాటించి వాతావరణ పరిస్థితులు అనుకూలముగా వుండి, మంచి గిట్టుబాటు ధర వున్నప్పుడు మాత్రమే సాధ్యము. ప్రస్తుత పరిస్థితులలో రైతులు అధిక దిగుబడులు సాధించుటకు తెలుసుకొనవలసిన కొన్ని అంశాలను పరిశీలిద్దాం.



## రకాలు

**ఎండు మిర్చికి అనువైన రకాలు :** జి3, జి4, జి5, కిరణ్, ఎల్.సి.ఎ. 235.

**పచ్చిమిర్చికి అనువైన రకాలు :** ఎన్.పి. 46యన్, జ్వాల.

**పచ్చిమిర్చికి ఎండుమిర్చికి కూడ అనువైన రకాలు :** సింధూర్ (సి.ఎ. 960), అపర్ణ (సి.ఎ. 1068), ఎల్.సి.ఎ. 206.

ఆలస్యంగా నాటే ప్రకాశం, నెల్లూరు జిల్లాలలో, ఇంకా నారు పోసే ప్రాంతాలలో, తక్కువ కాలపరిమితి అంటే ముందుగా కాపుకు వచ్చే రకాలు అయినటువంటి సింధూర్ (సి.ఎ.960), భాస్కర్ (ఎల్.సి.ఎ. 235), ఎల్.సి.ఎ. 206 (క్రాంతి) మరియు ఎల్.సి.ఎ. 305 (లాం 305) అనే రకాలు బాగా అనుకూలంగా వుంటాయి. వేసవిలో పచ్చిమిరప అంటే జనవరి - ఏప్రియల్ నెలలో వేయటానికి సింధూర్, పూసాజ్వాల రకాలు అనువుగా వుంటాయి. ప్రస్తుతము మహమ్మారిగా వ్యాపించి నటువంటి వైరస్ తెగుళ్లను తట్టుకొనటంలో జి4 (భాగ్యలక్ష్మి) అనే రకము మేలైనదిగా గుర్తించడం జరిగింది. అయితే రైతులకు అందుబాటులో వుండి, రైతులు జి4 రకానికి లక్షణాలలో చాలా భేదాలున్నట్లుగా గమనించబడినది. ప్రస్తుతము రైతులలో వ్యాప్తిలో నున్న జి4 రకము క్రింద ముడుత, పై ముడుతలను తట్టుకోలేనిదిగా, బాగా ఆలస్యముగా కాపునకు వస్తూ, వాతావరణ పరిస్థితులు అనుకూలముగా వుండి, ముడుత బారి నుండి కాపాడ గలిగినట్లయితే చివరలో అధిక దిగుబడినిచ్చేదిగా వుంది. కానీ లాం ఫారంలోని రకము, వాడుకలో నున్న రకానికంటే 30-40 రోజులు ముందుగా కాపునకు వచ్చేదిగా గమనించటమయినది.

ఈ మధ్య కాలములో రూపొందించిన ఎల్.సి.ఎ. 304 మరియు ఎల్.సి.ఎ. 324 అనే రకాలు చిరుసంచుల పరిశోధనకు రైతుల చేలలో వేయించటమయినది. ఇవిగాక వైరస్ తెగుళ్ళను తట్టుకొనే హైబ్రిడ్ రకాలు (యఫ్1) రూపొందించుటలో ముమ్మరంగా నిమగ్నమయివున్నారు.

## ఎరువుల వాడకం

మిరపకు సేంద్రియ ఎరువులు వేయడం మంచిది. తొలి దుక్కిలో హెక్టారుకు 25 టన్నుల పశువుల ఎరువు లేదా కంపోస్టు వేసి దున్నాలి. నీరుకట్టు చేలకు 2-3 టన్నుల కోళ్ళ ఎరువు లేదా పందుల ఎరువు కూడ వేయవచ్చు. వేరు పురుగు వుండే ప్రాంతములో 5 క్వింటాళ్ళ వేప పిండిని వేయాలి. సేంద్రియ

ఎరువులు వేయడం వలన నేల భౌతిక స్వభావాన్ని మార్చి పైరు తరుగుదలకు దోహద పడుటయే గాక, రసాయనిక ఎరువుల వినియోగాన్ని ద్విగుణీకృతం చేస్తుంది. వేపపిండిని 2-3 క్వింటాళ్ళను దుక్కిలోను మరియు రసాయనిక ఎరువులు వేయునపుడు వాటితో కలిపి ఒక రోజు వుంచి పొలంలో వేసిన రసాయనిక ఎరువుల వినియోగం బాగా వుంటడటమే కాకుండ, నేలలో వుండే పురుగులను కూడ నాశనం చేస్తుంది.

సిఫారసు చేసిన మోతాదు (క్వి/హెక్టారుకు)

| | నత్రజని | భాస్వరము | పొటాష్ |
|---|---|---|---|
| వర్షాధారం | 60 | 40 | 50 |
| నీటి పారుదల | 150-200 | 50 | 60 |

కాని ఈ సిఫారసు చేసిన మోతాదు, నేల స్వభావాన్ని బట్టి, పైరు సాగుచేసే కాలాన్ని బట్టి, పైరు పొలములో వుండే సమయాన్ని బట్టి, ఎరువు వేసే విధానాన్ని బట్టి మారుతూ వుంటుంది. పరిస్థితిని బట్టి మోతాదును మార్చుకొన వలసి ఉంటుంది.

మొత్తం భాస్వరము సగం పొటాష్ ఎరువును చివరి దుక్కిలోను, నత్రజనిని 4 నుండి 8 మోతాదులలో వేయాలి. మిగిలిన సగం పొటాష్ ఎరువును నత్రజని ఎరువుతో కలిపి 2 లేక 3 మోతాదులలో కలిపి వేయాలి. పైన వేసే ఎరువులను అంతర కృషి జరుగుదశలో గొర్రుతో ఎద బెట్టటం లేదా తరువాత మొక్కకు 5 సెం.మీ. దూరములో పాదులలో నేలలో తేమ వున్నప్పుడు వేయాలి. నీటి పారుదల క్రింద బోదెలకు మధ్య భాగములో నీరు పెట్టేముందు వేయాలి. ఈ విధంగా వేయుట ద్వారా ఎరువు వృథా కాకుండ, మొక్క వేరుకు అందుబాటులో వుండి పూర్తిగా వినియోగించుకుటుంది. భాస్వరము ఎరువు పైరు పై వేసేటప్పుడు చివరి అంతర సేద్యంతో బోదెలు తోలేముందు, వేరుకు అందుబాటులో నుండునట్లుగా వేయాలి.

జింకు లోపము ఎక్కువ ప్రాంతములలో కనబడుతూ వుంది. కావున హెక్టారుకు 50 కిలోల జింకు సల్ఫేటు నేలలో వేయాలి. దీనిని భాస్వరము ఎరువుతో కలిపి వేయకూడదు. ఏ కారణము చేతనైన మొక్కలు నాటేముందు జింకు సల్ఫేటును వేయలేకపోతే, నాటిన 20వ రోజున, 35వ రోజున, 40వ రోజున, తడవకు 1250 గ్రాముల జింకు సల్ఫేటును 625 లీటర్ల నీటిలో కలిపి హెక్టారుకు పిచికారీ చేయాలి.

## నీటి తడులు

మిరప పైరుకు నీటి ఎద్దడి కన్నా, నీరు ఎక్కువగా నున్నప్పుడే ఎక్కువ నష్టము కలుగుతుంది. అధిక తేమ లేక బెట్ట పరిస్థితులలో పైరు ఎదుగుదల కుంటుపడటమే గాకుండ పూతరాలి పోవటం బాగా జరుగుతుంది. వైరస్ వ్యాప్తి కూడ ఎక్కువవుతుంది. నీటి పారుదల క్రింద అవసరమయినంత వరకే నీరు పెట్టాలి. చాళ్ళ మధ్య బోదె ఎక్కించి పిల్ల కాలువలుచేసి, 10-15 చదరపు గజాలకు ఒక మడిగా చేసి, వీలయినంత తక్కువ మోతాదులో మడి నాలుగు మూలలా పారే వరకు మాత్రమే నీరు పెట్టాలి. తక్కువ మోతాదులో ఎక్కువసార్లు నీరు పెట్టటం శ్రేయస్కరం. తడి తడికి ఎడం, నేల స్వభావము, వాతావరణము, పైరు దశను బట్టి మారుతూ వుంటుంది. పైరు సాధారణముగా మధ్యాహ్న సమయములో తేమ వున్నప్పటికీ వడబడుతుంది. కాని సాయంత్రము 4 గంటల తరువాత కూడ పైరు వడిబడి యున్నప్పుడు మాత్రమే పైరుకు నీటి అవసరము వున్నదని గమనించాలి.

## సస్యరక్షణ

నారుమళ్ళలో నారు కుళ్ళు తెగులు రాకుండ విత్తనాలు జల్లిన 13వ రోజున తిరిగి 20వ రోజున ఒక శాతము బోర్డో మిశ్రమము లేదా రాగి ధాతు సంబంధమయిన కాపర్ ఆగ్జి క్లోరయిడ్ మందులను ఒక లీటరు నీటికి 3 గ్రా. చొప్పున కలిపి పిచికారి చేయాలి. ముడుత తెగులును నివారించుటకు విత్తనములతోపాటు సెంటు మడికి 135గ్రాముల కార్బోఫ్యురాన్ గుళికలను వేయాలి. అలా కుదరని పక్షములో ఫాసలోన్ 3 మి.లీ. లేదా డై మిథియేట్ 2 మి.లీ. లేదా మిథైల్ డిమెటాన్ 15 మి.లీ. ఒక లీటరు నీటిలో కలిపి పిచికారి చేయాలి.



వైరస్ తెగులు సోకిన మిర్చి మొక్క

వి ఎం ఎ ల్ లో సాధారణముగా పై ముడత, క్రింద ముడత, మసిపేను, కాయతొలుచు పురుగు, కొమ్మ పండు, కాయ కుళ్ళు తెగులు, బూడిద తెగులు ముఖ్యమైనవి. సమగ్ర సస్య రక్షణ చర్యలు గైకొనుట ద్వారా వీటిని అధిగమించి అధిక దిగుబడులు సాధించవచ్చు.

1. వేరుపురుగు నివారణకు తొలకరిలో ఎకరాకు 10-20 కిలోల బి.హెచ్.సి. 10% పొడి చల్లి దుక్కి దున్నాలి.
2. కొమ్మవండు లేదా కాయకుళ్ళ తెగులు నివారణకు 3 గ్రా. మ్యాంకోజెబ్ లేక క్యాప్టాన్ లేక 1 గ్రా. కార్బెండిజం పొడి కలిపి విత్తనం విత్తాలి.
3. వైరస్ తెగులును విత్తన వ్యాప్తి ద్వారా నివారించుటకు, ట్రైసోడియం ఫాస్ఫేటుతో విత్తన శుద్ధి చేయాలి.
4. వైరస్ తెగుళ్ళను తట్టుకొనే రకాల ఎంపిక (జి4), పై ముడత, క్రింద ముడత తట్టుకొనే యల్‌సిఎ 235, యల్‌సిఎ 305 రకాల ఎంపిక, వర్షాలలోనే కాయ వంటకు వచ్చే ప్రాంతములో కాయకుళ్ళు తెగులు నివారణకు ఆలస్యంగా కాపుకొచ్చే రకాల ఎంపిక,
5. పై ముడత, క్రింద ముడత నివారణకు బదనిక పురుగులు చావకుండ కార్బోఫ్యురాన్ గుళికలు వాడుట.
6. మిరపచేను చుట్టూ రెండు లేక మూడు వరుసల జొన్న లేక మొక్క జొన్న పైరు వేయుట.
7. ఆకువచ్చ తెగులు నివారణకు నీటి తడుల నియంత్రణ.
8. నత్రజని మోతాదును నియంత్రించి మసిపేను, బూడిద తెగులు నివారణ.
9. సమతుల పోషక పదార్థముల నుపయోగించుట.
10. కీటకములు, తెగుళ్ళ నివారణకు ప్రథమ దశలోనే చర్యలు.
11. సరియైన మందు, సరియైన మోతాదులో వాడుట.
12. అనువైన పిచికారి ఎరకరాలు (స్ప్రేయర్స్) వాడుట మరియు పొగ మాదిరిగా మందు చిమ్ముటకు రంధ్రములు పెద్దవిగా వున్నవాటి నాజల్స్ మార్చుట.

## వైరస్ తెగులు – నివారణ

మిరపలో వైరస్ తెగుళ్ళు అనేక రకాలు. చాలా కాలము క్రితవే వాటిని గుర్తించి నప్పటికిని, ఈ మధ్యకాలములో వాతావరణ పరిస్థితులు పంట ఎదుగుదలకు అనుకూలముగా లేనిసమయంలో, దీని వుధృతి ఎక్కువై పంట పూర్తిగా పాడవటం, గత రెండు సంవత్సరములలో గమనించటం జరిగింది. టొబాకో మొజాయిక్ వైరస్ (టియంవి) విత్తనము ద్వారా వ్యాపిస్తుంది. అన్ని రకాల వైరస్‌కు మిరప మొక్కలు లేని సమయములో వేరే కలుపు మొక్కలయిన పచ్చిమిరప, పులిచెర, రాల మొదలగు మొక్కలపై వుంటూ, మసి పేను (Aphids), పై ముడత పురుగులు (Thrips) ద్వారా మిరప పైరుకు వ్యాప్తి చెందుతూ వుంటుంది. దీని సమగ్ర నివారణకు :

1. ట్రై సోడియం ఫాస్ఫేటు 90 గ్రా. ఒక లీటరులో కలిపి ఆరబెట్టి 1 కిలో విత్తనాన్ని 30 నిమిషాలు నానబెట్టి, బాగాకడిగి, ఆరబెట్టి విత్తనము విత్తుకోవాలి.
2. మిరప చేను వేసే పరిసర ప్రాంతములలో వైరస్ తెగులు వచ్చే కలుపు మొక్కలను ఎండా

కాలములో సామూహికంగా పీకి వేయాలి.

3. ఈ తెగులు వ్యాప్తి చేసే మసిపేను (Aphids) లేదా పై ముడత పురుగుల (Thrips)ను సమగ్రంగా నిర్మూలించాలి. బదనిక పురుగులు చావకుండా, వర్షా కాలములో మందులు పిచికారి చేయుటకు వీలుగాని సమయములో కూడ, పై పురుగుల నివారణకు కార్బోఫ్యూరాన్ 3 గ్రా గుళికలు ఎకరానికి 12-15 కిలోలు, ఎద బెట్టిన పైరులో అయితే 40 నుండి 50 రోజుల లోపుల మొదటిసారి ఎరువులో ఎదబెట్టాలి. నాటే తోటలలో అయితే పాదులలో వేయాలి. ఇదే మోతాదు 30 రోజుల తరువాత మరలా వేయాలి.

4. మిరప పైరు చుట్టూ 3 లేక 4 వరుసలు జొన్న లేదా మొక్క జొన్న పైరు వేసినట్లయితే వైరస్ వ్యాప్తి చేసే పురుగులకు అడ్డుగోడగా వుంటుంది.

5. పైరులో వైరస్ సోకిన మొక్కలను గమనించి వెంటనే పీకివేసి నాశనం చేయాలి.

6. సాధారణముగా వైరస్ తెగులు ఎదుగుదల కుంటుపడిన సమయములోనే మొక్కలో ఎక్కువగా వృద్ధి చెంది పైరును నాశనము చేస్తుంది. కాబట్టి, అధిక వర్షాలలో మురుగునీటి నిల్వ, పోషక పదార్థాముల లోపము నీటి ఎద్దడి, పురుగు తెగుళ్ళ బెడదలను అధిగమించగల చర్యలను చేపట్టాలి.

## హార్మోనుల వాడకం

మిరపలో మొదటి పూత వచ్చిన దగ్గర నుండి, తదుపరి ప్రతి కణుపు దగ్గరా పూత రావటం తథ్యము. కాని ఈ పూతలు ఎంతవరకు పిందెగా మారి పెరుగుతుందో గమనించాలి. ఇది ముఖ్యముగా నేలలో తేమ, నత్రజని మోతాదు, చీడ పీడలను బట్టి ఆధారపడుతుంది. కాని వాతావరణము మబ్బులు పట్టి వున్నప్పుడు కూడ పూత రాలిపోవుటకు చాలా దోహదపడుతుంది. దీనికి హార్మోను పిచికారి ప్లానోఫిక్స్ 30 పిపియం మోతాదులో 45,75 రోజులలో పిచికారి చేసిన మంచి ఫలితాన్నిస్తుందని పరిశోధనా ఫలితాలు తెలియజేస్తున్నాయి. దీనిని క్రిమి సంహారక మందులతో కలిపి కూడా ఉపయోగించవచ్చు. దీని ప్రభావ ఫలితాలు అన్ని కాలాలలో, వాతావరణ పరిస్థితులలో ఒకే విధంగా వుండవని గమనించాలి. నేలలో తగు మోతాదులో తేమ వుండి, నత్రజని తగు మోతాదులో వాడి, చీడ పీడలు లేకుండా చూసినట్లయితే, అధిక శాతము పూత పిందెగా పెరుగుతుంది.

## పంట కోత

మిరపలో పంటకు వచ్చిన కాయలను కోసిన, పైరు పెరుగుదల బాగా వుండి తదుపరి పూత పిందె బాగా పడును. కావున కాయ కోతలు ఎక్కువసార్లు అనగా 5-6 సార్లు చేయుట మంచిది.

## విత్తన సేకరణ

రాబోవు పంటకాలానికి రైతులు వారి దగ్గర వున్న రకాల విత్తనము కొరకు ఎవరినీ ఆశ్రయించకుండా, వారి పొలములో నున్న పైరులో తెగులు సోకని, బాగా కాసిన, ఒకే మాదిరి చెట్లను గుర్తించి, వాటి కాయలు సేకరించి, నిల్వ వుంచుకోవాలి. క్రొత్త రకాలు విత్తనము కొరకు పరిశోధనా కేంద్రములో గాని, విత్తనాభివృద్ధి సంస్థలలోగాని సంప్రదించవచ్చు.

## విస్సాకోడేరు ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం లిమిటెడ్ నెం. 1806, విస్సాకోడేరు

పి. లచ్చి రాజు
సెక్రటరీ

| | | |
|---|---|---|
| స్థాపితం | : | 14-3-1914 |
| పని ప్రారంభించిన తేదీ | : | 19-3-1914 |
| సంఘ మెంబర్ల సంఖ్య | : | 2,510 |
| సంఘ సభ్యులు, షేరు ధనం | : | 10,33,893 |
| సంఘ మెంబర్ల అప్పులు | : | 97,92,764 |
| 1991-92 ఆడిట్ రిపోర్టు దాఖలా లాభం | : | 18,543-07 |



తాళ్ళపూడి చిన్నయ్య
అధ్యక్షులు

సిబ్బంది :

పి. సత్యనారాయణ – సహాయ కార్యదర్శి
యస్. వర ప్రసాద్ – ఎక్కౌంటెంట్
యస్.అప్పారావు – సేల్స్‌మేనేజరు
యం. గోపాలరావు – క్యాషియర్
షేక్ నూర్జహాన్–బేగమ్
వై. బాలాజీ రవికుమార్
యస్. పేర్రాజు
వి.యస్.వి.యం. కృష్ణ

పాలకవర్గ సభ్యులు :

శ్రీ తాళ్లపూడిచిన్నయ్య – అధ్యక్షులు
శ్రీ మేళం పురుషోత్తంరావు – ఉపాధ్యక్షులు

శ్రీ బొర్రా కోటేశ్వర రావు, శ్రీ కోనూరి త్రిమూర్తులు, శ్రీ వర్ధనపు థామస్ జయకుమార్, శ్రీ రాంబరికల పెద్దిరాజు, శ్రీ బొక్కా రామకృష్ణ, శ్రీ ఆరేపల్లి సత్యనారాయణ, శ్రీ భూపతిరాజు రామకృష్ణంరాజు, శ్రీ కారుమంచి కృష్ణ, శ్రీ గంగిరాజు వీరవెంకట సత్యనారాయణ, శ్రీమతి మండా సావిత్రమ్మ, శ్రీమతి వర్ధనపు శాంతమ్మ.

## ది పెనుమదం ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం లిమిటెడ్, నెం. 4424, పెనుమదం

పోడూరు మండలం, పశ్చిమ గోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్

ప్రెసిడెంటు :
రాచకొండ విశ్వనాథం, బి.కాం.

| | | |
|---|---|---|
| సభ్యుల సంఖ్య | : | 3,489 |
| సభ్యుల వాటాధనము | : | 10,34,213 |
| డిపాజిట్ | : | 50,666-91 |
| సభ్యుల అప్పులు | : | 1,01,75,806-08 |
| జిల్లా సహకార బ్యాంకు అప్పులు | : | 95,81,842-61 |
| పరపతేతర వ్యాపారము | : | 2,80,454-65 |
| 1991-92 సం॥ లాభము | : | 90,156-33 |

సిబ్బంది :

శ్రీ వర్దినీడి మండేశ్వరరావు–కార్యదర్శి, B.COM. DCRS.
క్రొ వెంకట సత్యనాగేశ్వరరావు–ఎకౌంటెంట్, BA. HDC
గూడూరి వెంకటేశ్వరరావు – గుమాస్తా, BA. JDC
కోట నాగమునేశ్వరరావు – సేల్స్‌మెన్
వేంద్ర చింతారావు – గుమస్తా
దేవరపు వీరవెంకట సత్యపురుషోత్తమరావు – గుమస్తా
కవురు విజయ భాస్కరరావు – గుమస్తా
చిన్నకోట వెంకటరమణ – గుమస్తా
దేవరపు వెంకటేశ్వరరావు – గుమస్తా
బోడ్డు కుర్రు సూర్యనారాయణ – అటెండర్
వస్తా వెంకటబంగారావు – అటెండర్

పాలకవర్గ సభ్యులు :

శ్రీ రాచకొండ విశ్వనాథం – అధ్యక్షులు
శ్రీ అనుసూరి వెంకట సత్యనారాయణ – ఉపాధ్యక్షులు

డైరెక్టర్లు :

శ్రీ దేవరపు వెంకటసత్య ఆనంద నర్సింహరావు, శ్రీ దొండ మోహన రావు, శ్రీ వర్ధనపు బాలరాజు, శ్రీ సాలా వెంకటేశ్వర రావు, శ్రీ పొన్నపల్లి రాధాకృష్ణమూర్తి, శ్రీ పోతుల కృష్ణ మూర్తి, శ్రీ వడ్లపాటి బులిస్వామి, శ్రీ కంజులూరి శ్రీనివాసరావు, శ్రీ ముద్దాలనాగ వెంకట సత్యనారాయణమూర్తి, శ్రీమతి నంద్యాల సరస్వతి, శ్రీమతి మదిండి బంగారయ్య

# వరి తరువాత వేరుశనగ అధిక దిగుబడికి యాజమాన్య పద్ధతులు

యం. సింగారావు,
వ్యవసాయ విశ్వ విద్యాలయం, రాజేంద్రనగర్, హైదరాబాద్.

మన రాష్ట్రంలో దాదాపు 30 లక్షల హెక్టార్లలో ఖరీఫ్ కాలంలో వరిపండిస్తున్నాము. ఖరీఫ్ వరి తరువాత రబీలో గూడ వరి వేసేదాని కన్నా ఆరుతడి పంటలు వేసుకోవడం అన్ని విధాల మంచిది, అవసరం గూడ. ఆరుతడి పైర్లలో ముఖ్యమయినది వేరుశనగ, ప్రొద్దుతిరుగుడు, మినుము, పెసర మొదలయిన పంటలు, వరికి బదులు రబీలలో ఈ పంటలు వేయటం వలన సాగునీటిని ఎక్కువ సద్వినియోగం చేయవచ్చు. ఒక ఎకరం వరి పంటకు ఇచ్చే నీటిలో దాదాపు నాలుగు ఎకరాల వేరుశనగ పండించవచ్చు. వరి కంటే వేరుశనగ వంటి మెట్ట పంటల్లోనే రైతుకు అధిక లాభం వస్తుంది. ప్రతి సంవత్సరం రెండు కాలాల్లోనూ వరివేసుకుంటూపోతే భూమిలోని పోషక పదార్థాల లోపాలు అతి త్వరలో కనిపిస్తాయి. అంతేకాకుండ నేల భౌతిక స్థితిగూడ పాడై పోవటానికి అవకాశం ఉంది. వరి తరువాత ఆరుతడి పైరులు వేయటం వలన మనకు నిత్యావసరాలయిన పప్పులు, నూనె గింజల కొంత గూడ లేకుండా పోతుంది.

కోస్తా ప్రాంతాల్లో మినుము, పెసర మొదలయిన అపర్ణాల విత్తనాలను వరి కోయక ముందే తగినంత తేమున్నప్పుడు చల్లుతారు. కాని వేరుశనగ విత్తటానికి ముందు పొలాన్ని దున్ని భూమిని తయారుచేయటం అవసరం. వేరుశనగ పంటకు అవసరమైయిన భూ భౌతిక లక్షణాలు, వరి పంటకు అనువయిన భూ భౌతిక లక్షణాలకు పూర్తిగ వ్యతిరేకం. వరి పంటకు దమ్ము చెయ్యటం ఎంతో అవసరం. దమ్ము చెయ్యటం వలన మట్టి గడ్డలు పగిలిపోయి నేల రచన (స్ట్రక్చర్) పూర్తిగా మార్పు చెందుతుంది. భూమిలోని గాలి పరిమాణం బాగా తగ్గిపోతుంది. భూమి క్రింద భాగంలో గట్టిపొర ఏర్పడుతుంది. ఈ గట్టి పొర నీటిని భూమి క్రింద పొరల్లోకి వృథాగ పోకుండ ఆపుచేస్తుంది. అందువలన వరి పంటకు కావలసిన సాగునీటి ఆవశ్యకత తగ్గుతుంది. భౌతిక లక్షణాలలో మార్పులు మాత్రమే కాకుండ అనేక రసాయన మార్పులు, భూమిలోని జీవరాసులు గూడ దమ్ముచేయటం వలన మార్పు చెందుతాయి. ఎందుకంటే దమ్ముచేసిన భూముల్లో ప్రాణ వాయువు చాలతక్కువ. బొగ్గుపులుసు వాయువు చాల ఎక్కువగ వుంటుంది. దమ్ము చెయ్యటం వలన కలుపు మొక్కలు చాలా వరకు నిర్మూలించబడతాయి. ఇలాదమ్ము చేసిన నేల పరిస్థితులు వరి పంట పెరుగుదలకు ఎంతో అనువైనది. అయితే వేరుశనగ వంటి మెట్ట పంటలకు కావలసిన నేల పరిస్థితులు ఇందుకు పూర్తిగా విరుద్ధం.

వరి తరువాత మాగాణి భూమి ఎండిపోయి ఏ రచనలేని గట్టి ముద్దగ తయారవుతుంది. ఈ వరి పొలాలల్లోని పరిస్థితులు వేరుశనగ పంటకు అంతగా అనుకూలంగా వుండవు. ఈ పరిస్థితుల్లో వేరుశనగ పంట దిగుబడి మెట్ట పొలాలతో పోల్చి చూస్తే కొంత తక్కువగానే వుంటుంది. అయితే మనం కొన్ని ప్రత్యేకమయిన యాజమాన్య పద్ధతుల్ని పాటిస్తే మాగాణి భూముల్లో వేరుశనగ దిగుబడిని బాగా పెంచటానికి అవకాశం వుంది.

## వరిపొలాల్లో వేరుశనగకు సమస్యలు :

వేరుశనగ పంటకు నేలలో గాలి, తేమ సమపాళ్ళలో వుండటం అవసరం. ఈ మొక్కల నుండి కాడలు భూమిలోనికి పోయి భూమిలోపల కాయలుగా అభివృద్ధి చెందుతాయి. అందుకు నేల మెత్తగా వుండటం అవసరం. నేల మెత్తగా ఉన్నట్లయితే పూల నుండి వృద్ధి చెందిన కాడలు నేల లోనికి తేలికగా చొచ్చుకొని పోయి కాయలుగా వృద్ధి చెందుతాయి. వరి పొలాల్లో

With best compliments :

Phone : Off : 22228 / 23428
Res : 23228

# New Rachamadugu Gurunatham & Co.

# RACHAMAGUDU ENTERPRISES

***Distributor :*** **PESTICIDES INDIA**
***Dealers in :*** **FERTILIZERS & PESTICIDES**

**A-26, Balaji Complex, Nandyal - 518 501, A.P.**

మన రైతువాణి మాసపత్రిక ప్రత్యేక సంచిక విడుదలచేస్తున్న సందర్భంలో మా శుభాకాంక్షలు



తోట పార్థసారథి
ఇమ్మినేని గోపాలరావు
ఆమిదాల లక్ష్మిరెడ్డి
మర్రి కోటేశ్వరరావు
రైతులు

నూనెపల్లి, నంద్యాల–518 503.

మట్టి సాంద్రత ఎక్కువ. దమ్ముచేసినప్పుడు ఏర్పడిన గట్టిపార వలన వేరుశనగ వేళ్ళు భూమిలోనికి తగినంతగ పోలేవు. అందువలన పంటకు తగినంతగ నీరు, పోషక పదార్థాలు లభ్యం కావు. పంట పెరుగుదల సరిగా వుండదు. వరి కోసిన తరువాత ఎండిపోయి ఏ రచనలేని గట్టి ముద్దగ తయారైన నేలను దున్నినప్పుడు పెద్దపెద్ద మట్టి గడ్డలు ఏర్పడుతాయి. ఏ పెద్ద మట్టిగడ్డలున్న పొలంలో వేరుశనగ విత్తినచో అవి అతి తక్కువ శాతం మాత్రమే మొలకెత్తుతాయి. పొలంలో ఉండవలసినంత మొక్కల సాంద్రత వుండదు. అందువలన దిగుబడి గూడ చాల తక్కువగా వుంటుంది. ఎక్కువ పెద్ద మట్టి పెడ్డలు ఉన్నభూమిలో విత్తనం సరయిన లోతులో వెయ్యటం గూడ కష్టమే. పెద్దపెద్ద మట్టి గడ్డలుంటే వేరుశనగ కాడలు భూమిలోనికి పోవటానికి అవరోధంగ వుంటుంది. కాడలు భూమిలోనికి పోకపోతే కాయలుగా కాలేవు.

## వేరుశనగ అధిక దిగుబడికి యాజమాన్య పద్ధతులు :

వేరుశనగ పంటకు దుక్కి మెత్తగా వుండటం ఎంతో అవసరం. అందుకు దుక్కిని తగువిధంగా తయారుచేయటం ముఖ్యం. వరికోసిన తరువాత భూమిలో తగినంతగ తేమ వున్నప్పుడు దున్నటం ముఖ్యం. ఎక్కువ తేమవున్నపుడు నాగలి దున్నటానికి రాదు. భూమి ఎండినట్లయితే దున్నినప్పుడు పెద్ద పెద్ద పెడ్డలు ఏర్పడతాయి. అందుకే తగిన సమయంలో లోతుగా నాగలితో రెండుసార్లు దున్నాలి. రెండు మూడు రోజులు ఆరిన తరువాత పవరు టిల్లరుకు తగిలించిన తిరిగే దంతితో (రొటో టిల్లర్) ఒకసారి నిలువున, ఒకసారి అడ్డంగ దున్నితే గడ్డలన్నీ పగిలిభూమి మెత్తగ తయారవుతుంది. అప్పుడు మట్టి పెడ్డల సరాసరి పరిమాణం దాదాపు ఒకటిన్నర నుండి రెండు సెం.మీ. వుంటుంది. తరువాత చదునుచేసి విత్తనాలు గొర్రుతో వెదపెట్టటంగాని, లేక నాగలి వెనుక సాలులో వెయ్యటం గాని కప్పివేయ్యాలి.

ట్రాక్టరు ఉన్న రైతులయితే మొదట పళ్లెం నాగలి (డిస్క్ ప్లౌ)తో ఒకసారి దున్ని తగినంతగ ఆరిన తరువాత పళ్ళాల దంతి (డిస్క్ హారో) రెండుసార్లు నడిపితే గడ్డలన్నీ పగిలి భూమి మెత్తగ తయారవుతుంది. అప్పుడు బాగా చదునుచేసి విత్తనం వేసుకోవచ్చు. పళ్లెం నాగలితో దున్నినప్పుడు 15 నుండి 20 సెం.మీ.లోతు వరకు పోయి అడుగునున్న గట్టి పార పగిలిపోతుంది.

ఇక ట్రాక్టరు, పవర్ టిల్లరు లేనిరైతులు కీలు నాగలితో రెండుసార్లు దున్నిన తరువాత తగినంత ఆరనిచ్చి ఎడ్లులాగే పళ్ళాల నాగలిని నాలుగుసార్లు నడిపితే పెడ్డలు చాల వరకు పగిలిపోయి భూమి మెతగా తయారవుతుంది. తరువాత చదును చేసి విత్తనం వేయవచ్చు.

## వ్యవసాయ విశ్వవిద్యాలయంలో తేలిక భూముల్లో వరి తరువాత వేరుశనగ వేయటానికి భూమి తయారుకు జరిపిన పరిశోధనా ఫలితాలు :

| భూమి తయారు విధానము | దున్నిన లోతు సెం.మీ. | సరాసరి మట్టి పెడ్డల పరిమాణం సెం.మీ. | మొలకెత్తిన శాతము | వేరుశనగ గది నుండి క్వి./హె. కట్టె | కాయలు |
|---|---|---|---|---|---|
| 1. కట్టెనాగలితో రెండుసార్లు దున్నుట | 7.0 | 4.5 | 47 | 23.9 | 14.5 |
| 2. రెండుసార్లు కట్టె నాగలి + రెండు సార్లు పళ్ళదంతి | 7.1 | 3.0 | 51 | 25.2 | 14.5 |
| 3. రెండుసార్లు కట్టె నాగలి + నాలుగు సార్లు పళ్ల దంతె | 7.8 | 2.3 | 52 | 25.4 | 17.0 |
| 4. రెండుసార్లు కట్టె నాగలి + రెండు సార్లు పవర్ టిల్లర్ | 7.6 | 1.6 | 57 | 31.3 | 19.0 |
| 5. ట్రాక్టరుతో డిస్క్ ప్లవ్ ఒక సారి + రెండుసార్లు డిస్క్ హారో | 12.9 | 3.0 | 55 | 32.0 | 19.6 |

భూమిని మెత్తగ గడ్డలులేకుండ తయారుచేయటానికి ఇంకొక పద్ధతి నీరు కట్టడం. దుక్కిదున్నిన తరువాత పెద్ద పెద్ద

పెద్దలున్న పొలానికి నీరు పెట్టినట్లయితే గడ్డలు చాలా వరకు పగిలిపోతాయి. నీరుపెట్టిన తరువాత తగినంత తేమ వున్నప్పుడు కల్టివేటరు గాని, గొర్రుగాని రెండుసార్లు నడిపితే దుక్కి బాగ తయారువుతుంది. అప్పుడు విత్తనం వేసుకోవచ్చు. ముఖ్యంగ గమనించాల్సిన విషయం ఏమంటే పెద్దపెద్ద గడ్డలు లేకుండ భూమిని తయారుచేయటం అవసరం.

మాగాణి భూముల్లో మామూలుగా వేసే విత్తనం 20% ఎక్కువగా వెయ్యటం అవసరం. ఎందుకంటే ఈ భూముల్లో విత్తనాలు మొలకెత్తే శాతం తక్కువగ ఈ భూముల్లో మొక్కల సాంద్రత గూడ ఎక్కువ వుంచటం వలన అధిక దిగుబడి వస్తుంది. వరి తరువాత వేసే వేరుశనగకు ఎరువుల వాడకంలో గూడ కొన్ని జాగ్రత్తలు పాటించడం అవసరం. ఈ నేలలో వేరుశనగకు నత్రజనిని సమకూర్చే సూక్ష్మజీవులు తక్కువగ వుంటాయి. మొక్కవేళ్ళపైన బుడిపలుగూడ తక్కువగ ఏర్పడతాయి. అందువలన మొక్కకు నత్రజని తక్కువగ లభ్యం అవుతుంది. దీనివలన దిగుబడి తగ్గిపోయే అవకాశం వుంది. కనుక వరి పొలాల్లో వేసే వేరుశనగకు మామూలు పంటకంటే హెక్టారుకు 20 కిలోల నత్రజనిని ఎక్కువ వెయ్యటం అవసరం.

పైన చెప్పిన ప్రత్యేక యాజమాన్య పద్ధతులతో పాటు తగినంత ఫాస్ఫేటు, పోటాష్, జింకు ఎరువులను అవసరాన్ని బట్టి, మట్టిపరీక్ష కేంద్ర సిఫారసు ననుసరించి వాడటం అవసరం. తగిన సమయంలో అవసరాన్ని బట్టి సస్యరక్షణ చేపట్టడం, నీరుకొట్టటం, కలుపు మొక్కల నివారణ పాటించటం ద్వారా వరి తరువాత వేరుశనగ పంటవేసి అధిక దిగుబడిని సాధించవచ్చు

కాబట్టి, వరి కోసిన తరువాత తగిన సమయంలో అనువయిన పనిముట్లను ఉపయోగించి తగిన రీతిన దుక్కిని లోతుగ మెత్తగ గడ్డలు లేకుండ తయారుచెయ్యటం, మామూలు పంట కంటే 20 శాతం ఎక్కువ విత్తనం వేయటం, అవసరాన్ని బట్టి తగినంత ఎరువు వెయ్యటం, సమయంలో నీరు కట్టి, కలుపుని తీసి సస్య రక్షణ పద్ధతులను పాటించడం ద్వారా ఎక్కువ దిగుబడిని సాధించి లాభం పొందవచ్చు.

# రాష్ట్రంలో నీటి పంపకానికి సహేతుక సూత్రాలు

కీ॥ శే॥ పుచ్చలపల్లి సుందరయ్య

ఆంధ్రప్రదేశ్ వివిధ జిల్లాలకు ప్రస్తుతం జరిగిన నదీ జలాల కేటాయింపుల గూర్చి నీటిపారుదల పథకాలకు, యిస్తున్న ప్రాధాన్యతలకు వ్యతిరేకంగా ఆందోళన పెరుగుతున్నది. కరువుకు గురయ్యే అనంతపురం, కర్నూలు, కడప, చిత్తూరు జిల్లాలలోని పడమటి తాలూకాలు (రాయలసీమ జిల్లాలు), మహబూబ్‌నగర్, నాగార్జున ఎడమ-కుడి కాల్వల క్రిందగల ప్రాంతాలు తప్ప మిగిలిన నల్గొండ, ప్రకాశం జిల్లాలవారికి న్యాయంగా కేటాయించవలసిన కనీస నీరుగూడ నిరాకరింపబడుతున్నది. నీటి పారుదల సౌకర్యాల అభివృద్ధి అయిన తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలు, కృష్ణా, గుంటూరు (ఈ జిల్లాలోని డెల్టా తాలూకాలు) తమ భాగంకన్నా మించి నీరు పొందుతున్నాయని ప్రాంతీయ తత్వాలు రెచ్చగొట్టబడుతున్నాయి. ఫలితంగా ఆంధ్రప్రదేశ్‌లోని ప్రతిజిల్లా, తాలూకాలోని అందరి ప్రజల సత్ప్రయోజనాలకు అనుకూలంగా మన నీటి వనరులన్నింటినీ పూర్తిగా వినియోగించు కోగలిగే విధంగా ఎలాంటి సహేతుకమైన పరిష్కారాన్ని కనుగొనడానికైనా ప్రమాదకరంగా ఈ ప్రాంతీయ తత్వాలు తయారౌతున్నాయి.

> నీటి పంపకం విషయంలో రాష్ట్రంలో ప్రజల ప్రయోజనాలకు అనుకూలంగా పరిష్కారాన్ని కనుగొనడానికి బదులుగా ప్రాంతీయతత్వాలు తయారౌతున్నాయి.

అందుబాటులో వున్న సమాచారాన్నంతా స్థూలంగా జిల్లా ప్రాతిపదికపై అధ్యయనం చేసిన తర్వాత నీటి కేటాయింపులోను, నీటిపారుదల ప్రాజెక్టుల విభజనలోను ప్రస్తుత స్థితిలో పెద్ద తేడాలు వున్నట్లు, అన్యాయం జరుగుతున్నట్లు అభిప్రాయపడక తప్పదు. ఈ అన్యాయమైన పరిస్థితిని కొంతవరకైనా సరిదిద్దేందుకు, అధిగమించేందుకు నీటి కేటాయింపు, ప్రాజెక్టుల ప్రాధాన్యతల గూర్చి కొన్ని సూత్రాలను ప్రతిపాదిస్తున్నాను. అయితే యిప్పుడు నేను జిల్లాలవారీగా అధ్యయనం చేసిన పద్ధతిలోనే ఆ సూత్రాల ప్రాతిపదిక ననుసరించి దీనికి సంబంధించిన అంశాలన్నింటినీ తాలూకా స్థాయిలోకూడా అధ్యయనం చేయడం అత్యవసరం. ఆ తర్వాతనే నీటి కేటాయింపులు, ప్రాజెక్టుల ప్రాధాన్యత మరింత వివరంగా నిర్ణయించుకోగలము. వివిధ తాలూకాలు, సమితి ప్రాంతాలు, జిల్లాలోని వివిధ ఉపప్రాంతాలలో వర్షపాతం విభిన్నంగా వుంది. వేరువేరు మధ్యతరహా, చిన్న తరహా నీటిపారుదల సౌకర్యాలు వున్నాయి. ఒకేపంట పండించే ప్రాంతాలు, రెండు పంటలు పండించే ప్రాంతాలున్నాయి. మాగాణి, మెట్టపంటలున్నాయి. వీటన్నిటి మధ్య ఎన్నో తేడాలు వున్నాయి. అందువల్ల వీటి అధ్యయనం అవసరం.

జిల్లా స్థాయి ప్రాతిపదికమీద యిస్తున్న ఈ క్రింది సమాచారం పరిష్కారం రూపొందించేందుకు స్థూలమైన మార్గాన్ని సూచిస్తుంది.

ఈనాడు గల వాస్తవాల దృష్ట్యా, సాధ్యమైనంత న్యాయమైన, అవసరాలకు అనుగుణ్యంగా సమానమైన పరిష్కారాన్ని కనుగొనే ప్రయత్నానికి పూనుకునేముందు మనము గమనించాల్సిన సూత్రాలేమిటి?

1. ఒక తాలూకా లేదా జిల్లా లేదా వివిధ జిల్లాలలో విభజింపబడి వున్న ప్రధానంగా పంటల తరుణం ప్రాతిపదికగా ఒకే ప్రాంతంగా పరిగణింప దగిన ప్రాంతములో కురిసే వర్షపాతపు మొత్తానికి మొదటి ప్రాధాన్యత యివ్వాల్సి ఉంటుంది. ఒకానొక ప్రాంతం కరువు ప్రాంతమా కాదా అని నిర్ణయించాలన్నా, దానికి ఆ పరివాహక ప్రాంతంనుండి లేదా ఇతర నీటి వనరుల నుండి ఎంత నీరు ఇవ్వవలసి వుంటుంది? ప్రాజెక్టులను చేపట్టేటప్పుడు దేనికి ఎంత ప్రాధాన్యత ఇవ్వాలి? అనే విషయాలు అక్కడపడే వర్షపాత దృష్ట్యానే నిర్ణయించవలసి ఉంటుంది.

2. ఒకానొక తాలూకా లేదా నదీ పరివాహక ప్రాంతం లేదా ఒక ఉపనదీ పరివాహక ప్రాంతం ఎంత నీటిని యిస్తున్నది అనే విషయంమీద కాక ఆయా ప్రాంతాల కనీస అవసరాలను తీర్చేందుకు ఎంత ఎక్కువ నీరును వానికి అందించగలం అనేది దృష్టిలో వుంచుకోవాలి. అలా అందజేయడానికి పూనుకొనే టప్పుడు, ఏయే పరివాహక ప్రాంతాలలో నుండి నీరు తరలిస్తామో వారి కనీస అవసరాలకు నష్టం కలగకుండా ముందు చూసుకోవాలి.

ఈ సందర్భంలో అందుబాటులోవున్న నీటిని ఈ క్రింది ప్రాధాన్యతతో వాడుకోవాలి. (1) త్రాగేందుకు, కుటుంబ అవసరాలకు (మనుషులకు, పశువులకు), (2) సాధ్యమైనంత ఎక్కువ విస్తీర్ణానికి మూడు నుండి నాలుగు నెలలపాటు ఒక్క ఆరుతడి మెట్ట పంటకైనా నీరు గ్యారంటీ యివ్వాలి, (3) అంతకుమించి నీరు లభ్యమయ్యేలాగుంటే 6 నెలల కాలపు మాగాణి పంటకుగాని, దానికి బదులు ఒక తక్కువకాలపు మాగాణి పంట, ఒక ఆరుతడి మెట్టపంటకు సరిపడనీరు, (4) పారిశ్రామిక అవసరాలకు, (5) పైన పేర్కొన్న ప్రాధాన్యతలకు భంగం కలగకుండా విద్యుచ్ఛక్తి ఉత్పత్తికిగల యితర వనరులకు పూర్తిగా వినియోగించుకొన్న తర్వాత విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి; (6) పైన పేర్కొన్న ప్రాధాన్యతలకు నీరు ఉపయోగించుకోలేక నీరు మడుగు కట్టకుండా, ఉప్పుదేలకుండాను నివారించేందుకు రెండవ మాగాణి పంటకు ప్రవాహ నీరు లేనప్పుడు ట్యూబ్, లేదా బోర్‌వెల్స్ ద్వారా భూగర్భ జలాలను వాడుకోవలసి వుంటుంది. అలా భూగర్భ జలాలను వాడుకుని సంవత్సరం పొడుగునా నీరు కావలసిన చెరుకు వంటి పంటలను పండించే రైతులకు పెరిగే సేద్యపు ఖర్చులకుగాను అదనపు గిట్టుబాటు ధరను గ్యారంటీ చేయాలి.

3. ఈనాటి సాగుభూమిని మాత్రమే దృష్టిలో వుంచుకొని నీటి వనరుల కేటాయింపు జరగరాదు. ఎందువల్లనంటే, వివిధ జిల్లాల్లో బంజర్లతో సహా సాగుకు లాయకైన భూములలో సాగైన భూమి 50 నుండి 80 శాతం వరకు తేడాలతో వున్నాయి. ప్రతి జిల్లా తాలూకాల్లో సాగుకు లాయకైన భూమి, సాగుభూమి రెంటిని కలిపి సగభాగం తీసుకుంటే అది మరింత న్యాయమైనదిగా వుంటుంది. ఎందువల్లనంటే, అలా సరాసరి తీసుకున్నప్పుడు ప్రస్తుత సాగు భూమికి, ప్రస్తుతం బీడుగా వున్న - భవిష్యత్‌లో సాగుకు అవకాశం గల భూమికి అవసరమైన నీటి వనరులను స్పష్టం చేస్తుంది.

4. భూ విస్తీర్ణంతో పాటు ఆ తాలూకా లేక జిల్లా లేక ప్రాంతంలోగల జనాభాను కూడ పరిగణన లోనికి తీసుకోవాలి. అలా చేయకపోతే ప్రజలు త్రాగేందుకు, ఇతర అవసరాలను మనం విస్మరిస్తున్నామన్న మాట. అలాగే పరిశ్రమలు, ఇతర కార్యకలాపాలకు, అత్యవసర ప్రయోజనాలకు అవసరమైన, న్యాయమైన నీటి కేటాయింపు మరచిపోతాము. అందువల్ల పరిశీలించాల్సిన ముఖ్యమైన, అత్యావశ్యకమైన అంశాలలో జనాభా కూడా ఒకటి.

అయితే జనాభాను, సాగుకు లాయకమైన భూమిని అనుసంధానిస్తూ ఒక సంతృప్తికరమైన సూత్రాన్ని రూపొందించడం అంత తేలిక కాదు. ప్రతితాలూకాకు తలసరి ఏడాదికి కావలసిన నీటినే నిర్ణయించి, మిగిలిన నీటిని ఆరుతడి మెట్ట పంటకు సాగుకు లాయకైన - సాగైన భూముల సరాసరి ప్రాతిపదికగా నీరు కేటాయించవలసి వుంటుంది.

*[ "ఆంధ్రప్రదేశములో సమగ్ర నీటిపథకం" పుస్తకం నుండి ]*

# 'వడ్డీదోపిడీ'ని ఎదిరించండి

## ఖమ్మం జిల్లా రైతు సంఘం పిలుపు :

జిల్లాలో రైతాంగం నడ్డి విరగ్గొడుతున్న వడ్డీల పాపాల భైరవిని పారద్రోలమంటూ నవంబర్ 16వ తేది ఖమ్మం సుందరయ్య భవనంలో జరిగిన రైతుసంఘం కార్యకర్తల సదస్సు పిలుపునిచ్చింది. గత రెండు సంవత్సరాలుగా చంద్రుగొండ మండలంలో సంఘకార్యకర్తలు సాగించిన కృషి సత్ఫలితాల నిచ్చింది. [వివరాలు విడిగా చూడండి]

ప్రభుత్వ నూతన ఆర్థిక విధానాల వల్ల ప్రజల బాధలు, భారాలు రోజు, రోజుకూ పెరుగుతున్నాయి. ముఖ్యంగా వ్యవసాయరంగం దెబ్బతిని గ్రామీణ పేదలు కష్టాల పాలౌతున్నారు. నిరుద్యోగం, అధికధరలు, అవినీతి ప్రజల మూలుగుల్ని పీలుస్తున్నాయి. పెరుగుతున్న ధరల ప్రకారం ప్రజల ఆదాయాలు పెరటం లేదు.

అసలే అంతంత మాత్రంగా వున్న ఆదాయాలను అధిక వడ్డీరేట్లు హరించివేస్తున్నాయి. జిల్లాలో రు.100కు నెలకు రు. 3 నుండి రు. 10, 12 రూపాయలదాకా వడ్డీరేట్లు నడుస్తున్నాయి. ఈ దోపిడీ చట్టవిరుద్ధం. చట్ట ప్రకారం రు. 100కు నెలకు రు. 2ల కంటె ఎక్కువ వడ్డీ వసూలు చేయకూడదు. ఈ దోపిడీని మనం ఎదిరించాలి.

## వడ్డీ ఎక్కడ నుండి వస్తోంది?

తన దగ్గరున్న డబ్బు పిల్లలు పెడుతుందనీ, అదే వడ్డీ అని పెట్టుబడిదారు అనుకుంటాడు. ఇది వాస్తవం కాదు. డబ్బెప్పుడూ పిల్లలు పెట్టదు. ఆర్థిక అవసరాల్లో ఉన్న వారిని డబ్బు ఆదుకుంటుంది. అలా ఆదుకున్నందుకు, డబ్బు తీసుకున్న వాడు తన కష్టం నుండి చెల్లించే వాటాయే వడ్డీ. 'శ్రమ'లో నుండి సంపద పుడుతుంది. శ్రమ చేసేవాడి సంపదను అతని అవసరాన్ని ఆసరా చేసుకొని శ్రమ చేయనివాడు దోచేస్తుంటాడు. వడ్డీ వ్యాపారం కూడా అదే.

## ఈ దోపిడీ మన జిల్లాలో ఎలావుంది?

ఖమ్మంజిల్లాలో దాదాపు రు.3లకు పైనే వడ్డీరేట్లున్నాయి. పట్టణాలలో ఉద్యోగుల, కార్మికుల వద్ద 10, 12 రూపాయల వడ్డీ వసూలు చేయబడుతోంది. బంగారం తాకట్టు పెట్టుకుని కూడా 5, 6 రూపాయలకు వడ్డీ వసూలు చేస్తున్న ప్రాంతాలున్నాయి. ఇటీవల ఫైనాన్సు కంపెనీలు తయారై రోజులు, నెలలు లెక్కన దోపిడీ చేస్తున్నాయి. పురుగుమందులు, ఎరువుల కంపెనీలు తమ డీలర్ల నుండి వడ్డీ వసూలు చేయకపోయినా డీలర్లు రైతుల నుండి 2, 3 రూపాయల వడ్డీ గుంజుతున్నారు. నగదు అయితే ఒక రేటు, అప్పుయితే ఒక రేటు వేసి వ్యాపారులు అధిక మొత్తాలు లాగుతున్నారు. వరినాట్ల రోజుల్లో ఒక 28-28 ఎరువు బస్తా యిచ్చి వరికోతల్లో 14 కుండల ధాన్యం యిచ్చేట్లు ఒక వ్యాపారి వ్రాసుకున్నాడు. ఇంకా గ్రామాలలో 100 రూపా యలకు వడ్డీగా 2 కుండల ధాన్యం యివ్వటం, 100, 150 రూపాయలు యిస్తే ఇక బస్తా ధాన్యం యివ్వటం, లాంటి జట్టాలు, ఖండనలు విస్తారంగా నడుస్తున్నాయి. మనం ఆదాయాలు పెరగాలని పోరాడితేనే సరిపోదు. వచ్చిన ఆదాయం యిలా దోపిడీ దార్ల పాలు గాకుండా నిలువరించే పోరాటాలు చేయాలి.

## పరపతి సౌకర్యాలూ పెద్దవాళ్ళకే !

గ్రామీణపేదల పెట్టుబడి అవసరాలు తీర్చడానికి, వారిని ప్రైవేటు వడ్డీ వ్యాపారుల నుండి రక్షించటానికే సహకార పరపతి సంఘాలున్నాయని, బ్యాంకుల జాతీయకరణ కూడా పేద రైతుల కోసమేనని ప్రభుత్వం గొప్ప చెప్పుకుంటుంది. కాని జరుగుతున్నది ఏమిటి?

కొద్ది మందిగా ఉన్న భూస్వామ్య, ధనిక రైతులకే అప్పులు అధిక భాగం వెళ్ళిపోతున్నాయి. ట్రాక్టర్లు, పండ్ల తోటలు వగైరాలకు యిస్తున్నది ఎక్కువ. చిన్న రైతులకు పంట రుణాలు చాలా తక్కువగా వుంటున్నాయి. ఇంకా ఒకేయింట్లో పెద్ద రైతులు రకరకాల పేర్లతో రుణాల్లో పెద్ద వాటా దక్కించుకుంటున్నారు. జాతీయ బ్యాంకులు, వాణిజ్య బ్యాంకుల రుణ విధానమూ యిలాగే వుంది. ఈ పద్ధతులు మార్చబడాలి. చిన్న రైతుల సంఖ్యను బట్టి దామాషా ప్రకారం పెట్టుబడులు కేటాయించాలి. అప్పుడే కొంతయినా ప్రైవేటు పెట్టుబడులపై ఆధారపడటం తగ్గుతుంది.

## మార్కెట్ల మహామాయ

రైతు పండించిన పంటలను అమ్మి పెట్టాల్సిన వ్యవసాయ మార్కెట్లు వ్యాపారుల, అధికారుల దోపిడీ కేంద్రాలుగా మారాయి. రైతులకు తక్‌పట్టీలు యివ్వటం లేదు. తూకాలు సరిగాలేవు. కమీషన్ చట్టప్రకారం 100 కి. నెం. 1-50పై. అయితే 4 నుండి 6 రూపాయాలు వసూలు చేస్తున్నారు. బహిరంగ వేలం నిర్వహించకుండా వ్యాపారులు కుమ్మక్కై రైతుకు ధర రాకుండా చేస్తున్నారు. ఇటీవల ఒక రోజు సూర్యాపేట, వరంగల్లులో పెసల ధర 820 రూపాయలుంటే ఖమ్మం మార్కెట్లో వ్యాపారులు

*With best compliments from .*

# The General Insurance Employees' Co-operative Credit Society Ltd.

**(Regd.No. TA-1250 Hyderabad)**

Flat NO. 313, III Floor, Sadguru Complex, Basheerbagh, Hyderabad - 29
Phone No. : 235408

***We accept Deposits as under :***

**FIXED DEPOSITS :**

| DURATION | | RATE OF INTEREST |
|---|---|---|
| Below 1 year (Minimum 6 Months) | ... | 13% |
| 1 Year and below 24 Months | ... | 14% |
| 2 Years and above | ... | 15% |

HIGH LIGHTS:

1) 1 Year and above Rs. One lakh & above ... 15%
2) Interest payable Monthly, Quarterly, Half Yearly & Yearly ...

**CUMULATIVE DEPOSITS :**

| AMOUNT OF DEPOSIT | PERIOD | MATURITY VALUE |
|---|---|---|
| Rs. 1,000/- | 36 Months | Rs. 1,550/- |
| Rs. 3,000/- | " | Rs. 3,100/- |
| Rs. 5,000/- | " | Rs. 7,750/- |
| Rs. 10,000/- | " | Rs. 15,500/- |

రైతువాణి మాసపత్రిక వార్షికోత్సవ సందర్భాన శుభాకాంక్షలతో...

## శ్రీ రామా రూరల్ కళాశాల (గురుకులము)

స్థాపితం : 6-6-1949

చిలుమూరు-522 301, తెనాలి ఆర్.యం.ఎస్., గుంటూరుజిల్లా,

వ్యవస్థాపకులు : కొలసాని వెంకటసుబ్బయ్యచౌదరిగారు

5వ తరగతి నుండి 10వ తరగతి వరకు సుశిక్షణ

(తెలుగు, ఇంగ్లీషు మీడియంలు)

కె.ఎమ్.మధుసూధనరావు, ఎం.ఎ.బి.యిడి, ప్రిన్సిపాల్.

కె.టి.వి. ప్రసాద్, ఎంటెక్, డైరెక్టర్.

## కొలసాని వెంకటసుబ్బయ్య చౌదరి శ్రీ రామా రూరల్ రెసిడెన్షియల్ జూనియర్ కళాశాల

స్థాపితం : 1-6-1979

చిలుమూరు-522 301, తెనాలి ఆర్.యం.ఎస్., గుంటూరుజిల్లా.

ఇంటర్మీడియట్‌కు తెలుగు, ఇంగ్లీషు మీడియంలో సుశిక్షణ

యంపిసి, బైపి, యంఇసి, సిఇసి, హెచ్ఇసి గ్రూపులు

కె.ఎమ్. రమణ, ప్రిన్సిపాల్.

విద్యారంగములో విశిష్టానుభవము కలిగిన ఈ కళాశాలల యాజమాన్యములు ఈ రంగములో తమ కృషి పరిధులను మరింత విస్తృతము చేయాలన్న ధృక్పథముతో ఇటీవలే ఓ సంస్థను రిజిస్టర్ చేయడము జరిగినది : అదే

## శ్రీ రామా రూరల్ అకాడమీ (రి.నెం. 33/1993)

ఈ సంస్థ తొలిదొలుతగా ఈ సంవత్సరము (1993-'94) ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వముచే గుర్తింపు పొంది ప్రారంభించినదే:

## కొలసాని వెంకటసుబ్బయ్య రామతులసమ్మ జూనియర్ కళాశాల

ఆర్.సి.నెం. 34/ఇ, 3-1/1993-94, తేది : 27-6-1993

చిలుమూరు-522 301, తెనాలి ఆర్.యం.ఎస్., గుంటూరుజిల్లా,

ఇంటర్మీడియట్‌కు తెలుగు, ఇంగ్లీషు మీడియంలలో సుశిక్షణ

యంపిసి, బైపి, యంఇసి గ్రూపులు

కె. రాజశేఖర్, ఎమ్.ఎస్.సి., ప్రిన్సిపాల్

విద్యార్థులారా ! క్రమశిక్షణ, ఉత్తమ ఫలితములు సోపానములుగా విద్యాశిఖరాలనధిరోహించండి.

కుమ్మక్కై 760 రూపాయాలకు ఆ రోజు మొత్తం పెసలు కొనేయటం, రైతులంతా తిరగబడటం జరిగింది. ఈ అరాచకాన్ని అరికట్టాల్సిన మార్కెట్ కమిటీలు ఆదమరిచి నిద్రపోతున్నాయి. మార్కెట్‌కు వచ్చిన సరుకు లెక్కలు తారుమారు చేసి ప్రభుత్వ ఆదాయానికి గండికొట్టి అధికారులు పంచుకుంటున్నారు. ఈ మార్కెట్ మహామాయలకు భయపడి రైతులు మార్కెట్‌కు రాకుండా గ్రామాల్లో దళారులకు పంటనమ్ముకునే ధోరణి యిటీవల బాగా పెరిగింది. ఈ దళారులే మార్కెట్లలో అసలు రైతులుగా చెలామణి అవుతూ రైతుల సౌకర్యాలు తాము కాజేస్తున్నారు.

## ఈ దోపిడీలను ఎదిరించి పోరాడుదాం

రైతాంగంపైన ముఖ్యంగా పేద రైతులపై సాగుతున్న ఈ దోపిడీలకు వ్యతిరేకంగా మనం ఐక్యంగా పోరాడాలి. సమాజంలో ఆర్థిక దోపిడీ, అశాంతి అనేక రూపాల్లో తీవ్రమవుతున్నది. అన్ని వర్గాలవారూ తమ, తమ హక్కుల కోసం ఐక్యమై పోరాడుతున్నారు. రైతాంగం కూడా ఆ విధంగా ముందుకు రావాలి. పోరాడితేనే ఈ అన్యాయాలను ఎదిరించి నిలవగలం. గెలవగలం.

- 100కి నెలకు 2 రూపాయలకు మించి వడ్డీ వసూలు చేయరాదు.
- సొసైటీలలో పేద రైతుల సంఖ్యను బట్టి పెట్టుబడి కేటాయించాలి, బినామీ అప్పులు, కుంభకోణాలు అరికట్టాలి, గతంలో లాగా 5 1/2 శాతం మాత్రమే వడ్డీ వసూలు చేయాలి.
- జాతీయ బ్యాంకులు, వాణిజ్య బ్యాంకులు యిచ్చే వ్యవసాయ ఋణాలలో పేద రైతుల వాటాను, వారి సంఖ్యకు అనుగుణంగా పెంచాలి.
- వ్యవసాయ మార్కెట్లలో నిబంధనలన్నిటినీ ఖచ్చితంగా అమలుపర్చాలి, దళారుల దోపిడీని అరికట్టాలి.

- క్రిమిసంహారక మందుల కల్తీని నిరోధించాలి.
- జిల్లాలో కరువు మండలాలను ప్రకటించి, సహాయక చర్యలు చేపట్టాలి.
- విద్యుత్ రేట్లను స్లాబ్ సిస్టంపై నిరంతరం సరఫరా చేయాలి, విద్యుత్ శాఖలో అవినీతిని అరికట్టాలి.
- జిల్లాలోని అన్ని మార్కెట్లలో ప్రత్తి కొనుగోలు కేంద్రాలు ఏర్పాటు చేయాలి.
- ఇరిగేషన్ మరమ్మత్తులకు నిధులు వెంటనే కేటాయించాలి.

ఈ సదస్సులో రాష్ట్ర రైతు సంఘం అధ్యక్ష, కార్యదర్శులు శ్రీ బోడేపూడి వెంకటేశ్వరరావు, శ్రీ వి. శ్రీనివాసరావు, ఖమ్మం జిల్లా వ్యవసాయ కార్మిక సంఘం అధ్యక్షుడు శ్రీ తమ్మినేని వీరభద్రం పాల్గొని ప్రసంగించారు.

ఈ నెలాఖరులోగా మండల సదస్సులు జరపాలని, గ్రామ గ్రామాన కరపత్రాలు పంచి రైతుల్లో చర్చ జరపాలని ఆ తర్వాత కార్యాచరణకు పూనుకోవాలని సదస్సు నిర్ణయించింది. డిశంబర్ మొదటి వారంలో మార్కెట్ యార్డు సమస్యలపై అన్ని పక్షాలతో కలిసి సదస్సులు నిర్వహించాలని కూడ సదస్సు నిర్ణయించింది.

## చంద్రుగొండ రైతాంగ విజయం

ఖమ్మం జిల్లా కొత్త గూడెం డివిజన్‌లోని కొత్త గూడెం, జూలూరుపాడు, చంద్రుగొండ, ఏన్కూరు మండలాలలో ప్రధాన మైన పంట అయిన పత్తి క్వింటాల్‌కి 1,800 రూ. గిట్టుబాటు ధర కావాలని, ఎరువుల, పురుగు మందుల కోసం ఇచ్చిన అప్పుపై వడ్డీలను రద్దుచేయాలని, గతసంవత్సరం ఏర్పడిన సంక్షోభం ఫలితంగా అప్పులపాలైన రైతాంగంపై నిర్బంధ వసూలు చేయరాదని అట్టి అప్పు 3 సంవత్సరాల వాయిదాలపై వడ్డీ లేకుండా వసూలు చేసుకోవాలని డిమాండ్ చేస్తూ సదస్సులు ధర్నాలు నిర్వహించటం జరుగుచున్నది.

జూలూరుపాడు మండలంలో రైతుసంఘం అధ్వర్యాన నవంబర్ 9న 500 మంది రైతులతో సదస్సు నిర్వహించటం, ప్రదర్శనగా వెళ్ళి యం.ఆర్.ఓ.కు మెమోరాండం ఇవ్వటం జరిగింది. ఆ మండలంలోని అన్నీ గ్రామాలలో రైతులతో కమిటీలు వేయటం జరుగుచున్నది. గిట్టుబాటు ధరవచ్చే దాకా పత్తిఅమ్మే సమస్యే లేదని రైతులు ప్రకటిస్తున్నారు. ఏన్కూరు మండలంలో అఖిలపక్ష రైతుకమిటీ ఏర్పడింది పై డిమాండ్ల సాధన కోసం ఉద్యమిస్తున్నారు. కొత్తగూడెం మండలంలో రైతాంగం ఉద్యమానికి సమాయత్తం అవుతున్నది. చంద్రుగొండ మండలంలో అఖిలపక్ష రైతు కమిటీలు గ్రామగ్రామాన ఏర్పడి అన్ని పార్టీల నాయకులతో చంద్రుగొండ లో రైతు సదస్సు నిర్వహించారు. దీనిఫలితంగా అఖిలపక్ష రైతు కమిటీతో ఎరువుల, పురుగు మందుల వ్యాపారులు 15 నవంబరు సమావేశం నిర్వహించి చర్చించటం జరిగి ఈ క్రింది నిర్ణయాలను రావటం జరిగింది.

### సాధించిన విజయాలు :

1. పురుగు మందుల కొనుగోలుపై గతరెండు సంవత్సరముల నుండి వడ్డీ మాఫీ.
2. పురుగు మందులపై అధికంగా వేసిన రేట్లు తగ్గింపు.
3. పత్తి కొనుగోలు దారులు నేరుగా రైతులతో చర్చించటం.
4. పత్తిని వ్యాపారస్తులే (బోరాలు) బస్తాలు తొక్కించు కొనటం.
5. తూకం రాళ్ళు సీలువేసినవే ఉపయోగించటం.
6. పాత అప్పుల విషయంలో అఖిల పక్ష రైతు కమిటీతో వ్యాపారస్తులు చర్చించిన తర్వాతనే నిర్ణయం తీసుకొనటం.
7. మార్కెట్టు రేటుకు తగ్గకుండా పత్తి కొనుగోలు చేయటం.

పై డిమాండ్స్‌ను వ్యాపారులు అంగీకరించటం జరిగింది.

# రాష్ట్రంలో రైతాంగం ఎదుర్కొంటున్న సమస్యలు

## ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరి

- కొరటాల సత్యనారాయణ

మన ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయ రంగానికి అత్యంత ప్రాధాన్యత వున్నది. జాతీయాదాయాలు 32 శాతం కలిగివుండటమేగాక నూటికి 65 మందికి ఈ రంగమే ఉపాధి కల్పిస్తున్నది. ఏదేశమైనా పారిశ్రామికంగా అభివృద్ధి చెందాలంటే వ్యవసాయరంగంలో స్వయంపోషకత్వం వుంటేనే సాధ్యమౌతుంది. తనను తాను పోషించుకోవడమేగాక వ్యవసాయేతర రంగాలలో వుండే వాళ్ళకు తిండి పెట్టగలిగి వుండాలి. మన లాంటి దేశాలు తిండి గింజల్ని కూడా దిగుమతి చేసుకుని నిలబడలేవు.

స్వాతంత్ర్యం వచ్చేనాటికి 5 కోట్ల టన్నులుగా వున్న ఆహార ధాన్యాల ఉత్పత్తి 18 కోట్ల టన్నుల వరకు పెరిగింది. ఇది విజయమ్. కాని దేశ జనాభా అవసరాలతో పోల్చుకుంటే ఇది ఏమూలకు చాలదు. ప్రస్తుత జనాభాకు 24 కోట్ల టన్నులు కావాలి. కాని గత 5-6 సం॥లుగా ఆహార ధాన్యాల ఉత్పత్తిలో పెరుగుదల లేదు. దేశంలో ఆహార ధాన్యాలు పండించే ముఖ్యమైన రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. కాని ఇక్కడ 1988-89 నుండి వరుసగా నాలుగు సంవత్సరాలుగా ఆహారధాన్యాల ఉత్పత్తి పడిపోతున్నది. ఈ క్రింది అంశాలు గమనించండి।

| సంవత్సరం | ఉత్పత్తి (లక్షల టన్నులు) |
|---|---|
| 1989-90 | 127.71 |
| 1990-91 | 123.30 |
| 1991-92 | 117.05 |
| 1992-93 | 114.05 |

ఈ విధంగా పడిపోవడానికి కారణాలేమిటో మనం పరిశీలించాలి. వ్యవసాయాభివృద్ధికి ప్రధానంగా (1) భూమి, (2) నీరు, (3) ఆధునిక పరికరాలు, (4) పెట్టుబడి, (5) మార్కెట్ సానుకూలత అనే అంశాలు దోహదపడతాయి. వీటిని పరిశీలించడమే ఈ వ్యాసం ప్రధానోద్దేశ్యం.

> "భూమిపై పనిచేసే కష్టజీవులకు ప్రభుత్వం భూవసతి కల్పించ కలిగితే కండలు కరిగించి ఉత్పత్తిని పెంచి దేశానికి తిండి పెట్టగలుగుతారు. దీనికి బెంగాల్ సజీవ సాక్షి"

### భూమి :

ప్రకృతి వనరైన భూమి రాష్ట్రంలో కొద్దిమందికే హక్కుగా వున్నది. గ్రామీణ జనాభాలో సగం మందికి చేసుకోడానికి భూమిలేదు. భూమి కలిగిన వాళ్ళలో నూటికి 60 మందికి 5 ఎకరాలలోపే వున్నది. నూటికి ఇద్దరికి మాత్రమే 25 ఎకరాల పైబడి వున్నది. వారి చేతిలో 20శాతం భూమి కేంద్రీకరించబడి వున్నది. భూసంస్కరణలు అమలు జరిపి అందరికీ భూమి కల్పించాలనేది జాతీయోద్యమ వినాదం. దున్నేవానికే భూమి కావాలని రైతాంగ ఉద్యమాలు ముందుకు తెచ్చాయి. స్వాతంత్ర్యా నంతరం ప్రజా ఉద్యమాల తాకిడికి తట్టుకోలేని ప్రభుత్వం భూసంస్కరణలు చట్టాలు తెచ్చినప్పటికీ భూస్వాములు ముందు గానే జాగ్రత్త పడి అక్రమ అమ్మకాలు, బినామీ మార్పిడులు సాగించి, జాగ్రత్తపడ్డారు. ఆఖరికి భూసంస్కరణల బాగోతం పంచపాండవులు - మంచపుకోళ్ళ సామెతగా తయారైంది. బంజరు భూములు అటవీ భూములు కూడా పేదవాళ్ళకు పూర్తిగా దక్కలేదు. స్వంతసేద్యం పేరుతో కౌలుదార్లకు భూమిపై హక్కు లేకుండా చేశారు. అందువలన రాష్ట్రంలో కోటి 16 లక్షల మంది ఇతరుల పొలాల్లో కూలీలుగా బ్రతుకుతున్నారు. భూమిపై మమ కారం కలిగి బ్రతుకుదెరువు కోసం పేద రైతులు ధనిక రైతుల నుండి ఎక్కువ కౌళ్ళకు సేద్యం చేస్తున్నారు. తాము కష్టపడి ఎకరాకు 30 బస్తాలు పండిస్తే అందులో 24 బస్తాలు కౌలుకే చెల్లవుతుంది. మిగిలేది గడ్డి

మాత్రమే. అయినా వ్యవసాయపనులు కూడా దొరకడం లేదు గాబట్టి అనివార్యంగా కౌళ్ళు చేస్తున్నారు. ఈ పరిస్థితి భూమిపై కష్టజీవులకు గల మమకారాన్ని తెలియజేస్తున్నది. అలాంటి వారికే గనుక ప్రభుత్వం భూవసతి కల్పించగలిగితే కండలు కరిగించి ఉత్పత్తి పెంచి ఈ దేశానికి తిండిపెట్టగలుగుతారు. దీనికి ప॥బెంగాల్ ఉదాహరణే సజీవ సాక్ష్యం.

## పశ్చిమ బెంగాల్ ఆదర్శం :

బెంగాల్‌లో 16 సం॥లుగా అధికారంలో వున్న వామపక్ష ప్రభుత్వం దేశానికే ఆదర్శ వంతంగా భూసంస్కరణలు అమలు జరిపింది. 9 లక్షల 25 వేల ఎకరాల భూమిని (దేశంలో ఇది 20 శాతం) పంచడమే గాక 14 లక్షల మంది కౌల్దార్లకు హక్కును కల్పించింది. దీని ఫలితంగా అక్కడ వ్యవసాయోత్పత్తి విపరీతంగా పెరిగింది. ఒకప్పుడు బియ్యం దిగుమతి చేసుకునే రాష్ట్రంగా వున్న బెంగాల్ నేడు ఉత్పత్తిలో ప్రథమ స్థానాన్ని ఆక్రమించింది. గ్రామీణ కుటుంబాల ఆదాయం పెరుగుదల రేటు ఏ రాష్ట్రం కన్నా ఎక్కువగా వున్నది. అందువలనే అక్కడ గ్రామీణ ప్రజలు ఈ ప్రభుత్వం మాది అనుకోగలుగుతున్నారు.

## నీటి వనరులు :

రాష్ట్రంలో మూడోవంతు సాగుభూమికి మాత్రమే ఏదో ఒక రూపంలో నీటి వనరున్నది. ఇందులో 45 శాతం పెద్ద ప్రాజెక్టుల క్రింద, డెల్టా క్రింద సాగవుతుండగా మిగతా 55 శాతం చెరువులు, కుంటలు, బావులు, బోర్ల క్రింద జరుగుచున్నది. రాష్ట్రంలో కృష్ణా, గోదావరి వంటి జీవనదులున్నా ఆ నీటిని పూర్తిగా సద్వినియోగం చేసుకోలేకపోతున్నాము. వినియోగంలో ఉన్న నీరు కూడా అసమానంగా పంపిణీ కాబడి కొన్ని ప్రాంతాలు పూర్తిగా నిత్య కరువు ప్రాంతాలుగా మారిపోయాయి. అనంతపురం మ॥నగర్, రంగారెడ్డి, నల్లగొండ, వరంగల్, ప్రకాశం, ఆదిలాబాద్ జిల్లాలకు సరైన నీటి వసతి లేదు. సంవత్సరాల తరబడి ప్రాజెక్టుల నిర్మాణం సాగడం, నిధుల కొరతతో నిర్మాణ ఖర్చులు పెరగడం, డ్యాం పూర్తయినా కాలువల తవ్వకాలు పూర్తి కాకపోవడం, కాలువల డిజైనులో లోపాల వలన కాలువ చివర భూములకు నీరందక పోవడం, కొన్ని ప్రాజెక్టులకు కేంద్రం అనుమతి ఇవ్వకపోవడం నేడు మనం ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలు. కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ ఒకే ప్రభుత్వం వున్నా ప్రధాన మంత్రి మన రాష్ట్రం వాడే అయినా ప్రధాని, ముఖ్యమంత్రి ఇద్దరూ రాయలసీమకే ప్రాతినిధ్యం వహిస్తున్నా ఈ తిప్పలు తప్పడం లేదు. పరిస్థితిలో మార్పులేదు. బచావత్ అవార్డు ప్రకారం 2 వేల సం॥ లోగా మిగులు జలాలపై మనకు గల హక్కును వినియోగించుకోవాలి. లేకపోతే పునఃసమీక్షలో మనం చాల కోల్పోతాము. కాని బడ్జెట్ కేటాయింపులు చూస్తే 50 ఏండ్లకు కూడా ఇవి పూర్తికావు. ఈ నిర్లక్ష్యం ఇలాగే సాగితే రాష్ట్రం ఇంకా వెనుకబడిపోవడం ఖాయం. ఇప్పటికైనా మేల్కొని ఏదో ఒక పద్ధతిలో నిధులు సమకూర్చుకొని సత్వరం నిర్మాణంలో వున్న ప్రాజెక్టుల నన్నింటిని పూర్తి చేసుకోవాలి. ఈలోగా కేంద్రం నుండి అనుమతి సంపాదించుకోవాలి. అలాగే చిన్న నీటి వనరుల క్రింద వున్న ఆయకట్టు 45 లక్షల ఎకరాలను పునరుద్ధరించి కొత్త చెక్‌డ్యాంలు, చెరువులు కూడా పూర్తి చేసుకోవాలి. కరువు ప్రాంతాలలో భూగర్భ జలాలకు ప్రాధాన్యత నివ్వాలి. ఆ విధంగా ఉపరితల, భూగర్భ జలాలను సమన్వయం చేసుకొని మన నీటివనరులని సద్వినియోగం చేసుకోగలిగితే రాష్ట్రంలో వున్న భూమి కంతటికి ఒక పంటకు సాగునీరివ్వవచ్చు. అప్పుడే ఉత్పత్తి గణనీయంగా పెరుగుతుంది.

> " వినియోగంలో ఉన్న నీరు అసమాన పంపిణీవల్ల కొన్ని ప్రాంతాలు నిత్య కరువుగా మారిపోయాయి"

## పెట్టుబడి :

అభివృద్ధి చెందిన నేటి ఆధునిక వ్యవసాయ పద్ధతులకు పెట్టుబడి ప్రధాన పాత్ర వహిస్తున్నది. కొత్తరకం వంగడాలు, ఎరువులు, క్రిమిసంహారక మందులు వగైరా అన్నింటికీ పెట్టుబడి కావాలి. ఆ ఉద్దేశంతోనే సహకార వ్యవస్థను స్థాపించినప్పటికీ అది ఈనాటికీ తన లక్ష్యాన్ని నెరవేర్చలేకపోతున్నది. సహకార వ్యవస్థ ఉన్నవాళ్ళ చేతిలో బందిఖానా అయింది. సన్న, చిన్నకారు రైతాంగానికి పైసా అప్పు ఇవ్వడంలేదు. అనివార్యంగా వారు వడ్డీవ్యాపారస్తులపై ఆధారపడక తప్పడం లేదు. ఈ బలహీనతను ఆసరాగా చేసుకొని వడ్డీ వ్యాపారస్తులు రూ. 3ల నుండి రు.10ల వరకు వడ్డీ గుంజి పెద్ద ఎత్తున దోపిడీ సాగిస్తున్నారు. అందువలన అధిక సంఖ్యాక రైతాంగ ప్రయోజనాల కనుగుణంగా సహకార వ్యవస్థను పునర్వ్యవస్థీకరించాలి. పేద, మధ్యతరగతి రైతాంగం కదిలి తమకు హక్కుగా రావాల్సిన అప్పును రాబట్టుకోవాలి. బినామీ

# కొప్పెరపాడు ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం లిమిటెడ్,

నెం.జె-296

కొప్పరపాడు, జె. పంగులూరు మండలం ప్రకాశం జిల్లా

అధ్యక్షులు : కొల్లూరి సుబ్బారావు
ఉపాధ్యక్షులు : ముచ్చు అంజనేయులు
రావూరి శ్రీరాములు
యనికపాటి వెంకటేశ్వర్లు
అరిపెన వెంకటేశ్వర్లు
షేక్ అన్వార్ అహ్మద్
షేక్ నన్నే సాహెబ్
దుడ్డు ఆశీర్వాదం
బద్దిగం రత్నారెడ్డి
పాలపర్తి దేవదానం
పూనీటి వసంతకుమారి
బోపూడి ధనలక్ష్మమ్మ
బెంగినేని నాగమ్మ



డిపాజిట్..................4 లక్షలు
ఖాతాదార్లు......................400
రుణాలు...............20 లక్షలు

కౌంటర్, సూపర్ బజార్ సౌకర్యం కలదు.

గత 10 సం॥ల నుండి వసూళ్ళలో నూటికి నూరుశాతంచేసిన రాష్ట్రంలోనే ఆదర్శవంతమైన సొసైటీ

# నూజెళ్ళపల్లి ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘము లిమిటెడ్

నెం.జె-46

అధ్యక్షులు : శ్రీ పెంట్యాల హనుమంతరావుగారు
ఉపాధ్యక్షులు : శ్రీ అద్దంకి నాగేశ్వరరావుగారు



డైరెక్టర్లు :

శ్రీ కొల్లి అంజనేయులు
శ్రీ మద్దినేని కృష్ణమూర్తి
శ్రీ మద్దినేని నాగభూషణం
శ్రీ మద్దినేని అంజనేయులు
శ్రీ గంగా మోహన్‌రావు
శ్రీ కవలా కోటయ్య
శ్రీ డోలా వెంకటేశ్వర్లు
శ్రీ గొనుగుంట వెంకట్రావు
శ్రీ చలంచర్ల సోమయ్య
శ్రీమతి మద్దినేని లక్ష్మీకాంతమ్మ
శ్రీమతి మన్నెం వెంకాయమ్మ

**డిపాజిట్లు :** (రూ.లక్షలలో)

| | |
|---|---|
| సేవింగ్స్ డిపాజిట్స్ | 1.0 |
| రికరింగ్ డిపాజిట్స్ | 0.29 |
| ఫిక్స్‌డ్ డిపాజిట్స్ | 2.00 |
| భాగ్యలక్ష్మి డిపాజిట్స్ | 12.00 |

**మొత్తంలోను :** (రూ.లక్షలలో)

| | |
|---|---|
| స్వల్పవాయిదా అప్పులు | 18.00 |
| మధ్యవాయిదా అప్పులు | 3.00 |
| దీర్ఘకాలిక వాయిదా అప్పులు | 0.30 |

రుణాలు చెల్లవని నిలదీయాలి. ఒకే ఇంటిలోని వారే 5 - 6 గురు తీసుకోడానికి వీలు లేదని నినదించాలి. ప్రస్తుతం నూతన ఆర్థిక విధానాలపేరుతో నర్సింహం కమిటి సిఫారసుల మేరకు వ్యవసాయ, దాని అనుబంధ రంగాలకు ఇచ్చే రుణ వాటాను 40 నుండి 10 శాతానికి తగ్గించాలని ప్రయత్నం గట్టిగా జరుగుచున్నది. దీన్ని ఎదుర్కోవాలి. పేద రైతులకు సబ్సిడీ ధరలపై ఇన్‌పుట్స్ సరఫరా చేయడం, సులభపద్ధతులపై రుణాలు మంజూరు చేయడం వలనే బెంగాల్‌లో రైతులు అధికంగా పండించగలుగుతున్నారు. దేశమంతా ధనిక రైతులు మాత్రమే ఉత్పత్తి ఎక్కువగా చేస్తుంటే బెంగాల్‌లో మాత్రం ఉత్పత్తిలో అధిక భాగం పేద రైతుల నుండి వస్తున్నది.

## మార్కెట్ సౌకర్యాలు :

కష్టపడి పండించడం ఒక ఎత్తైతే దానికి గిట్టుబాటు ధర లభించడం మరో ఎత్తు అవుతుంది. మార్కెట్ కబంధ హస్తాల్లో రైతులు ఇరుక్కొని నానా అవస్థలు పడుతున్నారు. ఈ మార్కెట్ నేడు పెట్టుబడుదారుల, పెద్ద వ్యాపారస్తుల కంట్రోలులో వున్నది. వారు "సరఫరా-గిరాకీ" సూత్రం పేరుతో పసూళ్ళ కాలంలో ధరలు దిగ్గోసి ఆ తర్వాత విపరీతమైన లాభాలకు ఇదే సరుకును అమ్ముకుంటున్నారు. ఉదా॥ ఈ సం॥ మార్చిలో రైతులు ఉల్లిపాయలు 70 - 80 రూపాయలకు కూడా అమ్ముకున్నారు. అదే ఉల్లిపాయను నేడు వ్యాపారస్తులు 1200 నుండి 1600 లకు అమ్ముకుంటున్నారు. వడ్లు అమ్ముకొనేటప్పుడు బస్తా రు. 220 ఐతే ఆ ధాన్యం బియ్యమే నేడు కేజి రు. 8 లకు అమ్ముతున్నారు. ఆ విధంగా మధ్య దళారీలు, వ్యాపారస్తులు, పెట్టుబడిదారులు కుమ్మక్కై వందల కోట్ల రూపాయలు రైతుల నుండి దోపిడీ చేస్తున్నారు. నూతన ఆర్థిక విధానాల పేరుతో ఇలాంటి మార్కెట్‌కు పూర్తి స్వేచ్ఛనిస్తున్నారు. ప్రభుత్వ జోక్యం పూర్తిగా మానుకోవాలని పెట్టుబడి దారులు డిమాండు చేస్తున్నారు. ఇది రైతులకు చాలా నష్టదాయకమైన అంశం. మార్కెట్ ప్రారంభం నుండే ప్రభుత్వ ఏజెన్సీలు కూడా రంగంలో వుండి పోటీపడి కనీసం 10 శాతం ఉత్పత్తిని కొనుగోలు చేసినా రైతుకు కొంత న్యాయం జరుగుతుంది. ప్రభుత్వం ప్రకటించే మద్దతు ధరలు వాస్తవ విరుద్ధంగా వుంటున్నాయి. ఉత్పత్తి ఖర్చులను, రైతు కుటుంబ శ్రమను కూడా పరిగణనలోకి తీసుకునే ఆ కుటుంబం బ్రతకడానికి వీలైన కనీస లాభం వుండే విధంగా గిట్టుబాటు ధరలు నిర్ణయించాలి. దాన్ని అమలు జరపడానికి ప్రభుత్వ ఏజెన్సీలు మార్కెట్ ప్రారంభం నుండి రంగంలో వుండాలి. హెచ్చు తగ్గులు లేకుండా సంవత్సరమంతా ఒకే ధరలు కొనసాగితే ఇటు రైతుకు, అటు వినియోగదారుడికి కూడా మేలు జరుగుతుంది. ప్రభుత్వ ఎగుమతుల, దిగుమతుల విధానాన్ని కూడా సవరించాలి. పెట్టుబడిదారుల లాభాపేక్షకు అనుగుణంగా ఎగుమతులు, దిగుమతులు సాగుతున్నాయి. ప్రభుత్వం ఎగుమతులను పెంచడం లక్ష్యంగా ప్రకటించినప్పటికీ ప్రపంచ మార్కెట్‌లో బాగా డిమాండ్ వున్న ప్రత్తి, పొగాకు వంటి సరుకులు మన దేశ అవసరాలకు పోను మిగులు వున్నా సకాలంలో ఎగుమతి చేయలేకపోయింది. గోధుమలు సెల్కు అవసరం లేకున్నా దిగుమతి చేసుకున్నందుకు ఇక్కడ ధరలు పడిపోయి రైతులు నష్టపోయారు. మార్కెట్‌లో రైతులకనుకూలంగా ప్రభుత్వం జోక్యం చేసుకోవడమేగాక సహకార మార్కెటింగును కూడా ప్రోత్సహించాలి.

> "వడ్డీ వ్యాపారస్తులు పెద్ద ఎత్తున దోపిడీ సాగిస్తున్నారు దీనిని అదిగమించడానికి పేద, మధ్య తరగతి రైతులు సహకార రంగాల నుండి తమకు హక్కుగా రావలసిన అప్పును రాబట్టుకోవాలి"

## ఆధునిక సౌకర్యాలు :

వ్యవసాయాభివృద్ధికి ఆధునిక పరిజ్ఞానం ఎంతో తోడ్పడు తున్నది. కాని అదంతా సాధారణ రైతుకి చేరడంలేదు. ముఖ్యంగా ట్రాక్టర్లు, స్ప్రేయర్లు వంటి పరికరాలు పేదరైతులకు అందుబాటులో లేవు. 4 - 5 గ్రామాలకు కలిపి ఒక సర్వీసింగు సెంటర్‌ను పెట్టి పరికరాలను తక్కువ రేట్లకు అద్దెకివ్వగలిగితే చాల ఉపయోగం. అలాగే ఒక వ్యవసాయ సహాయకుడ్ని కూడా నియమించాలి. దీని వలన చాల మందికి ఉద్యోగాలు లభించడమేగాక ఆధునిక పరిజ్ఞానం రైతులకు త్వరగా లభిస్తుంది. చీడ పీడలనుండి పంటలకు రక్షించుకోడానికి రైతుకు నిత్య సహాయం అవసరం. ప్రస్తుత వ్యవసాయ యంత్రాంగం ఆ విధంగా సహాయపడలేకున్నది.

విత్తనాలు, మందుల కల్తీ నేడొక బెడదగా తయారైంది. లాభాపేక్షతో వ్యాపారస్తులు నకిలీ సరుకులు అమ్మి రైతుల్ని మోసగిస్తున్నారు. వీటిని కనుక్కొనే పరిజ్ఞానం రైతులకు లేదు. తీరా మొలకెత్తకపోయినా, పురుగు చావక పోయినా వ్యాపారస్తులు తమకేమీ సంబంధం లేదని చేతులెత్తేస్తున్నారు. ఈ బాధ నుండి రైతులను తప్పించాలంటే ప్రతి మండల కేంద్రంలోనూ ఒక

> "ఉత్పత్తి ఖర్చులను, రైతు కుటుంబ శ్రమను పరిగణలోనికి తీసుకొని గిట్టుబాటు ధర నిర్ణయించాలి"

వ్యవసాయ ప్రయోగశాలను నెలకొల్పాలి. రైతులకు ప్రత్యక్షంగా శిక్షణ ఇవ్వాలి. ప్రతి గ్రామంలోనూ ఒకరో ఇద్దరో అలాంటి వాళ్ళు వుంటే కల్తీని తొందరగా రూపుమాపవచ్చు. కల్తీకి పాల్పడే వారిని కఠినంగా శిక్షించడానికి చట్టంలో సవరణలు తేవాలి. వారికి అండగా వుండే రాజకీయ నాయకులు గుట్టురట్టు చేయాలి.

ఈ విధంగా వ్యవసాయాభివృద్ధిని ప్రభావితం చేస్తున్న పై అంశాలపై ప్రభుత్వం ఒక నియమబద్ధమైన విధానాన్ని రూపొందించి దాన్ని చిత్తశుద్ధితో అమలుజరపాలి. ఇందుకోసం రైతాంగం నడుం కట్టి పోరాడనిదే సాధ్యంకాదు. ఆ కృషిలో ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం అగ్రభాగాన నిలవాలని ఆశిస్తున్నాను.

# [illegible]

**నేడు** ఈ అంశం తీవ్ర చర్చనీయాంశం అయ్యింది. రాజకీయ పక్షాలు, పత్రికల నుండి, శాస్త్రవేత్తలు చివరకు రైతాంగం వరకు వ్యవసాయ రంగంపై నూతన ఆర్థిక విధానం ప్రభావం గురించి వ్యాఖ్యానాలు చేయని రోజులేదు. కారణం జనంపై ఇది కల్గించే ప్రభావమే.

గ్లోబలైజేషన్, లిబరలైజేషన్ అనే రెండు మాటల్లో దీని సారాంశం చెప్ప బడుతుంది. దేశానికి అప్పునిస్తున్న ఐ.యం.ఎఫ్. ప్రపంచ బ్యాంకు వారి ఆదేశాల షరతుల మేరకు ఇవి అమలు జరుపబడుతున్నాయి.

## పూర్వ రంగం

నూతన ఆర్థిక విధానాలను పాలక వర్గాలు వ్యవసాయంలో సయితం ఇప్పుడు అమలు చేయడానికిగల కారణాలను గమనించడం అవసరం. 1) స్వాతంత్ర్యానంతరం దేశంలో నిరంతరాయంగా ఫ్యూడల్ దోపిడి కొనసాగుతూ వచ్చినందున, విస్తృత ప్రజానీకం యొక్క కొనుగోలు శక్తి అతి తక్కువ స్థాయిలో ఉండిపోయింది. ఫలితంగా 1949-50 నుండి 1983-84ల మధ్య వ్యవసాయంపై ఆధారపడిన ప్రజానీకం యొక్క సగటు ఆదాయం పెరగలేదు. పేదరికం పెరిగింది. మరోవైపు దేశంలో గుత్తపెట్టుబడిదారులు విపరీతమయిన లాభాలను పోగుచేసుకొన్నారు. 1951లో 22 గుత్త సంస్థలు 312.63 కోట్ల రూ॥లుగా ఉండగా అది 1990కి 34,538.14 కోట్లకు పెరిగింది. వీటి వార్షిక పెరుగుదల రేటు 226.12 శాతానికి చేరింది. ప్రజల కొనుగోలుశక్తి పెరగక - గుత్తసంస్థల లాభాలు విపరీతంగా పోగుబడ్డ దశలో తమ సరుకులను పరిమితంగానైనా కొనేవర్గాల అభిరుచులకనుగుణంగా రూపొందించడానికి అవసరమయిన సాంకేతిక పరిజ్ఞానం దిగుమతి కొరకు ఇది అవసరమయింది. అలాగే ఒకప్పుడు సామ్రాజ్యవాద పెట్టుబడుల నుండి రక్షణ కొరకు - పబ్లిక్ రంగ పరిశ్రమలను ప్రవేశ పెట్టిన వర్గాలు నేడు బాగా లాభాలు ఆర్జించిన అనంతరం పబ్లిక్ రంగాన్ని నిర్వీర్యం చేసి దాని స్థానాన్ని కూడా ఆక్రమించడానికి ప్రయత్నిస్తున్నాయి.

పి. మధు

2) అంతర్జాతీయంగా చూస్తే, రెండవ ప్రపంచ యుద్ధానంతరం అమెరికా నుండి యూరోపియన్లు దిగుమతి చేసుకుంటూ వచ్చిన వంటనూనెల కొరతను అధిగమించడానికి కృషిచేసినారు. శాశ్వితంగా దిగుమతి మీద ఆధారపడరాదని భావించి సబ్సిడీల ద్వారా ప్రోత్సహించారు. దాంతో 1980 దశకం వచ్చే సరికి యూరోపియన్లు తమ చమురు గింజల ఉత్పత్తిని విస్తరించి అమెరికా ప్రత్యర్థులను అడ్డుకొనే స్థితికి చేరారు. అంతేగాదు, ప్రపంచ మార్కెట్టులో ఎక్కువ భాగాన్ని తమ హస్తగతం చేసుకోవడంలో కృత కృత్యులయ్యారు. మరోవైపు అమెరికా యూరోపియన్ల

ఒకప్పుడు సామ్రాజ్యవాద పెట్టుబడుల నుండి రక్షణ కొరకు - పబ్లిక్ రంగ పరిశ్రమలను ప్రవేశ పెట్టిన వర్గాలు నేడు బాగా లాభాలు ఆర్జించిన అనంతరం పబ్లిక్ రంగాన్ని నిర్వీర్యంచేసి దాని స్థానాన్ని కూడా ఆక్రమించడానికి ప్రయత్నిస్తున్నాయి.

పోటీని తట్టుకోవడం కొరకు ఉత్పత్తిని అధికం చేసింది. ఉభయుల మధ్య తమ అవసరాలకు మించి ఉత్పత్తి పెరిగింది. సోవియట్ సాంకేతిక ఆర్థిక సహాయం లభించని స్థితిలో సామ్రాజ్యవాదుల సాంకేతిక సహాయం కొరకు భారత బడాబూర్జువా వర్గం ఆశ్రయిస్తున్న దశలో నూతన ఆర్థిక విధానాలు దేశప్రజల మీద రుద్దబడ్డాయి.

నూతన ఆర్థిక విధానంలో 1) వ్యవసాయానికి సబ్సిడీని తొలగించడం, 2) దిగుమతులపై ఉన్న ఆంక్షలు తొలగించడం, 3) ప్రజా పంపిణీ వ్యవస్థను రద్దు చేయడం, 4) విదేశీ గుత్త సంస్థలు భారతదేశ వ్యవసాయ రంగంలో ప్రవేశించడానికి స్వేచ్ఛనివ్వటం, 5) భారతదేశ వ్యవసాయంలో పేటెంటు హక్కును ప్రవేశపెట్టడానికి అనుమతివ్వడం మొదలగునవి ప్రధాన అంశాలు.

ఈ పూర్వ రంగంలో పరిశీలిస్తే ఈ విధానాలు మన వ్యవసాయాన్ని విచ్ఛిన్నం చేసి సంపన్న దేశాలకు, బహుళజాతి సంస్థలకు దారాదత్తం చేస్తాయని విదితం అవుతుంది.





# సారా నిషేధం

మీ కోసం మీ ప్రభుత్వం తీసుకున్న
చారిత్రాత్మక నిర్ణయం

# సారా కాటుకు బలి కావద్దు!



సారా విషంతో సమానం! సారా మానండి!!



## సబ్సిడీలు

వ్యవసాయానికి, అవసరమయిన ఎరువులు, విద్యుత్, నీరు, ఇతర పరికరాలపై యిస్తున్న రాయితీలు ఉపసంహరించ బడు తున్నాయి. 1991 వరకు ఎరువులకు యిస్తున్న సబ్సిడీ 30 శాతం తగ్గించి 1992లో పూర్తిగా ఉపసంహరించింది. ఈ మధ్య జరిగిన విద్యుత్ శాఖామాత్యుల సమావేశంలో వివిధ రాష్ట్రాలు విద్యుత్‌పై యిస్తున్న సబ్సిడీని రద్దుచేయాలని సూచించ బడింది రాష్ట్రంలో పెట్టుబడిమీద 3% ఆదాయం రావాలని సూచించింది. విద్యుత్ వినియోగం ఉత్పత్తిలో 25% వ్యవసాయరంగంలో జరుగుతుండగా అది 1989-90 వరకు 15 పైసలకే సరఫరా చేస్తూ వచ్చారు. నేడు ప్రైవేటు యజమాన్యంతో తయారుచేసే ఉత్పత్తిదారులకు రూ॥లు 2.50కి యూనిట్ చొ॥న అమర్చుకోడానికి వీలుగా, అగ్రిమెంట్ చేయడం జరిగింది.

**నూతన ఆర్థిక విధానాలు - డంకెలు ప్రతిపాదనల్లో వ్యవసాయ రంగానికి సబ్సిడీలు తొలగించాలని ఆదేశాలు జారీ చేస్తున్న తరుణంలోనే - ప్రపంచంలో దాదాపు అన్ని దేశాలు ఆయా దేశాల్లో వ్యవసాయాభివృద్ధికి సబ్సిడీలు యిస్తూ ఉన్నాయి.**

అలాగే నీటి తీరువా రెట్లు 20 రూ॥ల నుండి 40రూ॥లు వరకు ఉన్న వాటిని రూ॥లు 40-60గా పెంచారు. అలాగే వ్యవసాయా నికి అవసరమయిన పనిముట్ల కొనుగోలుపై యిచ్చే రాయితీలకు కోత విధిస్తున్నారు.

వ్యవసాయంలో ముఖ్యమయిన భాగం వ్యవసాయ కార్మికులు. వీరికి ఉద్దేశించిన ఆహార సబ్సిడీపై కోత విధించారు. 2 రూ॥లు బియ్యం కోటా తగ్గించి ధర 3-50 చేసినందున మమారు 300 కోట్ల రూ॥లు సాలీన ఈ వర్గాలు అదనపు భారం మోయవల్సి వస్తోంది.

నూతన ఆర్థిక విధానాలు - డంకెలు ప్రతిపాదనల్లో వ్యవసాయ రంగానికి సబ్సిడీలు తొలగించాలని ఆదేశాలు జారీ చేస్తున్న తరుణంలోనే - ప్రపంచంలో దాదాపు అన్ని దేశాలు ఆయా దేశాల్లో వ్యవసాయాభివృద్ధికి సబ్సిడీలు యిస్తూ ఉన్నాయి. జపాన్ రైతు - 72% సబ్సిడీ పొందుతుండగా, యూరోప నుండి అమెరికా, ఆస్ట్రేలియా చైనా, రష్యావరకు అన్ని దేశాల రైతులు 20నుండి 37 శాతం వరకు సబ్సిడీలు పొందు తున్నారు. మన దేశ రైతు మాత్రం కేవలం 2% సబ్సిడీ పొందు తున్న దాన్ని కూడా కోతకోస్తున్నారు. సబ్సిడీల కోత వ్యవసాయ రంగంలో ప్రత్యేకంగా అభివృద్ధి చెందుతున్న దేశాలలో నూతన ప్రక్రియల అభివృద్ధికి తీవ్రమయిన ఆటంకం కల్గిస్తోంది. ఉదా : మనదేశంలో పామోలిన్ అభివృద్ధికి యిస్తున్న సబ్సిడీ రద్దయితే శాశ్వతంగా పామోలిన్ విదేశాల నుండి దిగుమతి చేసు కోవాల్సిందే.

సబ్సిడీల రద్దువల్ల సన్నకారు, చిన్నకారు రైతాంగం పెట్టుబడులు పెట్టలేక నలిగి పోతుంది. సబ్సిడీలు రద్దయితే ఉత్పత్తి తగ్గి ఆహార సంక్షోభానికి దారితీస్తుంది. పూర్తిగా విదేశాల నుండి దిగుమతి చేసుకోవాల్సి వస్తుంది. ఆకలి మంటలు చల్లార్చుకోడానికి గుత్త పెట్టుబడిదారుల దయాదాక్షిణ్యాల మీద బతకాల్సివస్తుంది. దోపిడీ తీవ్రం అవుతుంది.

## పరపతి సౌకర్యము

వ్యవసాయరంగాన్ని ప్రాధాన్యతా రంగంగా భావించి అదనపు రాయితీలతో పరపతి ఉదారంగా కల్పించాలన్నది స్వాతంత్ర్యా నంతరం మన విధానంగా వచ్చింది. బ్యాంకులు ఇచ్చే మొత్తం ఋణాలలో 40% ప్రాధాన్యతా రంగంగా పేర్కొన్న వ్యవసాయ రంగానికి ఇస్తూ వచ్చారు. వడ్డీ కూడా తక్కువ. ప్రపంచ బ్యాంకు ఐ.ఎం.ఎఫ్. సిఫార్సుల మేరకు దీనికి ఎసరు పెట్టబడింది. నర్సింహం కమిటీ సిఫార్సుల మేరకు వ్యవసాయ రంగానికి ఇచ్చే ఋణ మొత్తాన్ని 10%కు తగ్గించాలని నిర్ణయించబడింది. "ప్రజల వద్ద డిపాజిట్ల సేకరణ బాగా ప్రోగుచేసి అధిక లాభాలు గడించడ మన్నది బ్యాంకుల విధానంగా ఉండాలి" అన్నది నరసింహం కమిటీ మరో సిఫార్సు. కనుక తక్కువ వడ్డీకి వ్యవసాయ రంగానికి అప్పులు ఇచ్చే పద్ధతికి స్వస్తి చెప్పడం ఆరంభమయింది. రాష్ట్రంలో సహకార ఋణాలు సకాలంలో చెల్లించిన వారికి 5.5% వడ్డీ మాత్రమే తీసుకొనే పద్ధతి స్వస్తి చెప్పబడింది. గ్రామ ప్రాంతాలలో నష్టాలు వచ్చే బ్యాంకులను ఎత్తివేయాలని నిర్ణయించారు. బ్యాంకులు సామాజిక బాధ్యతకు స్వస్తివాచకాలు పలికాయి.

దీని మూలంగా భూస్వామ్య తరగతులకు పెట్టుబడి అవకాశం ఉన్నందున నష్టం కలగకపోయినా, మిగతా రైతాంగం వడ్డీ వ్యాపారుల కబంధ హస్తాలలోకి నెట్టబడుతున్నారు. పేదరైతులు అప్పులపాలై భూములు కోల్పోతారు. అలాగే వ్యవసాయ ఖర్చులు విపరీతంగా పెరిగి సాధారణ రైతాంగం తట్టుకోలేకుండా పోతుంది.

## దిగుమతులు – ఎగుమతులు

స్వాతంత్ర్యానంతరం దేశంలో ఆహారధాన్యాల స్వయం సమృద్ధి సాధించడానికి విదేశీ గుత్తసంస్థల పోటీనుండి తట్టుకోవడానికి దిగుమతులు, ఎగుమతులపై ప్రభుత్వం ఆంక్షలు విధించింది. అలాగే అంతరాష్ట్ర, అంతర్ జిల్లాల రవాణాను క్రమబద్ధం చేస్తూ వచ్చింది. ఎగుమతులు, దిగుమతులు ఎక్కువ భాగం ప్రభుత్వం ద్వారా జరుగుతూ వచ్చాయి. నేడు ఐ.ఎం.ఎఫ్., డంకెల్ ప్రతిపాదనల మూలంగా అమలు జరిపే నూతన ఆర్థిక విధానాలను అనుసరించి ప్రస్తుతం ఉన్న ఆంక్షలను, అదుపులను తొలగించ పూనుకున్నారు.

డంకెల్ ప్రతిపాదనలపై సంతకాలు ఇంకా జరగకపోయినా, వారి ఆంక్షలు మాత్రం ఇప్పటికే అమలు జరిగిపోతున్నాయి. 1992లో 30 లక్షల టన్నుల ఆహారధాన్యాలను మన దేశం దిగుమతి చేసుకొన్నది. విచిత్రమేమంటే మనం ఎగుమతి చేసిన ధర (215 రూ॥లు క్వింటా)కంటే ధర ఎక్కువ చెల్లించి దిగుమతి (517 రూ॥లు క్వింటా) చేసుకున్నాము.

1986-87, 1987-88 సంవత్సరాలలో భారతదేశం సగటున 16 లక్షల టన్నుల పంచదార దిగుమతి చేసుకొన్నది కనుక, ఇప్పుడు మనకు అవసరం ఉన్నా లేకపోయినా అంతకు తక్కువ కాకుండా దిగుమతి చేసుకోవాలన్న ఆంక్షను అమలు చేయవలసి వస్తుంది. ఈ పంచదారకు తోడు మనం దిగుమతి చేసుకొనే వంటనూనె కూడా కలుపుకుంటే దాదాపు 2,000 కోట్ల రూపాయల సరుకు ఇప్పుడు దిగుమతి చేసుకోవాల్సి ఉంటుంది. డంకెల్ ప్రతిపాదనలు ప్రకారం మనము ఉత్పత్తి చేసే ఆహారధాన్యాలలో 2% నుండి 35 శాతం వరకు రాబోయే ఐదేళ్ళనాటికి మనకు అవసరం ఉన్నా లేకపోయినా ఆహారధాన్యాలు దిగుమతి చేసుకోవాలి.

మనదేశంలాంటి ఎక్కువ జనాభా గల్గిన దేశం సహజంగానే ఎక్కువ ఆహారధాన్యాలను వాడుతుంది. అంటే పై సూత్రాన్ని అనుసరించి సంవత్సరానికి 70 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకోవాల్సి వస్తుంది. ఈ లిబరలైజేషన్ మూలంగా ప్రపంచ ఆహారధాన్యాల వ్యాపారంలో గుత్త సంస్థలుగా ఉన్నకొన్ని బహుళజాతి కంపెనీలు ఆహారధాన్యాలను కారుచౌకగా మన మార్కెట్లోకి దింపి, మన రైతులను దివాళా తీయిస్తారు. గత్యంతరం లేక రైతులు వ్యాపారపంటల వైపు మళ్లుతారు.

ఎగుమతుల మీద ఆంక్షలు ఎత్తివేస్తే, రైతులు తమ ఉత్పత్తులను ఎగుమతిచేసి లాభపడవచ్చు గదా అన్నది ఒక వాదన. ఎగుమతుల కోసమే ఉద్దేశించిన పొగాకు ఉత్పత్తిదారులకు అగచాట్లు పరిశీలిస్తే, ఎగుమతులు ఏ మేరకు రైతాంగానికి లాభం కలిగిస్తాయో అర్థమవుతుంది. ఈ ఎగుమతులను సైతం శాసించేది గుత్త సంస్థలే. ఉదాహరణకు నేడు అంతర్జాతీయ మార్కెట్టులో బియ్యానికి, పత్తికి మంచి ధరలున్నాయి. అలా అని వీటిని ఎగుమతిచేస్తే తాత్కాలికంగా విదేశాలలో ధర రావచ్చు కాని, దేశంలో ఆహారధాన్యాలకు తీవ్ర కొరత ఏర్పడుతుంది. ఆకలి మంటలు ప్రారంభమవుతాయి. దేశీయంగా జౌళి పరిశ్రమ తీవ్ర ఒడిదుడుకులకు గురి అవుతుంది. అలాగే దిగుమతులపై ఆంక్షలు సరళతరం చేసినందువల్ల మనదేశ ఉత్పత్తులపై తీవ్ర ప్రభావం కలుగుతుంది. ఉదాహరణకు పట్టు, నూలుకు ఈ సంవత్సరం

> **ఎగుమతుల మీద ఆంక్షలు ఎత్తివేస్తే, రైతులు తమ ఉత్పత్తు లను ఎగుమతిచేసి లాభపడవచ్చు గదా అన్నది ఒక వాదన. ఈ వాదన సరైనది కాదు.**

చైనా నుండి దిగుమతి చేసుకొనడానికి అవకాశం కల్పించినందున, కిలో ధర 400/- నుండి 70/- మన మార్కెట్‌లో ధర పడిపోయింది. అలాగే ఆంక్షల సడలింపుల వల్ల కార్గిల్ (సన్‌ఫ్లవర్, జొన్నలు విత్తనాలు), ఐ.టి.సి. (ఆయిల్ సీడ్స్, టొబాకో), పెప్సీ (పండ్లు, కూరగాయలు), యూనియన్ కార్బైడ్ (క్రిమి సంహారక మందులు), లిప్టన్ (పండ్లు) లాంటి సంస్థలు ఇప్పటికే మన దేశ వ్యవసాయ రంగంలో ప్రవేశించాయి.

కార్గిల్ గుత్త సంస్థచే తయారు చేయబడ్డ ప్రొద్దుతిరుగుడు విత్తనాలు అధిక దిగుబడిని ఇస్తాయని విస్తృతంగా ప్రచారం చేసారు. రైతాంగం పెద్ద ఎత్తున పెట్టుబడులు పెట్టి కర్ణాటకలో సాగుచేస్తే అధిక దిగుబడులు రాకపోగా పెట్టుబడులు పెద్ద ఎత్తున నష్టపోయారు. దేశవాళీ విత్తనాలే మేలని భావించి, తమ నష్టానికి కంపెనీ బాధ్యత వహించాలని వందలాది మంది రైతులు ఆగ్రహించి కార్గిల్ ఆఫీస్ ముట్టుముట్టి తగలపెట్టారు.

## వ్యవసాయరంగం – ప్రభుత్వ పాత్ర

వ్యవసాయరంగానికి వున్న ప్రాధాన్యత రీత్యా, ఈ రంగానికి అవసరమైన ఉపకరణాలను రైతాంగానికి అందించడానికి అలాగే

వ్యవసాయ ఉత్పత్తులను మార్కెటింగ్ చేయడానికి ఇప్పటి వరకు ప్రభుత్వం నిర్వహిస్తూ వస్తున్న పాత్రను కుదించాలన్నది గుత్తసంస్థల మరో ఆంక్ష.

రైతాంగ ఉత్పత్తులకు మంచి లాభాలు రావాలంటే ఎగుమతులు అవసరం అంటున్నారు. కనుక ప్రభుత్వ ఆధ్వర్యాన ఉన్న మార్కెటింగ్ ఫెడరేషన్, టుబాకోబోర్డు, కాటన్ కార్పొరేషన్, జూట్ కార్పొరేషన్ వంటి సంస్థల కార్యకలాపాలు కుదించబడుతున్నాయి. మేలుజాతి వంగడాలు అందించే సీడ్ కార్పొరేషన్, పశుసంవర్ధక శాఖ, వంటి వాటిపాత్ర పరిమితం చేయబడుతోంది. వ్యవసాయ ఉత్పత్తుల ధరల నిర్ణాయక సంస్థ అవసరం లేకుండా పోతుంది.

మార్కెట్‌లో రైతాంగ ఉత్పత్తులకు ధరపడిపోయినప్పుడు నిలబెట్టేందుకు మద్దతు ధర ప్రకటించడం జరుగుతోంది. ఇప్పుడు నూతన ఆర్థిక విధానాల పర్యవసానంగా మార్కెట్‌లో నిలబడటానికి మద్దతుధర స్థానే ఎగుమతికై ఉద్దేశించిన ఉత్పత్తి విధానం మూలంగా వ్యవసాయంలో ఆహారధాన్యాలు, తృణధాన్యాలు గాక మామిడిపళ్ల రసం, బంగాళాదుంప చిప్స్, రొయ్యల పెంపకం, ఫైన్‌రైస్ ఉత్పత్తి, బిరియాని రైస్ ఉత్పత్తి మొదలగు వ్యాపార పంటలవైపు దృష్టి మళ్లించబడుతుంది.

స్వేచ్ఛా మార్కెట్ పేరుతో మార్కెట్ ఒడిదుడుకులలో ప్రభుత్వం బాధ్యతల నుండి వైదొలగడం మొత్తం ఆహార ధాన్యాల ఉత్పత్తి విధానంలోనే తీవ్రమైన మార్పులకు కారణమవుతుంది.

విత్తనాభివృద్ధికి అవసరమైన శాస్త్రసాంకేతిక అభివృద్ధి నుండి ప్రభుత్వం తప్పుకొంది. కార్గిల్ వంటి వాటికి తలుపులు తెరువబడ్డాయి.

## సోమాలియా ఉదాహరణ

మీరు పొటాటా చిప్స్, మామిడి పండల్ల రసం పంపండి మేము మీకు అవసరమైన గోధుమలు, నూనెలు పంపుతాము అన్న స్థితికి వస్తుంది పరిస్థితి. సరిగ్గా సోమాలియాలో ఇదే జరిగింది. పంటల పద్ధతి మారి ఆహారధాన్యాల నుండి వ్యాపార పంటలకు దృష్టి మళ్లించబడింది. అమెరికన్, బ్రిటిష్ బహుళజాతి కార్పొరేషన్‌లు తొలుత ఆహారధాన్యాలను కారుచౌకగా అమ్మడం ప్రారంభించారు. రైతాంగం దృష్టి వ్యాపార పంటల వైపు మళ్లిన తరువాత, ఆహారధాన్యాల ధరలుపెంచారు. “ఉత్పత్తికయిన ఖర్చును బట్టి ధరలు” అన్న నినాదంతో ధర ప్రకటించారు. “అవసరముంటే కొనుక్కోండి లేకపోతే లేదు” అన్నారు. ఫలితంగా అసంఖ్యాక ప్రజానీకం మానవ కల్పిత కరువువాత పడింది. అసంఖ్యాక ప్రజలు ఆకలి మంటలతో మాడిపోతున్నారు.

## నైజీరియా ఉదాహరణ

నైజీరియా, ఆ పరిసర ప్రాంతాలలోని దేశాలలో అత్యధికంగా గోధుమలు దిగుమతి చేసుకొనే దేశంగా ఉంది. క్రమంగా తన కాళ్లమీద తానునిలబడాలనే పథకంతో రైతాంగానికి అనేక ప్రోత్సాహాలను అందించి కర్రపెండలం, మొక్కజొన్న పంటలను బాగా పండించింది. స్థానిక ఆహార పదార్థాలపై ఆధారపడాలన్న ఉద్దేశ్యంతో క్రమంగా గోధుమల దిగుమతి మీద ఆంక్షలు విధించింది. ప్రధానంగా గోధుమలు దిగుమతి చేస్తున్న కార్గిల్ బహుళజాతి గుత్తసంస్థ, ఈ చర్యతో ఆగ్రహించి నైజీరియాతో జౌళి వ్యాపారాన్ని స్థంభింపచేసింది. అటు కార్గిల్‌గాని, అమెరికా గాని, నైజీరియా తమ అవసరాలకు అనుగుణంగా ఏ ఆహార ధాన్యాలను ఉత్పత్తి చేసుకోవాలన్న స్వేచ్ఛ కూడా నిరాకరించాయి. దీన్ని బట్టి ఎగుమతి దిగుమతులు సరళతరం చేస్తే అభివృద్ధి చెందుతున్న దేశాలు బహుళ జాతి సంస్థలు కౌగిళ్ళలో ఎలా నలిగిపోతామో విధితం అవుతుంది.

> **ఆహారధాన్యాల నుండి వ్యాపార పంటలకు సోమాలియా రైతాంగం దృష్టి మళ్ళించబడింది. ఫలితంగా ఆహార కొరత ఏర్పడింది. ఇవే నేటి సోమాలియా ఆకలి చావులు”**

ప్రభుత్వం-వ్యవసాయరంగం అన్న సమస్య వచ్చినప్పుడు గుత్తసంస్థలకు ఒక సూత్రం, అభివృద్ధి చెందుతున్న దేశాలకు ఒక సూత్రం అయింది నేడు. ఉదాహరణకు 1985లో బ్రిటన్‌లో సాగులో ఉన్న వ్యవసాయ భూమిలో 52.5% వ్యవసాయానికి యోగ్యం కాకుండా పోయిందని, కనుక ప్రభుత్వం యొక్క సహకారం ఎంతైనా అవసరమని ప్రభుత్వం నిర్ణయించింది. అలాగే 1986 నాటికి అమెరికాలో 30 బిలియన్ డాలర్లు వ్యవసాయ ఉత్పత్తులను ఆదుకోవడం కోసం సబ్సిడీలుగా వెచ్చిస్తూవచ్చారు. ఐరోపాలోని పెట్టుబడిదారీ దేశాలు సైతం ఇందుకు ఇరవై రెండు బిలియన్ డాలర్లు చేస్తున్నారు. కనుక మన ప్రభుత్వం

శుభాకాంక్షలతో.....

# ది. ఆకివీడు కో-ఆపరేటివ్ రూరల్ బ్యాంకుల లిమిటెడ్

**నెం. 1784, ఆకివీడు–534 235, పశ్చిమ గోదావరి జిల్లా.**

*స్థాపించిన తేది : 25.6.1956*

*సభ్యుల సంఖ్య : 17214*

| | | |
|---|---|---|
| 1. సభ్యుల షేరు ధనం | : | 72,36,879 |
| 2. డిపాజిట్లు | : | 19,28,850 |
| 3. సెంట్రల్ బ్యాంకు అప్పులు : | | |
| అ) స్వల్పకాలిక | : | 3,49,55,649 |
| ఆ) దీర్ఘ కాలిక | : | 2,11,04,771 |
| ఇ) మధ్య వాయిదా | : | 3,14,423 |
| ఉ) కన్వర్షన్ అప్పులు | : | 71,73,871 |
| ఊ) బిల్డింగ్ అప్పు | : | 50,000 |
| 4. వ్యాపార ధనం | : | 7,33,13,578 |
| 5. సభ్యుల నుండి రావలసిన అప్పులు : | | |
| అ) స్వల్పకాలిక | : | 3,67,72,370 |
| ఆ) దీర్ఘ కాలిక | : | 2,14,16,147 |
| ఇ) మధ్య వాయిదా | : | 7,56,051 |
| ఉ) కన్వర్షన్ అప్పులు | : | 61,15,148 |
| ఊ) ఫీడింగ్ అప్పు (యస్.టి) | : | 18,56,705 |



నిమ్మల రాధాకృష్ణ , కార్యదర్శి



ముత్యాల వెంకటేశ్వరరావు (రత్నం), ప్రెసిడెంట్

వరపతేతర వ్యాపార వివరములు :

ఎరువులు, పురుగుమందులు, నిత్యావసరవస్తువులు,
బట్టలు, బంగారం హామీపై అప్పులు,
లాకర్ల సదుపాయం కలదు.

1991-92 సం॥కు నికర లాభము : 2,19,076.88

డిపాజిట్లపై అత్యధిక వడ్డీరేట్లు :

| | | |
|---|---|---|
| 46 రోజుల నుండి 270 రోజులవరకు | : | 10.50% |
| 271 రోజుల నుండి 1 సం॥ లోపు | : | 10.77% |
| 1 సం॥ నుండి 2 సం॥ లోపు | : | 11% |
| 2 సం॥ నుండి 3 సం॥ లోపు | : | 13% |
| 3 సం॥ పైన | : | 14% |

Ⓒ : 29355

శుభాకాంక్షలతో...

# SAIJI MARBLES

## PINK & PISTA, MINE OWNERS

## DARGAMITTA, NELLORE - 3.

### గృహమే కదా స్వర్గసీమ

మీరు కలలుకనే స్వర్గం లాంటి మీ భవనమునకు మీరు కోరిన డిజైన్లలో చూడముచ్చటైన
ధోల్‌పూర్‌స్టోన్, గ్రానైట్, మరియు సిల్వర్‌స్టోన్‌లతో
మార్బుల్ ఫ్లోరింగ్
మరియు
ఎలివేషన్‌లను అనుభవము కలిగిన
రాజస్థాన్ పనివారలచే ఇంజనీర్ పర్యవేక్షణలో సకాలములో
సరసమైన ధరలకు చేయించగలము.

వ్యవసాయరంగంలో అభివృద్ధిని సాధించడానికి చేస్తూ వచ్చిన కృషినుండి ఉపసంహరించుకోవడం అంటే, పూర్తిగా గుత్త సంస్థల ప్రాబల్యానికి వ్యవసాయరంగాన్ని వదలివేసినట్లవుతుంది. చిన్నకారు. సన్నకారు రైతుల నడ్డి విరిగేందుకే ఇది దారి తీస్తుంది.

## పేటెంట్ హక్కులు

మన దేశంలో ఇప్పటివరకు పేటెంట్ హక్కులు వ్యవసాయం మినహాయించబడింది. ఐ.ఎమ్.ఎఫ్. అమెరికా వత్తిడి మూలంగా పేటెంట్ హక్కుల నుండి వ్యవసాయరంగంలో వర్తించే విధంగా సన్నాహాలు జరుగుతున్నాయి. ఉదాహరణకు అధికంగా పాలు ఇచ్చే సంకరజాతి ఆవును రైతు గుత్త సంస్థల ద్వారా కొంటే, ఆ ఆవు పాడిని అనుభవించవచ్చుగాని, తాను కొనుక్కొన్న ఆవుకు కల్గిన దూడ తన దొడ్డిలో పెరిగినా దానిమీద హక్కు లేదు.

మంచి దిగుబడిని ఇచ్చే టోమాటో విత్తనాన్ని దిగుమతి చేసుకోవచ్చు. కాని తన వద్ద పండిన పంట నుండి విత్తనాలు రూపొందించి, తాను గాని, తన ప్రక్క రైతుకు గాని అమ్ముకునే హక్కు నిరాకరించబడుతుంది. మంచి విత్తనాన్ని శాశ్వతంగా గుత్త సంస్థలనుండి కొనుక్కోవలసిందే తప్ప, తను స్వయంగా ఉత్పత్తి చేసుకొనడానికి వీలు లేదు.

ఒక బహుళజాతి గుత్తసంస్థ కలుపుమొక్కలను రూపుమాపే ఒక రసాయనిక మందులను కనిపెట్టింది. క్రమంగా విత్తనాల అభివృద్ధిలోకి ప్రవేశించి కలుపు మొక్కలను నిర్మూలించే రసాయనిక పదార్థానికి తట్టుకోగలిగిన విత్తనాలను అభివృద్ధి చేసింది. రైతు విత్తనాన్ని వాడదలుచుకుంటే, ఆ కలుపుమందే వాడాలి, ఆ కలుపు మందు వాడదలుచుకుంటే ఆ విత్తనాలు వాడాలి. లాభాల మీద లాభాలు గడించడానికి సులభ మార్గం ఇది.

ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యాన ఉన్న ఆహారము, వ్యవసాయము సంబంధించిన సంస్థ రైతాంగం యొక్క హక్కుల గురించి నిర్వచించింది. ప్రపంచంలో రైతాంగం తరతరాలుగా పంటలను, మొక్కలను అభివృద్ధి చేయడంలో అద్వితీయమైన కృషిని సాగించింది. అందులో కూడా అభివృద్ధిచెందుతున్న దేశాలే. 90% ఆహార, వ్యాపార పంటలకు సంబంధించిన మొక్కలను అభివృద్ధి చేసాయి. ప్రపంచంలో మొట్టమొదటిసారి బొలీవియా లోని రైతులు అన్నిరకాల తెగుళ్ళను తట్టుకోగలిగిన బంగాళ దుంప జాతిని కనిపెట్టారు. పశ్చిమ ఆఫ్రికా ప్రాంతంలోని రైతులు క్రిమికీటకాదులను తట్టుకోగలిగిన చిక్కుడు జాతిని అభివృద్ధి చేసారు. భారతదేశంలోని రైతాంగం మంచి దిగుబడినిచ్చే, తెగుళ్ళను తట్టుకోగలిగిన వరి జాతులను కనిపెట్టింది. వృక్షజాతి అభివృద్ధిలో ఐదువందల తరాల నుండి అంకిత భావంతో రైతాంగం జరిపిన కృషి అభివృద్ధి చెందుతున్న దేశాలలోని వృక్ష సంపదలలో ఇమిడి ఉంది. ఇప్పటికీ అభివృద్ధి అయిన విత్తనాల్ని అధికంగా ఉత్పత్తిచేసి కోరిన రైతాంగానికి అందించడంలో తీవ్ర లోపం జరుగుతున్నది. 30 శాతం మాత్రమే అందించ గలుగుతున్నాం. నేడు అసలు సమస్య ఇది. ఈ లోపాన్ని దిద్దుకొంటూ జన్యుసంపదను అభివృద్ధి చేయడానికి పూనుకోవలసిన ఈ దశలో పేటెంట్ హక్కులను వ్యవసాయానికి వర్తింపచేయడమంటే, సరవస్వాన్ని కోల్పోవడమే.

## ముగింపు

ఒక్కమాటలో చెప్పాలంటే నూతన ఆర్థిక విధానాల వల్ల పేద, మధ్య తరగతి రైతులు పెరిగిన ఉత్పత్తి ఖర్చులు, వడ్డీ భారాలు తట్టుకోలేరు. మార్కెట్ ధరల్లో వచ్చే ఒడిదుడుకులు తట్టుకోలేరు. పోటీ ఉంటేనే సామర్థ్యం పెరుగుతుందన్న నూతన ఆలోచనా విధానం వ్యవసాయానికి కూడా వర్తింపచేయబడుతుంది. ఈ తర్కం ప్రకారం పోటీని తట్టుకోలేని చిన్నకారు, సన్నకారు కమతాలు నాశనం అవుతారు. ప్రతిఘటించి పోరాడడమే మిగిలిన ఏకైక మార్గం. ●

# రైతు సంఘం కార్యకలాపాలు

## కల్తీకి వ్యతిరేకంగా

వరంగల్ జిల్లాలో నకిలీ విత్తనాలు, పురుగు మందుల వ్యాపారం జోరుగా సాగుతున్నది. అసలే కరువుతో అల్లాడుతున్న రైతాంగానికి ఇది పులిమీద పుట్రలా మారింది. వేలాది రూపాయల పెట్టుబడులు పెట్టి పండించాలని ఆశపడితే పురుగు దెబ్బతీస్తున్నది. దీన్ని నిరోధించేందుకు వాడే మందులు నసిరకమైనందున ఫలితం లేకపోగా పెద్ద మొత్తంలో డబ్బు గంగపాలవుతున్నది. మొలకెత్తని పొద్దుతిరుగుడు విత్తనాల వలన 6-7వేల ఎకరాల దెబ్బతినగా ఎకరాకు 1500ల నుండి 2 వేల రూపాయల వరకు రైతులు నష్టపోయారు. జిల్లాలో కొందరు డీలర్లు ధనార్జనే ధ్యేయంగా నాసిరకం మందులు అమ్ముతున్నారు. గత సంవత్సరం కొన్ని దాడులు జరిగి కేసులుపెట్టినా ఈ సం॥ కథ పునరావృత్త మయిందంటే అధికారుల అలసత్వం దీన్నిబట్టి అర్థమౌతుంది. దీనికి వ్యతిరేకంగా జిల్లాలో రైతు సంఘం ఆధ్వర్యాన చేర్యాల, జనగాం, మహబూబాబాద్ మండల కార్యాలయాల వద్ద 600 మందితో ధర్నా జరిగింది. ఈ ఆందోళన తర్వాత 4 షాపుల లైసెన్సులు రద్దుచేశారు. నల్లబెల్లి మండలంలో నకిలీ మందులకు వ్యతిరేకంగా 100 మంది ధర్నాచేయగా 2 లైసెన్సులు రద్దు చేసారు.

## నల్లగొండ జిల్లా కలెక్టరేట్ దిగ్బంధనం

జిల్లాలో కరువు సహాయ కార్యక్రమాలు తక్షణం చేపట్టాలని, శ్రీశైలం ఎడమగట్టు కాలువ నిర్మాణపనులు చేపట్టాలని డిమాండుచేస్తూ అఖిలపక్ష రైతుసంఘాల ఆధ్వర్యాన అక్టోబర్ 5వ తేదీన నల్లగొండ కలెక్టరేట్‌ను రైతాంగం చుట్టుముట్టింది. 20 వేల మంది పాల్గొన్న ఈ ముట్టడి కార్యక్రమం అనంతరం జరిగిన సభలో అఖిల భారత కిసాన్‌సభ ఉపాధ్యక్షులు శ్రీ భీమిరెడ్డి నరసింహారెడ్డి (యంపి), నర్రా రాఘవ రెడ్డి, ఇంకా తెలుగు దేశం, సి.పి.ఐ నాయకులు కూడా పాల్గొని ప్రసంగించారు. ఈ పోరాటాన్ని శ్రీశైలం నీటిని సాధించే వరకు సాగించాలని వక్తలు విజ్ఞప్తి చేశారు.

ఒకవైపు జనం పెద్దెత్తున ఆందోళన చేస్తుంటే మరోవైపు కేంద్ర జలవనరుల సంఘం శ్రీశైలం ఎడమగట్టు కాలువ నిర్మాణానికి అనుమతి నిరాకరిస్తూ వర్తమానం పంపింది. రాష్ట్ర రైతు సంఘం దీన్ని తీవ్రంగా విమర్శించింది.

## తుంగభద్ర వరదలు

తుంగభద్రా నదికి నిరుడు, ఈ యేడు హఠాత్తుగా నీళ్ళొచ్చి వరదలై గ్రాములను ముంచెత్తుతున్నది. గత నెలలో వచ్చిన వరదలకు కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లాల్లో అనేక గ్రామాలు మునిగిపోయాయి. వేలాది ఎకరాల పంట నాశనమైంది. కర్నూలు జిల్లా రైతు సంఘం ఆపదలోవున్న ప్రజానీకాన్ని ఆదుకోవాలని జిల్లా అధికారులకు విజ్ఞప్తి చేసింది. జిల్లా రైతు సంఘం కార్యదర్శి శ్రీ టి. నరసింహయ్య గారి నాయకత్వాన ఒక బృందం 12 గ్రామాల్లో పర్యటించి ప్రజల ఇబ్బందులను స్వయంగా తెలుసుకున్నారు. నిత్యం వరదలకు గురౌతున్న ఈ గ్రామాల రక్షణకు అడ్డుగోడ నిర్మించాలని వారు డిమాండు చేశారు.



సోమవారంనాడు రైతు సంఘం ఒంగోలు డివిజన్ కమిటీ ఆధ్వర్యంలో గుంటూరుజిల్లా లింగంగుంట్ల ఎస్.ఇ. కార్యాలయాన్ని రైతులు ముట్టడించిన దృశ్యం

## నాగార్జున సాగర్ జలాలకై ఆందోళన

అద్దంకి, ఒంగోలు బ్రాంచి కాలువలకు ఇంత వరకు నీరు సరిగ్గా రాక

వేలాది ఎకరాల్లో పంట ఎండిపోయే స్థితి వచ్చింది. అధికారులు, సిబ్బంది నీటి సక్రమ పంపిణీకి చర్యలు తీసుకోకుండా బాధ్యతా రహితంగా వ్యవహరిస్తున్నారు. నవంబర్ 4వ తేది అద్దంకి ఇ.ఇ. కార్యాలయం వద్ద 400 మంది ధర్నా చేశారు. ఇదేవిధంగా ప్రతిరోజు రైతులు వందల సంఖ్యలో ఇరిగేషన్ ఆఫీసుల చుట్టూ తిరుగుతున్నారు. అయినా ఫలితం లేకపోవడంతో 22వ తేదీన లింగం గుంట్ల ఎస్.ఇ. కార్యాలయం వద్దకు వేయి మంది రైతులు చేరుకున్నారు. తమగోడు విన్పించుకోడానికి రైతులు వస్తున్నారని రైతు సంఘనాయకులు ముందుగా తెలియచేసినా ఎస్.ఇ. తన కార్యాలయంలో లేకుండా ముఖం చాటేశాడు. గత్యంతరంలేని రైతాంగం రోడ్లపై 2 గంటలపాటు బైఠాయించి రాస్తారోకో జరిపి తమనిరసన తెలిపారు. దీనికి శ్రీ వమిడి కోటయ్య, శ్రీ ఎన్. రంగారావు, శ్రీ పి. అంజనేయులు, శ్రీ కె. వెంకయ్య, శ్రీ ఎ. శంకరరావు తదితరులు నాయకత్వం వహించారు. ఇదే సమస్యపై డిశంబర్ 3, 4, 5 తేదీలలో సత్తెనపల్లి, అద్దంకి, చిలకలూరిపేట లలో సదస్సులు జరుగనున్నాయి. వీటికి రాష్ట్ర రైతుసంఘం అధ్యక్షులు శ్రీ బోడపూడి వెంకటేశ్వరరావు హాజరౌతున్నారు.

# ఋణభారంతో క్రుంగుతున్న గ్రామీణ జీవనం

బి. తులసీదాస్

రైతు సంఘం శ్రీకాకుళం, జిల్లా కార్యదర్శి.

గ్రామీణ ప్రాంతంలోని సామాజిక, ఆర్థిక స్థితిగతుల్ని పరిశీలించడానికి ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం రాష్ట్రంలోని ఆరుగ్రామాల్లో సర్వే నిర్వహించింది. ఉత్తర కోస్తా ఆంధ్ర ప్రాంతానికి ప్రాతినిథ్యం వహించేదిగా విజయనగరం జిల్లా సీతానగరం మండలంలోని 'అంటిపేట' గ్రామంలోని 253 కుటుంబలను డా॥ నళిని నాయకత్వానగల బృందం అక్టోబర్ 17 నుండి 22 వరకు సర్వే జరిపింది. ఆ సర్వేలో వెల్లడైన ప్రాథమిక అంశాల పరిశీలనే ఈ వ్యాసం.

బొబ్బిలి-పార్వతీపురం రోడ్డులో బొబ్బిలికి 6కి ॥ మీ ॥ దూరంలో గల అంటిపేట గ్రామం జనాభా 1991 జనాభాలెక్కల ప్రకారం 1184. బొబ్బిలి రాజులు తమ సోదరికి పసుపు కుంకుమల క్రింద ఇచ్చినదీ గ్రామం. ఎస్టేట్ ఎబాలిషన్ చట్టం వచ్చాక రైతులకు జిరాయితీ భూమిగా మారింది.నిండుతుందని గ్యారంటీ లేని చెరువుల క్రిందగల పల్లం (మాగాణి) 346 ఎకరాలు, వర్షాధారపు మెట్ట 256 ఎకరాలు గల ఈ గ్రామంలో 105 కుటుంబాలకు సెంటు భూమి లేదు. మరో 95 కుటుంబాలకు ఎకరంలోపు మాత్రమే భూమి ఉంది. అలాగే 201 కుటుంబాలకు వెయ్యి నుండి 65 వేల వరకు అప్పులున్నాయి. వారిలో 29 మంది భూముల్ని తనఖా పెట్టుకున్నారు. గ్రామంలో 25 మంది పాలేర్లుగా పని చేస్తున్నారు. రోజుకూలీ స్త్రీలకు రు. 6 నుండి రు. 10 కాగా .పురుషులకు రు. 15 నుండి 25 రూ. వరకు ఆయాపనుల వత్తిడిని బట్టి లభిస్తుంది. కాగా కేవలం భిక్షాటనమీదనే ఆధారపడే కుటుంబాలు నాలుగున్నాయి. ప్రధాన పంట వరికాగా చెరకు, గోగు (మెస్తా), వేరుశనగ వరుసగా తర్వాతి స్థానంలో ఉంటాయి.

## భూయాజమాన్యం – కమతాల్లో మార్పులు

గ్రామంలోని 253 కుటుంబాలలో 105 కుటుంబాలకు భూమి లేదు. 95 కుటుంబాలకు ఎకరంలోపు మాత్రమే ఉంది. కేవలం ఒకే కుటుంబానికి పది ఎకరాల పైబడి భూమి ఉంది. 5 నుండి 10 ఎకరాల భూమి గల కుటుంబాలు 12 ఉన్నాయి. భూకమతాల్లో జరిగిన మార్పులలో 24 కుటుంబాల వారు కుమార్తెల వివాహం కోసం, 19కుటుంబాల వారు తమ కుటుంబ అవసరాల కోసం భూమిని అమ్ముకున్నారు. ఉద్యోగం ద్వారా వచ్చిన ఆదాయంతో 9 మంది, స్త్రీధనం (కట్నం) తో5 గురుభూముల్ని కొనగా 19 మంది వ్యవసాయ (పంట ) మిగులు ద్వారా కొన్నారు. పంట మిగులు కొనుగోళ్లు 1990 కి ముందు మాత్రమే జరిగాయి.

శ్రీ టోలాపు కూర్మినాయుడు అనే గృహస్తు తనకు పిత్రార్జితంగా వచ్చిన 1.80 సెంట్లలో 1.30సెం॥ భూమిని అమ్ముకొని 0.50 సెంట్లు 1989 లో తనఖాకు ఇచ్చారు. ప్రస్తుతం తన పెద్ద కుమారుడ్ని పాలేరుగా పెట్టి, తాను, మిగతాకుటుంబ సభ్యులూ కూలికి వెళ్తున్నారు. శ్రీ కింజంగి సింహాచలం అనే క్షౌరకారుడు 1986-88 మధ్య వృత్తిలో మిగులు ద్వారా 0.40 సెంట్లు భూమిని కొన్నారు. కుమార్తె వివాహం కోసం ఆ భూమిని అమ్మి, ఇల్లు గూడా తనఖా పెట్టుకోవలసి వచ్చింది. ఈ రెండేగాదు, ఎన్నో బాధామయ గాధలీ గ్రామంలో ఉన్నాయి.

## కౌలు :

పంటకు గ్యారంటీ ఉండదు కనక స్థిరమైన కౌలును చెల్లించే విధానం గ్రామంలో లేదు. పంటకు అవసరమయ్యే ఎరువులు, పురుగు మందుల ఖర్చును సమంగా భరించుకొని శ్రమను పాలు దారుని కుటుంబం చేసి పంటలో సమాన భాగాన్ని భూ యజమానికి కల్లం గట్టును కొలుస్తాడు. జీవనాధారం కోసం గ్రామంలో 22 కుటుంబాలవారు భూమిని ( కౌలు ) పాలుకు తీసుకొని సాగు చేస్తున్నారు.

## ఋణభారం – తనఖాలు :

గ్రామంలోని 201 కుటుంబాలకు వెయ్యి నుండి 65

With best compliments from : Ph: 261605

# ENG'KRIEM ENTERPRISES

## Engineers, Consultants & Contractors

*(Mechanical & Electrical)*

5-61, MOOSAPET, HYDERABAD-500 018.

- Equipment Erection like pumps, Motors, D.G. Sets etc.
- Piping & Installation.
- Fabrication & Erection of Tubular poles, Control Panels and other Structurals.
- Industrial Electrification including tower lights.
- Fabrication & Erection of Chemical Equipment.
- Erection of 40Mtrs. & 60 Mtrs. Ht. Self-supporting steel towers.
- All types of Machining works viz. Shafts, Gears etc.

***Branch Operations :***

**ENG'KRIEM ENTERPRISES**

14-250/A, Near Panthulugari Meda
Old Gajuwaka, Visakhapatnam - 26.

**Ph : 56086**

---

అభినందనములతో

కొండూరు శేషారెడ్డి, *B.Sc, B.L.,* అడ్వకేట్ - నెల్లూరు.

---

*With best compliments :* Phone : 21484 / 23860

# THE HEMALATHA

# Textiles Limited

PEDAKAKANI (PO) - 522 509
GUNTUR (DIST), A.P.

*Manufacturers of :*

QUALITY YARN IN HANKS AND CONES OF
40s AND 10s YARN AND 10s CHEESE YARN

**Grams : 'HEMAS', PIN : GUNTUR**

వేల వరకు అప్పులున్నాయి. అత్యధికంగా 65 వేల రుణభారం గల శ్రావయిల అప్పల నాయుడు 7 ఎ॥ పల్లం, 3ఎ॥ మెట్ట భూమి ఉంది. షుగర్ ఫ్యాక్టరీ యాజమాన్యం తమ చేతుల్లో నుండగా బొబ్బిలిరాజా గారు ఈ అసామి పేరిట బినామీ రుణం తీసుకున్నారు. 1989 రుణాల మాఫీ అనంతరం ఈయనకు 25 వేల బకాయి మిగిలింది. బ్యాంకు నోటీసులు అందుతున్నాయి. గ్రామంలో వడ్డీ రేటు బంధువులయితే నెలకు 2 రూ॥ ఇతరులు అయితే 3నుండి 5 రూ॥ వరకు ఉంది. ఉద్యోగం ద్వారా ఆదాయం వచ్చేవారిలో కొన్ని కుటుంబాల వారు డబ్బునిస్తున్నారు.సహకార సొసైటీ ద్వారా స్వల్ప కాలిక రుణాలు 2,25,600 దీర్ఘకాలిక రుణాలు 30,900వ్యవసాయేతర (రిక్షా) రుణాలు 30,000 లభించాయి.

22 కుటుంబాల వారు అప్పుకోసం తమ భూమిని తనఖా పెట్టు కున్నారు. ఎకరానికి 8 నుండి 12 వేల వరకు తనఖాపై రుణం లభిస్తుంది. తనఖాకు ఇచ్చాక అప్పు తీర్చేంత వరకు రుణదాత భూమిని సాగు చేస్తాడు.వడ్డీ పంట రూపంలో దక్కుతుంది. తనఖా పెట్టి 7-8 సం॥ వరకు విడిపించుకో లేని కుటుంబాలు చాలా ఉన్నాయి. క్రమంగా ఆ భూములు రుణదాతలకే విక్రయించబడ్డాయి.

## కూలీలు – పాలేర్లు

గ్రామంలో భూమిలేని 84 వ్యవసాయ కార్మిక కుటుంబాలున్నాయి. తమకున్న కొద్ది భూమిలో పనిచేసి, ఇతరుల పనికి వెళ్లే వారు 79కుటుంబాలవారు 17 కుటుంబాల వద్ద 25 మంది పాలేర్లు గా పని చేస్తున్నారు. వీరిలో హరిజనులు 10 మంది కాగా బిసిర (సెట్టి, బలిజ వంటి) కులానికి చెందిన వారు 13 మంది. పాలేరుకు ప్రతిఫలంగా 10 నుండి 20 బస్తాల వరకు ధాన్యం, 300 నుండి 1000 రూ॥ వరకు డబ్బు ఇస్తారు. రెండు పూటలా భోజనం, ఏడాదికి రెండు జతల బట్టలు ఇస్తారు. పాలేర్లలో చిన్న పిల్లలు పశువుల కాపర్లుగా ఉంటారు (ప్రతి ఫలం తక్కువగా ఉంటుంది).

కూలి రేట్లు పని వత్తిడిని బట్టిమారుతాయి. స్త్రీ పురుష వేతనాల్లో వ్యత్యాసం చాల హెచ్చు. స్త్రీలకు రూ॥ 6 నుండి రూ॥ 10 , పురుషులకు రూ॥ 15 నుండి రూ॥ 25 వరకు ఆయా పనులను బట్టి ఉంటాయి. అన్ని పనులకు కూలీ డబ్బు రూపంలోనే ఇస్తారు. జట్టుగా పనికిపోయే విధానం పెరుగుతున్నది. గోగుతీత వంటి పనులకు కొంత బలహీనంగా ఉంటే తనను జట్టు లోనికి అనుమతించడంలేదని 40 ఏండ్ల ఒక గృహస్థు ఆవేదన వ్యక్తపర్చినట్లు ఆ కుటుంబాన్ని సర్వే చేసిన విజయనగరం జిల్లా రైతు సంఘ కార్యదర్శి శ్రీ మ॥రావు సూర్యనారాయణ తన అనుభవాల్లో తెలిపారు. పని దొరక నందున ఆదాయం లేక రెండు పూటలకూ సరిపడ తినలేక రాత్రి భోజనం పిల్లలకు, యజమానికి ( మిగిల్తే) పెట్టి తాను పస్తుంటానని ఒక గృహిణి చెప్పిందని, చాల మంది పిల్లలు పోషకాహారక లోపంతో వ్యాధులకు గురవుతున్నారని ఆవేదనా భరితంగా తన అనుభవాల్లో పేర్కొన్నారు మరో సర్వేయరు శ్రీమతి పద్మ.

గ్రామంలో 70 హరిజన కుటుంబాలున్నాయి. వీరిలో అత్యధికులు కూలీ చేసుకొని, రిక్షా తొక్కుకొని బ్రతికేవారే. ప్రత్యేక ప్రకటనలు, బ్యాక్ లాగ్ పోస్టుల భర్తీ వంటి బాకాలను పాలకులు ఊదుతున్నారు. కాని1990 లో బి.ఎ. చదివిన ఇల్లి సింహాచలం నిరుద్యోగిగా ఉన్నాడు. అతని తమ్ముడు సూర్యనారాయణ, మరో హరిజన కుటుంబంలోని సీతారాం అనే యువకులు ఐ.టి.ఐ పాసై నిరుద్యోగులుగాఉన్నారు.

## ఇతర వృత్తులు – ఉద్యోగాలు

కేవలం వ్యవసాయం మాత్రమేగాక కుటుంబంలో ఎవరో ఒకరికి ఉద్యోగం ఉంటేనే వారి స్థితి కొంత మెరుగుగా ఉంటున్నది. టీచర్లు, ఉద్యోగాలు చేసేవారేకాక సీతానగరం సుగర్ ఫ్యాక్టరీ సీజనల్ వర్కర్స్ మరియు రోజు కూలీలగాను, బొబ్బిలిలో రిక్షా కార్మికులగాను, రైల్వే డబుల్ లైన్ నిర్మాణ కార్మికులగాను పని చేస్తున్న వారి ద్వారా గ్రామానికి ఆదాయం వస్తున్నది. పాడి గేదెలు కూడా గణ నీయంగా ఉన్నాయి. ఈ పైన పేర్కొన్న ఆదాయాలు లేకుంటే గ్రామంలో ప్రజల జీవనంఎంతో దుర్భరమై యుండెడిదేమో.

కాగా జంగం కులానికి చెందిన వారి జీవనోపాధి టైలరింగ్।పరిసర గ్రామాలవారికి బొంతలు కుట్టడం, దసరా నుండి పెళ్లిళ్లసీజన్ మధ్యలో నెల నుండి 3 నెలల వరకు ఇతర ప్రాంతాలకు వలసపోయి, టైలరింగ్ ద్వారా భృతిని సంపాదిస్తుంటారు.

సంక్షేమ పథకాలు ప్రయోజనం గ్రామానికి నామ మాత్రం రూ. 4500 ల గేదె అప్పును ఐ.ఆర్. డి.పి. పథకం ద్వారా పొందడానికి 500 రూ॥ నెలకు 50 రూ॥ చొ॥న గర్భిణీ పెన్షన్ పొందడానికి ఒక నెల పెన్షన్ ఖర్చుల రూపంలో సమర్పించు కొన్నామని కొందరు లబ్దిదార్లు తెలిపారు.




# పట్టాదారు పాసుపుస్తకాలు

రాష్ట్రంలో 1960వ సంవత్సరంలో ఆనాటి వంశపారంపర్యపు గ్రామోద్యోగుల నియామకాలను దేశంలోని అత్యున్నత న్యాయస్థానం "వంశపారంపర్యపు విధానం" రాజ్యాంగ విరుద్ధమని తీర్పిచ్చిన అనంతరం వీరికి నూతన నిబంధనలు రూపొందించుటకు, పని భారం తగ్గించుటకు, నియమించిన కె.ఎన్.అనంతరామన్ ఐ.సి.ఎస్. గారి కమిటీ ఆధ్వర్యంలో విచారించి సమర్పించిన నివేదికలో సూచించిన సిఫారసుల్లో ముఖ్యమైనది, పట్టాదారులకు సమగ్ర పాసుపుస్తకాల పంపిణీ ఒకటి. అది ముఖ్యంగా, జాయింటు పట్టాల విధానాన్ని తొలగించి విడి విడిగా పట్టాలిచ్చుటకు ఉద్దేశింపబడింది. యీ నివేదికలోని అంశాలను కూడ, అప్పటి వరకు వేర్వేరుగా వున్న, ఆంధ్ర తెలంగాణాల ప్రాంతం వారికి ఒకటిగా అన్వయించునట్లు 1963 సంవత్సరం నిబంధనలు జారీ చేయబడినవి. అపుడు కొన్ని ప్రాంతాల్లో పట్టాదారు పాసుపుస్తకాలు యిచ్చుటకు గాను ప్రారంభింపబడింది. ఏ కారణంవల్లనో, ప్రభుత్వం 1967 లో కొంత అదనపు సమాచారాన్ని వీటిలో నమోదు చేయించదలచి వాటి పేరును "భూమిశిస్తుల" పాసుపుస్తకాలుగా మార్పు చేసింది. 1960 నుండి 1965 సంవత్సరాల కాలంలో దాదాపు 35 లక్షల పాసుపుస్తకాలను రాష్ట్రవ్యాప్తంగా పంపిణీ చేసినట్లు చెప్తున్నది. వీటి విలువ 35 లక్షలు రైతుల నుండి వసూలు చేసింది. ప్రభుత్వం 1965 సంవత్సరంలో జాయింటు పట్టాలుగా వుండరాదని నిర్ణయించిన ఫలితంగా రాష్ట్ర వ్యాప్తంగా అన్వయించునట్లు 1971వ సంవత్సరంలో రికార్డు ఆఫ్ రైట్సు (భూమి యాజమాన్యపు హక్కుల) చట్టాన్ని ఆమోదించింది. అయితే రాష్ట్రంలో భూమి సంస్కరణల సీలింగు చట్టాన్ని 1972-73 లో ప్రవేశపెట్టినందున, యీ పాసుపుస్తకాల్ల పంపిణీ అమలు 1978 వరకు జరుగలేదు. అయితే యీ చట్టాన్ని 1980 లో సవరించి సుమారు 89 లక్షల మందికి పాసుపుస్తకాలు సరఫరా చేసినట్లు ప్రభుత్వం చెప్పుతున్నది. యింతేకాదు రైతాంగ సహాయ నిరాకరణ ఫలితంగా అందరికీ బట్వాడా కానట్లు చెబుతోంది. అందువల్ల సమగ్రమైన వివరాలతో రైతులకు నూతనంగా దాదాపు కోటికిపైబడ్డ పట్టాదారులకు, కౌలుదారులకు, తాకట్టుదారులకు విడి విడిగా, భూమి యాజమాన్యపు హక్కును మరియు పట్టాదారు పాసుపుస్తకాలను పుస్తకం ఒకటికి పదునైదు రూపాయల విలువతో జారీ చేయనున్నట్లు ప్రభుత్వం ప్రకటించి 1-11-93 తేదీని లాంఛనంగా ముఖ్యమంత్రి గారి స్వహస్తాలతో భాగ్యనగర బహిరంగ సభలో కొంతమందికి మాత్రం పంపిణీకి శ్రీకారం చుట్టింది. యాజమాన్యపు హక్కు పత్రాలు కలిగిన పుస్తకాలు లేక రానున్న సంవత్సరంలోపుగా జారీ చేయనున్నట్లు తెలుపుతూ పై కాలంలో రాష్ట్రం మొత్తంపైన జారీ చేయనున్నట్లు సెలవిచ్చారు. గత అనుభవాల దృష్ట్యా 1960-65 మరియు 1980 లలో జరిగిన పంపిణీలలాగే, లక్షా యిరవైనాలుగు వేల మందికి పంపిణీ చేసిన పుస్తకాలు ఆచరణలో "చెత్త కుండీ" ని ఆశ్రయించినట్లే, యీ ప్రారంభోత్సవం కూడా కేవలం పత్రికా ప్రకటనలకు పరిమితం కారాదని విశ్వసిస్తున్నాం. పత్రికా ప్రకటనలు మంత్రివర్యుల ప్రసంగాలు, రాష్ట్రవ్యాప్తంగా 1-11-93 దిన ప్రతి జిల్లాలోను కనీసం వెయ్యికి తగ్గకుండా అన్ని జిల్లాల్లో పంపిణీ చేయదలచిన కార్యక్రమం ఆనాటికి ఒక్క భాగ్యనగరంలోనే నీరుగారిపోయింది. యీ కార్యక్రమాల్లో కోటి మందికి పైగా పంపిణీ చేయుటకు యీ విధంగా చూస్తే దాదాపు మరో దశాబ్దమైనా పట్టవచ్చును.

ఇప్పటికీ ఇంకా కొంతమంది రైతులు తమ పొలాల తాలూకు డిక్లరేషన్లు యివ్వనట్లుగా తెలుస్తున్నది.

1989 లో అప్పటి తెలుగుదేశం పార్టీ ప్రభుత్వం యీ కార్యక్రమం ప్రారంభించి ముమ్మరంగా చేబట్టి రాష్ట్రవ్యాప్తంగా రైతుల నుండి డిక్లరేషన్లు సేకరించింది. ఈ లోపల ఎన్నికలు జరిగి ప్రభుత్వం మారిపోయింది. ఆనాడు జరిగిన ముద్రణా వ్యయం సిబ్బంది ఖర్చులు, వగైరాలు బూడిదలో పోసిన పన్నీరు అయింది. యీ పరిస్థితులతో చూస్తే 1994 లో రానున్న సార్వత్రిక ఎన్నికల దృష్ట్యా యీ కార్యక్రమం అమలు జరుగుతుందా అన్నది సమాధానం లభించదు. యింతేకాదు, 1989 నుండి, యీనాటి వరకు గ్రామీణ ప్రాంతాల్లోని బడుగువారు తప్ప ధనికులు, భూస్వాములు యీ డిక్లరేషన్ల సమర్పణ జోలికి వెళ్ళినట్లుగా లేదని తెలుస్తుంది. కారణం తమకు యివి లేకున్నా వీటి ప్రయోజనాలు చేకూరగలవని వారి నమ్మకం. ఎందువల్లంటే యీ వర్గం గతంలో 1973 సంవత్సరపు భూసంస్కరణల చట్టం అమలు జేయు సందర్భంగా 1974 లో డిక్లరేషన్లు సమర్పించ వలసి యున్నా సమర్పించకుండా చట్టం పరిధికి రాకుండా తమ ఆస్తిని తాము ఉంచుకోగలిగారు. ఆదే పరిస్థితి యీ ప్రభుత్వంలో యీనాడున్నదని వారి నమ్మకం అందువల్లే వారు సహకరించుటలేదు.

**పట్టాదారు పాసుపుస్తకాల్లో ఏయే అంశాలుండగలవు ?** ప్రస్తుతం ప్రభుత్వం చెబుతున్నట్లుగా యీ పుస్తకాల్లో 1971 నాటి రికార్డు ఆఫ్ రైట్స్ చట్టపు నిబంధనల ననుసరించి రైత్వారీ భూమి యాజమాన్యపు హక్కుల నిర్ధారణ, భూముల మార్కెటు విలువ, యీ భూములకు 13 సంవత్సరాల కాలపు మార్పులు లేని సర్టిఫికేటు (ఎన్‌కంబరెన్సు) భూముల క్రయ, విక్రయాల వివరాలు, కొనుగోలుదార్లు, విక్రయ దారుల వివరాలు రిజిష్టరు చేయబడిన తారీఖు, పత్రం విలువ, రిజిస్ట్రేషన్ శాఖకు చెందిన వుద్యోగి సర్టిఫికేట్, ఆర్థిక సంబంధమైన బ్యాంకుల, ఋణ వివరాలు, చెల్లింపులు, బకాయిలు, వగైరాలు వుంటుందని చెబుతున్నారు. అయితే యీ ఋణాల సంబంధంలో భారత రిజర్వు బ్యాంకు సూచనల మేరకు యీ పాసు పుస్తకాలకు న్యాయసంబంధమైన చట్టబద్ధమైన రూపకల్పనకు 30-10-93న రాష్ట్ర గవర్నరు గారిచే ఆర్డినెన్సు జారీ చేయబడింది.

గతంలో పట్టాదారుల నుండి పాసుపుస్తకాల పంపిణీకి, తయారీకి, రైతుల నుండి వసూలు చేసిన విలువలో సగభాగం గ్రామాధికారికి (తయారుచేసిన వారికి) మిగిలిన సగం స్టేషనరీ ఖర్చుల క్రింద వసూలు చేసి వున్నారు. యీ విధంగా, 1960-65, 1980 లోను మొత్తం 1.24 కోటి యిరవై నాలుగు లక్షల పుస్తకాలకు రైతుల నుండి గోళ్లూడగొట్టిన పైకం కొందరు గ్రామాధికారులు స్వప్రయోజన పరచుకొని ప్రభుత్వ ఖజానాకు చెల్లించని ఘటనలు కూడా లేకపోలేదు. యీనాడు అంతమొత్తం ఒకే సారి యిచ్చుకోవాలి. ప్రస్తుతం పుస్తకం వెల 15/- లు వుండునని చెబుతున్నారు. ప్రస్తుత పరిస్థితుల్లో గ్రామస్థాయి నుండి మండల స్థాయి వరకు ముడుపులు చెల్లించుకొన్నవారికి మాత్రం మార్పులు వగైరాలు జరుగుతున్నట్లు, అలాంటివి లేని వారికి ఎవరి పేర వున్నదో అలాగే వుంచుతున్నట్లు తెలుస్తున్నది. నిబంధనల మేరకు గతించిన పట్టాదారుల వారసుల పేర్ల నమోదుకు కూడా ఎలాటి తగాదాలు లేకున్నను గ్రామ పాలనాధికారులు, రెవెన్యూ అధికారులు లేని తగాదాలకు సృష్టికర్తలై తమ స్వార్థానికి వారిని బాధించుచున్నట్లు తెలుస్తున్నది. యీ పాసుపుస్తకాల తంతు చూస్తుంటే "కొండనాలుకకు మందువేస్తే ఉన్న నాలుక వూడిపోయిన చందంగా వున్నట్లు కనుపడ్తోంది.

**యీ పుస్తకాల ప్రయోజనం :** యీ పుస్తకాల్లో వివరించే అంశాల ఆధారంగా జాతీయ బ్యాంకులు, సహకార బ్యాంకులు అందరు రైతులకు విడివిడిగా పంట ఋణాలు, తాకట్టు ఋణాలు యిస్తుందంటారు. ఒకే మాటు దాదాపు కోటి మంది రైతులకు పంట ఋణాలు దీర్ఘకాలిక ఋణాలు యిచ్చే పరిస్థితి వున్నదా?

జాతీయాదాయంలో మూడవ వంతు వ్యవసాయధారులుండగా వారికి బ్యాంకులిచ్చిన ఋణం ఆరవ వంతు కూడా లేదని అనేక ఆర్థిక నివేదికలు తెలుపుతున్నవి. అదేవిధంగా

జాతీయాదాయంలో సుమారు అయిదో వంతు లభించే పారిశ్రామిక రంగానికి, అనుబంధ సంస్థలకు దాదాపు అరువది శాతం రుణాలు, వేల కోట్లలో యిస్తున్నారు. యీ పరిస్థితిని పరిశీలిస్తే ప్రభుత్వానికి వ్యవసాయ రంగం పట్ల ఉన్న ప్రేమ ఎంతటిదో తెలుస్తుంది. పై వివరాలను పరిశీలించిం తర్వాత రైతాంగానికి పాసుపుస్తకాల సరఫరావల్ల ఒనగూరే ప్రయోజనం ఏపాటిదో బోధపడ్తాంది. యిక ప్రపంచబ్యాంకు నివేదిక నరసింహం కమిటీ రిపోర్టులో సూచించినట్లు, ప్రాథమిక రంగమైన వ్యవసాయానికి, ప్రస్తుతం లభించే (40) నలభై శాతాన్ని (10) శాతానికి తగ్గించమన్న సిఫారసుల్లో పాసు పుస్తకాలు కలిగి వున్న వారందరికి రుణాలు లభిస్తాయా!

పట్టాదారుల పాసుపుస్తకాలు సిబ్బంది వివరాలు చిత్తశుద్ధి లోపం । ప్రభుత్వం ఏ చట్టాన్ని ప్రజావసరాలకు ఏర్పరచినా, వాటి అమలుకు స్థిరచిత్తంతో కూడిన సిబ్బంది ఎంతైనా అవసరం వుంది. 1965 సంవత్సరపు జాయింటు పట్టాల విభజన చట్టం తర్వాత వీటిని విడగొట్టి అమలు జరుపుటకు ఆనాటి తాలూకాల పరిధిలో ఒక్కో డిప్యూటీ తహసీలుదారును తాలూకాకు కేటాయిస్తూ దాదాపు 291 మందిని నియమించింది. యీ విధానం క్రింద వుద్యోగులు 1967 నుండి 1984 వరకు పని చేయుచుండిరి. అయితే వీరినే, 1971 రికార్డు ఆఫ్ రైట్సు క్రింద నియమించడం వల్ల అది మొదలు వీరి ఆధ్వర్యంలో రికార్డు ఆఫ్ రైట్సు (భూమి హక్కుల యాజమాన్యం) చట్టం అమలు జరుప బడుతున్నది. యీ చట్టాన్ని 15-8-1978 రాష్ట్ర ప్రభుత్వపు గెజిటులో ప్రచురించి అమలు చేయనున్నట్లు తెలిపింది. అయితే యీ చట్టానికి నిబంధనలు 1979 లో రూపొందించింది. యిలా కాలం గడచుటను శాసనసభ అంచనాల కమిటీ 1983 లో ప్రభుత్వం 89 లక్షల పుస్తకాల పంపిణీ జరుగలేదని నిర్ధారించింది. అయితే యీ పుస్తకాల విలువను గ్రామ కరణంగార్లు ప్రభుత్వానికి చెల్లించి పుస్తకాలు తీసుకున్నా రైతులకు పంపిణీ కాలేదని తెలిసింది. కారణం 1984 నుండే వారి పదవులు రద్దు చేయబడ్డాయి. అవి వారివద్దే వుండినవి. వారి స్థానంలో నియమితులైన గ్రామ సహాయకులు వాటిని చేబట్టలేదు. వీటికి సంబంధించి రైతులకు చేరలేదు మాజీ గ్రామాధికార్లు తమ వద్దే వుంచుకొని అనేక అక్రమ వ్యవహారాలు కల్పించుటకు అవినీతి కరపద్ధతుల్లో వీటిని వినియోగించారు. తర్వాత 1989 సంవత్సరంలో యీ చట్టాన్ని సవరించి, విక్రయదార్లు విధిగా తాము కొనుగోలుచేసిన తొంబది దినములలోపున 1908 సంవత్సరపు రిజిస్ట్రేషన్ నిబంధనం ననుసరించి తెలియజేయమని కోరింది. అంతే కాదు ఆ సవరణలో ఆర్.డి.ఓ. రిజిస్ట్రేషన్ అధికారి వుత్తర్వులపై అప్పీళ్ళను రివిజనల్ అధికారులకు యిచ్చింది. అంతేకాదు పట్టాదారు పాసు పుస్తకాల్లో, పంటరుణాలు, విధిగా వ్రాయించుకోవాలని నిర్దేశించింది. వీటిని వ్రాయించుకొనకుంటే ఇండియన్ పీనల్ కోడ్ సెక్షన్ 420 క్రింద అట్టి వారిపై క్రిమినల్ చర్యలు గైకొనుమన్నది. క్రయ విక్రయాలు జరిగే కాలంలో సంబంధిత రిజిస్ట్రేషన్ కార్యాలయాల్లో రిజిస్ట్రేషన్ అధికారులకు పాసుస్తకాలు హాజరుపరచి అందులో అట్టివాటిని నమోదు చేయించి వారి సంతకాలు పొందాలన్న నిబంధన చేర్చింది. భూసంస్కరణల చట్టంలో డిక్లరేషన్ యివ్వకున్నా తప్పుడు డిక్లరేషన్లిచ్చినా తీసుకోవలసిన క్రిమినల్ చర్యలు గైకొననందున వీటికి డిక్లరేషన్లను అట్టివారే యివ్వలేదు. 1965 జాయింటు పట్టాల విభజన చట్టాలలో, సర్వే సరిహద్దుల చట్టం క్రింద సబ్ డివిజన్ చార్జీలను, రాళ్ళు క్రయం నాటే కూలీల ఖర్చుకు రైతుల నుండి వసూలు చేయమని నిర్దేశించినా వాటి అమలు ఎందుకు ఆపివేయబడ్డదో అంతుబట్టుటలేదు.

1971 నుండి Act. No. XXVI 1971 చట్టం క్రింద పట్టాదారు పాసుపుస్త కాలను రైతులకు జారీ చేయాలని ఆమోదించిన చట్టం దాదాపు రెండు దశాబ్దాలు గడచినా యింతవరకు వెలుగు చూడలేదంటే ప్రభుత్వ చిత్తశుద్ధిలోపాన్ని తెలియచేస్తుంది. యీ పట్టాదారుల పాసుపుస్తకాల సరఫరానిబంధనల్లోని వాటిని గమనిస్తుంటే, రికార్డింగు అధికారి పూర్తి చేసిన అనంతరం, పూర్తి అయినట్లు, ఏ.పి. గెజిటులో ప్రకటించాలి. ఆ ప్రకటన చూచి మార్పులు చేయుటకు ఒక సంవత్సరంలోపుగా దరఖాస్తు చేయాలి. ప్రభుత్వం నిర్ణయించిన సబుడివిజన్ ఫీజును,

సబు డివిజను రాళ్ళ ఖర్చును రైతు చలాన ద్వారా చెల్లించాలి. పాసుపుస్తకము విలువను 15/- యలుగా నిర్ణయించారు. రికార్డు ఆఫ్ రైట్సు రిజిష్టరు మూడు ప్రతుల్లో తయారు చేస్తారు. మండలాధికారి వద్ద కాని, గ్రామ పాలనాధికారి వద్ద గాని వుండే ప్రతుల్లో ఎలాంటి ఫీజాలు లేకుండా రైతు తన పొలాల హక్కు ఎంట్రీలను పరిశీలించి, నియమిత ఫీజా అంటే ప్రతి సర్వే నెంబరు లేక బాగానికి ఒకరూపాయ వంతున రుసుము చెల్లించి ధృవపరచిన నకలుకు దరఖాస్తు చేయాలి. యీ దరఖాస్తు రుసుములు వేరుగా వుంటుంది. యీ పొలాల మార్పులలో నష్టపడ్డ రైతు 1963 సంవత్సరపు స్పెసిఫిక్ రిలీఫ్ చట్టం 47/63 క్రింద పెటిషన్ దాఖలు చేయాలి. తహశీల్దారు వుత్తర్వుపై అపీలుకు రు. 5/- యలు ఫీజా నిర్ణయించబడ్డది. పరిశీలనకు ముందు డ్రాఫ్టు ఆర్.డి.ఓ. నోటిఫికేషన్ మూడవ నమూనాలో ప్రకటిస్తూ ప్రకటించిన 15 రోజుల్లో ఆక్షేపణలు స్వీకరిస్తారు. అపై ని పూర్తయిన తర్వాత నాలుగవ నెంబరు పారంలో నిబంధన 14 (1) క్రింద రికార్డింగు అధికారి ప్రకటించాలి. వాటి తర్వాత నమూనా అయిదును నిబంధన 16 (2) క్రింద తహశీల్దారు షెడ్యూలుతో తెలుపుతూ సవరణ చేయుటకు స్వీకరించును. అట్లు తనకు ఆదరఖాస్తు ముట్టినట్లు నమూనా 6లో నిబంధన 18 క్రింద రశీదును యిచ్చును. యీ తతంగ మంతా జరిగిం తర్వాత పాసుస్తుకాలు బట్వాడా చేయబడును. అయితే మన రాష్ట్రంలో భూసమస్యకు సంబంధించి, అసైన్‌మెంటు పట్టాలు కౌలుదారీ నిబంధనలు సీలింగులో మిగిలిన అదనపు భూములు, కడకు యీ పట్టాదారుల పాసు పుస్తకాలు సరఫరా లాంటి అన్నింటిని, దరఖాస్తుపైన గాని, జిల్లా కలెక్టరుకు కాలపరిమితి నిర్ణయించని, పునర్విచారణాధికారాన్ని యిచ్చిన విషయమై రాష్ట్ర వున్నత న్యాయస్థాన విమర్శలకు గురౌతున్న దృష్ట్యా ప్రభుత్వం చిత్తశుద్ధితో భూసమస్య పరిష్కారమునకు కృషి చేయుట లేదని విశ్వసించవలసి వస్తున్నది. అందువల్ల యీ విషయంలో అట్టి అవకాశాలకు తావివ్వకుండా, పాసుపుస్తకాల బట్వాడాకు పూర్వమే సబు డివిజను కార్యక్రమాలు, సరిహద్దుల రాళ్ళ గుర్తింపు ఫీల్డు మెజరుమెంటు బుక్కుల్లో మార్పులు చేర్పులు, జలాధారాలు తరగతుల మార్పులు, ఆయకట్టుల స్థిరీకరణ (నూతన భారీ, మధ్యతరహా ప్రాజెక్టుల క్రింద) వాటి కనుగుణమైన తరాల మార్పు యివన్ని జరిపి మంజూరు చేసిన తప్ప, పుస్తకాలు బట్వాడా మాత్రం "అజాగళస్తనాలని, చెప్పుటకు విచారించవలసి వస్తున్నది".

**పాసుపుస్తకాలను సంస్కరించి రైతులందరికీ తక్షణం అందించాలి :** రెవెన్యూ మాయా జాలంలో చిక్కుకొని రైతాంగం అనేక ఇబ్బందులకు గురౌతున్నారు. ఏ చిన్న కాగితం కావాలన్నా లంచం పెట్టాల్సిందే. ఈ పరిస్థితులలో యాజమాన్యపు హక్కుతో కూడిన పట్టాదారు పాసుపుస్తకాలు రైతులకు ఎంతో మేలు చేస్తాయనడంలో సందేహం లేదు. కాని వాటిని ఆ విధంగా ఇవ్వడం భూస్వాములకు, రెవెన్యూ ఉద్యోగులకు ఇష్టం లేదు. అందువల్లనే ఏదో ఒక కారణంతో సంవత్సరాల తరబడి వాయిదా వేస్తూ వస్తున్నారు. ఇప్పుడు ఎన్నికలు దగ్గర కొస్తున్నాయి గాబట్టి రైతుల్ని ఆకట్టుకొని భ్రమల్లో ముంచడానికి ఈ 'చిట్కా' ప్రయోగించారు. జరుగుతున్న తతంగాన్ని పరిశీలిస్తే ఈ పాసు పుస్తకాల జారీ పూర్తి అయ్యేట్లు కన్పించడం లేదు. ప్రభుత్వ చిత్తశుద్దిని శంకించాల్సి వస్తుంది.

కాబట్టి చట్ట ప్రకారం వాస్తవ సాగుదార్లను గుర్తించి, ఉమ్మడి కుటుంబాలను విడగొట్టి, వివాదాలను పరిష్కరించి, బినామీలను గుర్తించి, ఒకే వ్యక్తికి ఎన్ని గ్రామాల్లో భూమి వున్నా అంతటినీ ఒకే బుక్ లోకి ఎక్కించి సమగ్ర రూపంలో పాస్ పుస్తకాలను తయారు చేసి నిర్దిష్ట కాలంలోగా రైతులకు అందించాలి. పేద రైతులకు ఎట్టి రుసుం వసూలు చేయకుండా ఉచితంగా పుస్తకాలు ఇవ్వాలి.

—కొండూరి వెంకటసుబ్బయ్య

# తెలంగాణా ప్రాంతం – కౌలుదారీ చట్టాలు

శ్రీ ఎ. అనంత రెడ్డి, అడ్వకేట్
రాష్ట్ర అధ్యక్షులు
ఆలిండియా లాయర్స్ యూనియన్

ఆంధ్రప్రదేశ్ తెలంగాణా ప్రాంతం కౌలుదారీ మరియు వ్యవసాయ భూముల సవరణ చట్టం 1954 అమలులోకి వచ్చిన నాటి నుండి మూడు కుటుంబ కమతాల కంటె తక్కువ భూమిని కల్గి ఉన్న భూయజమాని రక్షిత కౌలును రద్దుచేసి రక్షిత కౌలు భూమిని తిరిగి తనకు ఇప్పించవలసిందిగా కోరుతూ ధరఖాస్తు చేసుకొనవచ్చునని సెక్షన్ 44 పేర్కొన్నది. అయితే ఈ చట్టం అమలులోకి వచ్చిన నాటి నుండి 5 సంవత్సరముల వరకు మాత్రమే (1959 వరకు) ఈ అవకాశం వుంటుందని సెక్షన్ 44 లోని సబ్ సెక్షన్ 5 పేర్కొన్నది.

సెక్షన్ 44 ప్రకారం రక్షిత కౌలుహక్కులను రద్దు చేసి భూమిని స్వాదీనం చేసుకున్న భూయజమాని ఒక సంవత్సర కాలం లోపు స్వయంగా సాగు చేసుకోలేక పోయినా, స్వయంగా సాగు ప్రారంభించి 10 సం॥లోపు ఆపి వేసినా, రక్షిత కౌలు పునరుద్దరింప బడుతుందని సెక్షన్ 45 పేర్కొన్నది. అట్టి సందర్భంలో రక్షిత కౌలుదారు తహసీల్దారునకు ధరఖాస్తు చేసుకొనడం ద్వారా రక్షిత కౌలుభూమిని తిరిగి పొందవచ్చునని సెక్షన్ 46 పేర్కొన్నది.

వ్యవసాయ భూముల బదలాయింపుపై ఈ చట్టంలోని అధ్యాయం 5లో కొన్ని పరిమితులను విధించారు. సెక్షన్ 38 లేదా సెక్షన్ 38డి, లేదా సెక్షన్ 38ఈ ల ననుసరించి యాజమాన్యపు హక్కులను పొందిన రక్షిత కౌలుదారు అట్టి హక్కును పొందిన నాటి నుండి 8 సంవత్సరముల వరకు భూమిని అన్యాక్రాంతం చేయరాదని సెక్షన్ 48 పేర్కొన్నది. అయితే సెక్షన్ 48-ఎ, సబ్ సెక్షన్ 3 ప్రకారం భూమిని తాకట్టు పేట్టుట, తన పిల్లలకు, భార్యకు బహుమానంగా ఇచ్చుట అనుమతించ బడింది. అయితే ఆ విధంగా భూమిని పొందిన వారు కూడా యాజమాన్యపు హక్కులు సంక్రమించిన నాటినుండి 8 సం॥ల వరకు రక్షిత కౌలుభూమిని అన్యాక్రాంతం చేయరాదు.

రక్షిత కౌలుదారు యాజమాన్యపు ధృవపత్రం (సర్టిఫికెట్) పొందిన నాటి నుండి 8 సం॥లోపు భూమిని అన్యాక్రాంతం చేసినప్పటికీ అది చెల్లదని అట్టి కొనుగోలు దారుకు ఏ విధమైన హక్కులు ఉండవని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు పేర్కొన్నది. (1986 (2) ALT 26 SN.)

ఈ చట్టంలోని 6వ అధ్యాయంలో భూయజమానిగాని, కౌలుదారు గాని భూమిని సాగుచేయకపోయినా, సక్రమంగా సాగు చేయలేక పోయినా అవసరానికి మించి కంచ భూమి వదిలివేసినా అట్టి భూమి యొక్క యాజమాన్యాన్ని ప్రభుత్వం చేపడుతుంది. ఆ భూయాజమాన్యానికి ప్రభుత్వమే ఒక వ్యక్తిని నియమిస్తుందని సెక్షన్ 51 పేర్కొన్నది. అట్టి భూయాజ మాన్యాన్ని కొనసాగించడం అనవసరమని భావించినపుడు ప్రభుత్వం ఒక ప్రకటన ద్వారా అట్టి యాజమాన్యాన్ని రద్దుచేసి, ఎవరి దగ్గర నుండి ఈ భూమిని స్వాధీనం చేసుకుందో వారికి భూమిని తిరిగి ఇస్తుందని సెక్షన్ 53 పేర్కొంది.

వ్యవసాయ ఆర్థిక స్థితిగతుల సామర్థ్యాన్ని పెంచేందుకు అనుసరించాల్సిన వ్యవసాయ పద్దతులు, మేలి రకపు విత్తనాల అమ్మకం, మిగులు ధాన్యాల అమ్మకం, వ్యవసాయ కార్మికులకు సరియైన వేతనాలను గ్యారంటీ చేసేందుకు అవసరమైన నిబంధనలను విధించవచ్చునని, అట్టి నిబంధనలు 3 కుటుంబ కమతాలకు లేదా అంతకుమించి భూమిని సాగుచేసే వ్యవసాయ దార్లకు వర్తిస్తాయని, అలాగే ఈ భూ పరిమితిని ప్రభుత్వం తగ్గించ వచ్చునని సెక్షన్ 53 'బి' పేర్కొన్నది.

ప్రజోపయోగార్థం ప్రభుత్వం జరీదాలో (గెజిట్) ప్రకటించుట ద్వారా, భూయజమానికి పరిహారాన్ని చెల్లించుట ద్వారా భూ యాజమాన్యాన్ని స్వాధీనం చేసుకోవచ్చునని సెక్షన్ 53 'సి' పేర్కొన్నది. ప్రజోపయోగార్థం అంటే భూమిలేని వ్యవసాయదారులకు వసతి కల్పించుటకు, సహకార సంస్థలను అభివృద్ధి చేయటకు అని పేర్కొన్నది.

ఈ అధ్యాయానికి సంబంధించినంత వరకు ప్రభుత్వం తరపున యాజమానిగా ఉండుటకు గ్రామ పంచాయితీని గానీ లేదా వ్యవసాయ సహకార సంఘాన్నిగానీ ప్రభుత్వం నియమిస్తుందని సెక్షన్ 53 'డి' పేర్కొన్నది.

ప్రభుత్వం మిగులు భూమిని స్వీకరించి కౌలుకిచ్చుటలో వ్యవసాయ సహకార సంఘాలకు, ఆ భూమిపై పనిచేసే వ్యవసాయ కార్మికులకు, ఒక కుటుంబ కమతం కంటే తక్కువ భూమిని స్వయంగా సాగుచేస్తున్న కౌలుదార్లకు, ఆ గ్రామంలోని భూమిలేని వారికి వరుసగా ప్రాధాన్యత ఇవ్వబడుతుందని సెక్షన్ 53 'ఈ' పేర్కొన్నది. ఈ విధమైన కౌలుదార్లు కూడా సెక్షన్ 38లో వలెనే భూమిని కొనేహక్కును కల్గి ఉన్నారని సెక్షన్ 53 'ఎఫ్' పేర్కొన్నది.

*[గత సంచికలో 17వ పేజీలో 6వ లైనులో 'సెక్షన్ 380' ని 'సెక్షన్ 38సి' గా చదువుకోవలెను]*

[సశేషం.....]

# నూతన ఎరువుల విధానం ఎవరికి లాభం?

డా॥ అరిబండి ప్రసాదరావు

భారత వ్యవసాయ రంగంలో ఆహారోత్పత్తికి, ఎరువుల వాడకానికి, ఎంతో అవినాభావ సంబంధం ఉంది. ఎరువుల వాడకం 1951-52లో కేవలం 55 వేల టన్నులతో మొదలైంది. అప్పుడు ఆహార ధాన్యాల ఉత్పత్తి, 52 మిలియన్ టన్నులు మాత్రమే. 1966లో అధిక దిగుబడి వంగడాలను ప్రవేశ పెట్టటం జరిగింది. అప్పుడు ఆహారధాన్యాల ఉత్పత్తి, హెక్టారుకు, 629 కిలోల దిగుబడి 72.3 మిలియన్ టన్నులు. అధిక దిగుబడి వంగడాలు వాడుక పెరుగుతున్న కొద్దీ ఎరువుల వాడకం కూడా క్రమంగా పెరిగింది. 1991-92లో ఎరువుల వినియోగం 12.728 మిలియన్ టన్నుల స్థాయికి చేరి, ఆహార ధాన్యాల ఉత్పత్తి 167.1 మిలియన్ టన్నుల స్థాయికి చేరింది. 1951-52 నుండి 1965-66ల మధ్య, అంటే 14 సంవత్సరాలలో, కేవలం 20 మిలియన్ టన్నుల అధిక ఆహారోత్పత్తిని సాధించడం జరిగింది. ఈ అధిక దిగుబడిలో ఎక్కువ భాగం, వ్యవసాయ విస్తీర్ణం పెరగడం ద్వారా సాధించడం జరిగింది. ఈ కాలంలో 17 మిలియన్ హెక్టార్ల భూమిని అధికంగా సాగులోకి తీసుకురావటమే గాక, 5 మిలియన్ హెక్టార్ల విస్తీర్ణంలో సాగునీటి సౌకర్యం వల్ల, పలు పంటలు పెంచడం జరిగింది. 1965-66లో ఎరువుల వాడకం హెక్టారుకు కేవలం 5 కిలోలు మాత్రమే. 1966-67 నుండి 1991-92ల మధ్య, ఎరువులు వాడకం, బాగా విస్తృతమై, 1991-92లో ఎరువుల వినియోగం, హెక్టారుకు 70.3 కిలోల స్థాయికి చేరింది. ఫలితంగా 93 మిలియన్ టన్నుల ఆహారధాన్యాలను అధికంగా పండించడం జరిగింది. ఈ పెరుగుదలలో ఎరువుల పాత్ర అత్యధికంగా ఉండి, సాంద్ర వ్యవసాయ పద్ధతులు విస్తృతంగా అమలులోకి వచ్చాయి. 1966-67 నుండి, 1991-92 ల మధ్య, ఆహార ధాన్యాల ఉత్పత్తి సగటున, సంవత్సరానికి, 3.7 మిలియన్ టన్నులు పెరిగితే, ఎరువుల వినియోగం, 4.65 లక్షల టన్నులు, ప్రతి సంవత్సరం పెరిగింది. రెండు వేల సంవత్సరాల నాటికి, ప్రస్తుత జీవన ప్రమాణాలు పరిరక్షించుతూ, పెరుగుతున్న జనాభా అవసరాలు తీర్చడానికి, ఆహార ధాన్యాల ఉత్పత్తి స్థాయిని 240మిలియన్ టన్నులు స్థాయికి చేర్చవలసిన అవసరం ఉంది. 1992-93 లో ఆహారోత్పత్తి, దాదాపు 180.3 మిలియన్ టన్నులుగా అంచనా వేయబడింది. అంటే వచ్చే ఏడేళ్ళ కాలంలో 60 మిలియన్ టన్నులు అధిక ఆహార పదార్థాలను పండించాల్సిన అవసరమున్నది. కాబట్టి ఎరువుల వినియోగం, భారత వ్యవసాయ రంగంలో అత్యధికంగా ప్రోత్సహించాల్సిన అవసరం ఉందని ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదు.

దీనికి విరుద్ధంగా, కేంద్ర ప్రభుత్వ విధానాలు, ఎరువుల వినియోగానికి పూర్తిగా వ్యతిరేకంగా ఉన్నవి. వివిధ ప్రభుత్వ నిర్ణయాలవల్ల, ఎరువుల ధరలు విపరీతంగా పెరిగాయి. జూలై 25, 1992 నుండి, అన్నిరకాల ఎరువుల ధరలను 40 శాతం పెంచడం జరిగింది. తర్వాత ఈ పెరుగుదలను, 30 శాతానికి తగ్గించారు. తిరిగి, పాస్ఫరసు, పొటాష్ ఎరువుల ధరలు ఆగస్టు 25, 1993 నుండి అన్నిరకాల నియంత్రణలను తీసివేయడమే గాక, గతంలో పెంచిన నత్రజని ఎరువుల ధరపై పదిశాతం రాయితీ ఇవ్వబడింది. ఫలితంగా టన్నుకు, 4,680 రూ. లున్న డి.ఏ.పి. ధర ఒకేసారి, 7,900 రూ.ల నుండి 8,200 రూ.లకు పెంచడం జరిగింది. (70 నుండి 75 శాతం పెరుగుదల). అలాగే టన్నుకు, 1940 రూ.లున్న సూపర్ ధర, 2,700 రూ.ల నుండి 3,000 రూ. ల వరకు పెంచడం జరిగింది. (120 నుండి 140 శాతం పెరుగుదల) టన్నుకు 1,700 ఉన్న పొటాష్ ధర, ఒకేసారి, 5,700 నుండి 6,000 రూ. ల వరకు పెంచడం జరిగింది. (235 నుండి 250 శాతం పెరుగుదల). బహుశ, ఏ ఇతర

రంగంలోను, ఇంతటి ఆర్థిక భారాలు, ఇటీవల ప్రభుత్వము మోపలేదు. ఫలితంగా 1992-93లో, ఫాస్ఫరస్, పొటాస ఎరువుల వినియోగం పూర్తిగా పడిపోయింది. దీన్నినవరించడానికి, ప్రభుత్వం, కాంప్లెక్సు 1,000 రూ.లు సబ్సిడీ ప్రకటించబడింది. అయినా, 1992-93 రబీసీజనులో, దేశం మొత్తం మీద ఫాస్ఫరస్ ఎరువుల వినియోగం, 20.9 శాతం తగ్గింది. పొటాష్ ఎరువుల వినియోగం, 46.7 శాతం తగ్గింది. ఈ పెరిగిన ధరల ప్రభావం, దేశం మొత్తం మీద, ఒకే విధంగా లేదు. ఉత్తర భారత దేశంలో పొటాష్ వినియోగం, 73 శాతం తగ్గింది. దక్షిణ భారతదేశంలో ఫాస్ఫరస్, పొటాష్ వినియోగాలు, 21 మరియు 50 శ్రాతం తగ్గాయి. హెక్టారుకు ఎరువుల వినియోగం, దక్షిణ భారతదేశంలో 18 కిలోలు తగ్గితే, ఉత్తర భారతంలో 3.7 కిలోలు, తూర్పు భారతంలో ఒక్క కిలో, మరియు పశ్చిమ భారతంలో కేవలం 0.1 కిలో మాత్రమే తగ్గాయి. ఈ తారతమ్యాలు, వివిధ పంటలలో కూడా, తెల్సుకోవచ్చు.

ఈ విషయంలో పూర్తి గణాంకాలు లేనప్పటికి పెరిగిన ధరల ప్రభావం, వ్యాపార పంటలలో ఎరువుల వాడకం, అంతగా ప్రభావితం కాకున్నా, ఆహార ధాన్యాల విషయంలో తీవ్రంగా ఉన్నట్లు గమనిస్తున్నాం. అలాగే నీటి వసతి కలిగినటువంటి ప్రాంతాలలో, ఎరువుల వాడకంపై పెరిగిన ధరల ప్రభావం తక్కువగా ఉన్నా, వర్షాధార ప్రాంతాలలో విపరీతంగా ఉంది. ఇదేకాక, కమతాలలో అత్యధిక భాగం, అంటే 76 శాతం, చిన, నన్నకారు రైతులకు సంబంధించినవి. వారికి పెట్టుబడి అందుబాటులోలేక ఎరువుల వినియోగం పూర్తిగా తగ్గిపోయింది. అందువలన, ఈ ఎరువుల ధరల విషయంలో, కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలు, ఎరువుల వాడకాన్ని తగ్గించేవిగానే గాక, ప్రాంతీయ, సామాజిక తారతమ్యాలను, తీవ్రతరంచేసేవిగా ఉన్నాయి. ఫలితంగా, రెండువేల సంవత్సరం నాటికి, ఆహార ధాన్యాల ఉత్పత్తిలో ప్రస్తుత విధానాలే కొనసాగించితే, లక్ష్యాలను సాధించడం, దాదాపు అసాధ్యమనే చెప్పాలి.

ప్రస్తుత ఎరువు ధరల విధానం ఎరువుల వాడకాన్ని తగ్గించడమే గాక, ఎరువుల వాడకంలో దీర్ఘకాల అధికోత్పత్తికి, దోహద పడని అశాస్త్రీయ విధానాలను ప్రోత్సహిస్తుంది. ప్రభుత్వ విధానాల ఫలితంగా, నత్రజని ఎరువుల వినియోగం, 92-93లో 8.435 మిలియన్ల స్థాయికి చేరింది. ఇది అంతకంటే ముందు సంవత్సరం కన్నా 4.8 శాతం ఎక్కువ. కాని, ఫాస్ఫరస్ ఎరువుల వినియోగం, 13.5 శాతం తగ్గింది. పొటాషియం, వినియోగంలో ఇది 30.6 శాతం తగ్గింది. వ్యవసాయం అత్యధిక భాగం, కేవలం నత్రజని ఎరువులపై ఆధారపడేలా చేసింది. 1990-91లో, ప్రతి కిలోపొటాస్ ఎరువుల వాడకానికి 6 కిలోల నత్రజనిని వాడితే, 1992-93లో ఇది, దాదాపు 9కిలోలు స్థాయికి చేరింది, కేవలం 1992-93 రబీ ఎరువుల వినియోగం చూస్తే అంతకంటే ముందు కిలో పొటాష్‌కి 6.4 కిలోల నత్రజని వినియోగం కాగా, ఇది 12.7 కిలోల స్థాయికి చేరింది. ఇట్టి అశాస్త్రీయ, వాడుక ఫలితాలు, దీర్ఘ కాలంలో, అధికోత్పత్తికి, దోహదపడవని, ఎన్నో పరిశోధనా ఫలితాలు సూచిస్తున్నాయి. దీర్ఘకాలములో, నత్రజని ఎక్కువగా వాడిన సందర్భాలలో 6, 7 సంవత్సరాలలోనే, పంట దిగుబడి స్థాయి, తగ్గిపోయి, భూమి నిస్సారంగా మారిపోతుందని తేలింది. అదే, నత్రజని, ఫాస్ఫరస్ మరియు పొటాష్ ఎరువులు, భూసార పరీక్షపై ఆధారపడి తగుపాళ్ళల్లో వాడినప్పుడు, దీర్ఘకాలంగా అధికోత్పత్తి సాధ్యమని తేలింది. ఈ ప్రయోగాలలో రసాయనిక సేంద్రియపుఎరువులు సమీకృతంచేసి వాడితే, భూసారం అభివృద్ధి జరగటమేగాక, ఎరువుల వాడకాన్ని కూడా తగ్గించవచ్చని తేలింది. అందువలన, ప్రభుత్వ విధానాలు, ప్రస్తుత తరుణంలో, నత్రజని ఎరువుల వినియోగాన్ని తగ్గించేవిగా ఉండి, ఫాస్ఫరస్ మరియు పొటాష్ ఎరువుల వినియోగాన్ని ప్రోత్సహించేవిగా ఉండాలి. కాని, ఎరువుల ధరల విషయంలో ప్రభుత్వ విధానాలు దీనికి భిన్నంగా ఉన్నవి. ఈ విషయంలో భారత శాస్త్రజ్ఞులు మరియు వ్యవసాయ నిపుణులు, తమ అభిప్రాయాలను వెల్లిబుచ్చినా, ప్రభుత్వ విధానాలు, ప్రభావితం కాలేదు. ఇటీవల, ప్రపంచ బ్యాంకు నిపుణులు కూడా స్పష్టంగా భారత వ్యవసాయ రంగంలో నత్రజని ఎరువుల వినియోగాన్ని తగ్గిస్తూ, ఫాస్ఫరస్ మరియు పొటాష్ ఎరువుల వినియోగం పెంచేవిగా ఉండటాన్ని విమర్శిస్తున్నట్లు పేపరు వార్తలు సూచిస్తున్నాయి. అందువలన ప్రభుత్వం, తన విధానాలను, ఎరువుల ధరల విషయంలో తగిన మార్పులు చేసుకుంటుందని ఆశించవచ్చు. దీనికి ప్రజల మద్దతు, రైతు సంఘాల మద్దతు కూడా అవసరం.

వివిధ కారణాల వలన, భారత ప్రభుత్వం మన ఆర్థిక వ్యవస్థలో వివిధ రంగాలకిచ్చే ఆర్థిక రాయితీలను, అంటరానిదానిగా పరిగణిస్తుంది. ఎరువుల విషయంలో ఇచ్చే రాయితీలను, తగ్గించే మార్గంలో ప్రభుత్వం తన ప్రస్తుత విధానాన్ని అమలు చేస్తున్నట్లు వివిధ సందర్భాలలో చెప్తుంది. కాని 1992, డిసెంబరులో భారత ఎరువుల సంఘం, ఆహార భద్రతపై నిర్వహించిన ఒక సెమినార్‌లో ఎరువుల మీద ఇచ్చే సబ్సిడీ, బడ్జెట్ పుస్తకాలలో గణనీయంగా కన్పించినప్పటికీ, భారత ఆర్థిక వ్యవస్థలో, ఇది ఎంతోమేలు చేకూరుస్తుందని, దీని వలన ఎన్నో లాభాలు ఉన్నవని, అధిక ఆహారోత్పత్తి సాధించి, ఆహార భద్రత సాధించటానికి, ఈ సబ్సిడీలు అవసరమని సిఫార్సు చేయబడింది. ఒకవేళ సబ్సిడీ తగ్గించినా ఇది క్రమంగా జరగాలే తప్ప, ఎరువుల వినియోగాన్ని నిరుత్సాహ పరిచేదిగా ఉండగూడదని, ఈ కాన్ఫరెన్స్ సిఫార్సు చేసింది.

ఎరువుల వినియోగం పై మరియు వాని రవాణాపై ఉన్ననిషేధాలు, తొలిగించటం వలన కలిగే చెడు పరిణామాలు ఇప్పటికే చూస్తున్నాం. ఆర్థిక అవసరాల రీత్యా, వ్యవసాయ రంగంలో కొన్ని రకాల ఉత్పత్తులను ఎగుమతులను ప్రోత్సహించడం కూడా జరుగుతుంది. ఫలితంగా, ఎరువుల వినియోగం, ఇటువాణిజ్య పంటలకు, మరియు అటు ఎగుమతి ప్రాధాన్యత, అవకాశమున్న వ్యవసాయ ఉత్పత్తులకు తరలిపోయి, ఆహారధాన్యాల పంటలకు, ఎరువుల వినియోగం తగ్గిపోయే ప్రమాదం ఏర్పడింది. దానివలన ఆహారధాన్యాల సాగు తగ్గిపోయి, కొద్దిమంది రైతులకు అధిక ఆదాయమిచ్చే పైర్ల విస్తీర్ణం పెరిగిపోయే, ప్రమాదం కూడా ఏర్పడింది. కొంతమేరకు, ఆహార ధాన్యాల దిగుమతి, విధిగా, ఉండాలనే డంకెల్ ప్రతిపాదలను, ఇతర అంతర్జాతీయ వత్తిడులను పరిగణలోనికి తీసుకుంటే, వచ్చే కొద్ది సంవత్సరాలలో ఆహార ధాన్యాల ఉత్పత్తి వివిధ వత్తిడులకు గురై, ఆహార భద్రత కోల్పోయే ప్రమాదం కూడా లేక పోలేదు.

ప్రభుత్వ ఇతర విధానాలను, దేశంలో పాస్ఫరస్ ఆధారిత కాంప్లెక్స్ ఎరువు ఉత్పత్తి ధరలు పెరిగి, దిగుమతి చేసుకునే కాంప్లెక్స్ ఎరువుల ధరలు కారు చవకగా అయిపోయాయి. కేవలం 552 వేల టన్నుల దిగుమతి అవసరం కాగా, 1992-93లో 727 వేల టన్నుల పాస్ఫరస్ ఎరువులను దిగుమతి చేసుకోవటం జరిగింది. ఫలితంగా, దేశంలో డిఏపి ఉత్పత్తి చేసే కర్మాగారాల అత్యధిక భాగం ఇప్పటికే మూత పడ్డాయి. మిగతావి కూడా అధిక నష్టాలలో నడుస్తున్నాయి. ఒకసారి భారత ఎరువుల కర్మాగారాలు మూత పడ్డ తరువాత, అంతర్జాతీయ ఎరువుల ఎగుమతిదారులు ఎరువుల ధరలను విపరీతంగా పెంచి, భారత వ్యవసాయ రంగాన్ని నియంత్రణచేసే స్థితికి వస్తారని భారత ఎరువుల సంఘం అభిప్రాయం వ్యక్తం చేస్తోంది. ఇదికూడ మన ఆహార భద్రతపై విపరీత ప్రభావం చూపుతోంది.

అందువలన ప్రభుత్వ విధానాలు, ఆహారోత్పత్తి, పెంచి ఆహారభద్రతను పెంపొందించటానికి అనుగుణంగా, వివిధ రకాల అసమానతలను తగ్గించేవిగా, వివిధ రకాల ఎరువుల వినియోగంలో సమతుల్యతను ప్రోత్సహించే ఎరువుల ధరల విధానాన్ని రూపొందించాలి. దేశ ప్రయోజనాలను కాపాడి అన్ని వర్గాల, ప్రాంతాల ప్రయోజనాలను పెంపొందించేవిగా ఉండాలి. ఈ విషయంలో అవసరమైతే, జాతీయ చర్చ జరగాలి.

# [illegible]

– శ్రీ భీమిరెడ్డి నరసింహారెడ్డి, ఎం.పి., ఉపాధ్యక్షులు, అఖిలభారత కిసాన్ సభ

**1946–51** మధ్య జరిగిన తెలంగాణా సాయుధ పోరాటం భవిష్యత్తులో జరుగబోయే జనతా ప్రజాస్వామిక విప్లవానికి మార్గదర్శకంగా నిలిచింది. భూమి సమస్యను, దాన్ని పరిష్కరించాల్సిన ఆవశ్యకతను, మరియు ప్రజాస్వామిక విప్లవంలో సమన్వయ శక్తులు ఏమిటి అనే విషయాలు ఈ పోరాటం వలన ముందుకొచ్చాయి. మొత్తం భారత రాజకీయాలలో ప్రాధాన్యతను సంతరించుకున్నాయి. ఎన్నికయిన గ్రామ కమిటీల ద్వారా పరిపాలన సాగించడం ద్వారా ప్రజారాజ్యం ఎలా వుంటుందో ప్రజానీకానికి తెలిసేలా చేసింది. ఈ పోరాటం నల్గొండ, ఖమ్మం, వరంగల్ జిల్లాలకు చెందిన ముప్పది లక్షల జనాబా కలిగిన మూడువేల గ్రామాలలో చైతన్యయుతమైన గ్రామ పంచాయితీలు ఏర్పాటు చేయడం ద్వారా గ్రామ రాజ్య స్థాపన చేసిన ఖ్యాతి అజరామరమైన ఈ పోరాటానికే దక్కింది. గ్రామంలో నిజాము నియంతృత్వ ప్రభుత్వానికి మూల స్తంభాలుగావున్న భూస్వాములను గ్రామాల నుండి పారద్రోలి వారి భూములను రైతాంగం ఆక్రమించుకునే వరకు ఈ గ్రామ కమిటీలు సమరం సాగించాయి. 10 లక్షల ఎకరాల భూమి పంపిణీ చేయబడింది. "బాంచన్ దొర కాల్మొక్త" అంటూ భూస్వాముల కబంధ హస్తాలలో నలిగిపోతున్న సాధారణ గ్రామీణ ప్రజానీకానికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల రుచి చవిచూపించినదీ పోరాటమే. విముక్తి కాబడిన ప్రాంతాలలో వెట్టి రద్దు చేయబడింది. తుమ్మితే ఊడే ముక్కులా వుండే కౌలుదార్లకు భద్రత ఏర్పడింది. ప్రజలను నిలువుదోపిడి చేస్తున్న వడ్డీరేట్లు బాగా తగ్గించబడినాయి. లేదా రద్దు చేయబడినాయి. వ్యవసాయ కూలీల వేతనాలు పెంచబడినాయి. అయితే కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో పోరాడిన రైతాంగం యొక్క చిరస్మరణీయమైన త్యాగాల వలననే ఈ విజయాలు సాధించబడినాయి. నాలుగేవేల మంది కమ్యూనిస్టులు, విప్లవకారులైన రైతులు ఊచకోత కోయబడ్డారు. పదివేల మైచిలుకు చెరసాలల్లో మగ్గిపోయారు. యాభైవేల మంది ప్రజలు దారుణంగా హింసించబడ్డారు. వేలాది గ్రామాలలో లక్షలాది ప్రజానీకాన్ని పోలీసులు, మిలటరీలు దాడులలో గొడ్డులను బాదినట్లు చావగొట్టారు. వారి ఆస్తులు దోచుకున్నారు. అసంఖ్యాకమైన ఆడపడుచులు మానభంగాలకు గురయ్యారు. అనేక అవమానాలను దిగమింగారు. తీవ్రమైన అణచివేతకు గురవుతూ బానిసత్వపు బతుకులను భారంగా నెట్టుకొస్తున్న నిరక్షరాస్యులైన ఈ ప్రజానీకాన్ని సాయుధ పోరాటానికి పురిగొల్పిన సామాజిక ఆర్థిక పరిస్థితులేమిటి? ఈ పోరాటపు వివిధ దశలలో భిన్న వర్గాలకు చెందిన రైతుల పాత్ర ఏమిటి? తెలంగాణా సాయుధ పోరాటం ప్రారంభమయ్యేంత వరకు, గవర్నమెంటు రెవెన్యూ విధానం పనిచేస్తున్న రైతులైనా, జాగీరులలో పనిచేస్తున్నా లేక నిజాము ఎస్టేటులో వున్న రైతులైనా తీవ్రమైన దోపిడీకి గురవుతుండేవారు. మొత్తం వ్యావసాయిక భూమిలో 10 శాతంగావున్న నిజాం ఎస్టేటులోని ప్రజలు కట్టు బానిసలుగా బతుకులీడుస్తుండేవారు. గవర్నమెంటు రెవెన్యూ విధానంలో వున్న రైతులకుండే కొద్దిపాటి హక్కులు కూడా వారికుండేవిగావు. ఇక జాగీరులలో జీవించే రైతులు నియంతృత్వ భూస్వాములైన, పైగాలు, సంస్థానాధీశులు, జాగీరుదారులు ఇజార్ దారులు, ఇనాందారులు, అగ్రహారికుల చేతులలో రక రకాల దోపిడీకి గురవుతుండేవారు. నిజాంకు చెల్లించే కప్పం తక్కువే అయినా అత్యధిక పన్నులు విధించేవారు. ఈ పన్నులు వసూలు చేయడానికి వారికి స్వంత యంత్రాంగం (అధికారులు) వుండేది. ప్రభుత్వ భూములలో కన్న పదిరెట్లు ఎక్కువ నీటి తీరువా వుండేది. వెట్టి చాకిరీ, నిర్బంధం వసూళ్ళు సర్వ సాధారణము. వీరికి స్వంత పోలీసులు కూడా వుండేవారు. రైతులకు చెందిన, సారవంతమైన వేలాది ఎకరాలను స్వాధీనం చేసుకుని ఆ రైతులను కౌలుదార్లుగా మార్చిన ఘనత ఈ నిరంకుశ ప్రభువులదే. రైతులకు తెలియకుండా భూములను తమపేర బదిలీ చేయించుకునేవారు. సర్వే సెటిల్‌మెంటు క్రింద రైతులకు వచ్చిన భూములను కూడా 1920–22 లో వచ్చిన ఆర్థిక సంక్షోభంలో వీరు స్వాహా చేశారు. రైతులు పంటలు సరిగా లేని కారణం చేతగాని, గిట్టుబాటు ధరలు లేని కారణం చేతగాని పన్నులు చెల్లించలేకపోయినట్లయితే

వారిని క్రూరంగా హింసించి వారి భూములు లాక్కునేవారు. ఈ దుర్మార్గ ప్రభువులు ఒక్కోసారి రైతులకు వ్యవసాయ వస్తువులు అప్పిచ్చి వాటికి చక్రవడ్డీలు కట్టి అప్పు తీర్చలేదని భూములు గుంజుకునేవారు. వెట్టి చాకిరీ అనేది హరిజనులు ఇతర వెనుకబడిన తరగతులకే కాకుండా అన్ని వర్గాలకు చెందిన రైతులకు కూడా ఆ బాధ తప్పేదికాదు. భూస్వాములే కాకుండా వారి అధికారులు కూడా ఈ నిరంకుశ కర్కశ కేళీ వినోదం నిరంతరం సాగిస్తుండేవారు. తమ భూములను లాక్కుని వేరేవారికివ్వడం ద్వారా తమ నోటి ముందు కూడు కొల్లగొడు తున్న నిర్దయ ప్రభువుల నియంతృత్వానికి వ్యతిరేకంగా, నిర్బంధ వసూళ్ళ నిరోధించడానికి రైతులు అదే చారిత్రాత్మకమైన తెలంగాణా సాయుధ పోరాటంగం రూపుదిద్దుకొంది.

మహబూబ్‌నగర్, నల్గొండ, వరంగల్ జిల్లాలలో కేవలం 550 మంది భూస్వాముల స్వాధీనంలో 70 శాతం సాగుభూమి వుండేది. జన్నారెడ్డి ప్రతాపరెడ్డి ఆధీనంలో 1,50,000 (లక్షా ఏభైవేల) ఎకరాల భూమి వుండేది. అలానే కల్లూరు దేశముఖ్ మరియు బాబాసాహెబ్ దేశముఖ్ ఒక్కొక్కరూ లక్ష ఎకరాల యజమానులు. ఇంకా విసునూరు దేశముఖ్‌కు 40,000 ఎకరాలు, సూర్యాపేట దేశముఖ్‌కు 20,000 ఎకరాలు వుండేవి.

చారిత్రకంగా ఈ పోరాటానికి వివిధ దశలు వున్నాయి. 1940-44 కాలంలో ఆంధ్ర మహాసభ మరియు కమ్యూనిస్టు పార్టీ కింద సంఘటితమయిన రైతులు, నిజాం యొక్క ప్రజాహితమైన ఉత్తర్వులను, జమీందారులు, లంచగొండి అధికారులు తూట్లు పొడవకుండా విన్నపాలు పంపేవారు. 1944 తరువాతి కాలంలో వెట్టి చాకిరీకి వ్యతిరేకంగా రైతులనుండి భూములను లాక్కోవడానికి వ్యతిరేకంగా అనేక వీరోచిత పోరాటాలు సాగించారు. ఆ రోజులలోని ప్రజల పట్టుదల, తీవ్రత, వీరత్వం వివరించాలంటే ఒక్క ఉదాహరణ చాలు. జనగాం తాలూకా జమీందారు పుసుకూరి రాఘవరావు ఒక లంబాడీ తండా సాగుచేసుకుంటున్న 80 ఎకరాల మెట్ట, 25 ఎకరాల మాగాణి భూమిని స్వాధీనం చేసుకోవడానికి పంపిన సాయుధులైన గూండాలను సంఘంగా పిలువబడే ఆంధ్ర మహాసభ నాయకత్వంలో తండా ప్రజలు కర్రలు, వడిసెలతో ఎదిరించి, వీరోచితంగా పోరాడి వారిని తరిమి, తరిమి కొట్టారు. ఈ విధమైన పోరాటాలు అనేక గ్రామాలలో జరిగాయి.

తెలంగాణా వ్యావసాయిక విప్లవాగ్నిని రగిలించిన ఘటన పాలకుర్తి గ్రామం, జనగాం తాలూకాలో జరిగింది. గ్రామానికి చెందిన అయిలమ్మ అనే చాకలి కుటుంబానికి చెందిన స్త్రీ పొలం నుండి పంటను తీసుకుపోవాలనే కుత్సితపు ఆలోచనతో నున్న దేశముఖ్ విసునూరు రామచంద్రారెడ్డిని ప్రజలు ప్రతిఘటించారు. సంఘానికి చెందిన 14 మంది నాయకులకు దేశముఖ్ ఒక హత్యానేరం మోపి పంట తీసుకురావడానికి గూండాలను పంపించారు. విసునూరు నుండి పోలీసులు వచ్చినా ఆ పంటను ముట్టకునే ధైర్యం చేయలేదు. ఈ సంఘటనలో ప్రజలలో చైతన్యం పెరిగింది, ధైర్యం పెరిగింది, ఉత్సాహం ఇనుమడించింది. మరునటి రోజా ఉదయం పోలీసులు ఆరుగురు సంఘం నాయకులను అరెస్టుచేసి కాళ్ళు చేతులకు గొలుసులు వేసి క్రూరంగా హింసించారు. అయినా దేశ్‌ముఖ్‌కు ధాన్యం తీసుకుపోవడం సాధ్యం కాలేదు. రెచ్చిపోయిన జమీందారు కడవెండి గ్రామానికి చెందిన సంఘం నాయకులను పోలీసుల సాయంతో హత్య చేయించడానికి కుట్ర పన్నాడు. తన పన్నాగంలో భాగంగా అనేకమంది ప్రజలపై కేసులు పెట్టాడు. 15 మందిని అరెస్టు చేయించాడు. జమీందారు గూండాలు బాగా త్రాగి ప్రజానాయకుల ఇళ్ళపై రాళ్ళు రువ్వసాగారు. కోపోద్రిక్తులైన ప్రజలు కర్రలతో వడిసెలు చేతపట్టి ఊరేగింపు జరిపారు. ఊరేగింపు జమీందారు ఇంటిని సమీపిస్తున్న గూండాలు తుపాకులతో కాల్చడం మొదలు పెట్టారు. ప్రదర్శనకు నాయకత్వం వహిస్తున్న దొడ్డి కొమరయ్యకు తూటాలు తగిలి అతనక్కడికక్కడే చనిపోయాడు. దొడ్డి కొమరయ్య అమరత్వంతో తెలంగాణా ప్రజల ఆవేశం కట్టలు త్రెంచుకుంది. దరిమిలా జమీందారుని సామాజికంగా వెలివేసారు. సంఘం ఇచ్చిన పిలుపుతో మంగలివారు, చాకలివారు, పనివారు, దాసీలు, అందరూ జమీందారు పనులు ముట్టకోవడం మానవేశారు. ఉచిత వెట్టి చాకిరీ నిలిపివేశారు. ప్రజలలో వచ్చిన ఈ చైతన్యం తిరిగుబాటుగా 'దున్నే వాడిదే భూమి', 'కౌలుదార్లను తీసివేయడం', 'వెట్టి', 'నిర్బంధ ధాన్యం వసూళ్ళ', 'జమీందారీ విధానం రద్దు' అనే నినాదాలను ముందుకు తీసుకువచ్చారు. కొద్ది కాలంలోనే ఈ ఉద్యమం నల్గొండ, ఖమ్మం, వరంగల్ జిల్లాలోని మూడు నాలుగు వందల గ్రామాలకు వ్యాపించింది.

1946 ప్రారంభం వరకూ గ్రామంలో నాటు తుపాకులు విరివిగా లభ్యమవుతున్నా దళాలకు శిక్షణ ఇవ్వండం గానీ రైతాంగం వాటిని ఉపయోగించడం గానీ జరగలేదు. వలంటీరు దళాలు ఇవి ఉపయోగిస్తే ఉద్యమం పంథా మారి తీవ్ర పరిణామాలెదురవుతాయనే ఉద్దేశ్యంతో పార్టీ తుపాకులు వద్దని ఆదేశించింది. ప్రజల మీద పట్టు కోల్పోతున్న నిజాం ప్రభుత్వం పెద్ద ఎత్తున మిలటరీ

దిగింది. అనేక గ్రామాలు తగలబెట్టారు. దొరికిన వారిని కాల్చి చంపడమో లేక జైళ్ళలో కుక్కి హింసించారు. కార్యకర్తల కొరకు పొలాలలో తీవ్రంగా గాలించేవారు. ఈ తీవ్రమైన అణచివేత చర్యల వల్ల కార్యకర్తలు చెల్లాచెదురయ్యేవారు. ఇవన్నీ గమనించిన తరువాత పార్టీ తుపాకులు ధరించడానికి ఆత్మరక్షణార్థం వాడడానికీ అనుమతినిచ్చింది. బాంబుల తయారీ, ఆయుధాలను ఉపయోగించడం, మైనింగుకి పేలుడు పదార్థాలు వాడడం, శత్రు స్థావరాలు దెబ్బ తీడయం మున్నగు అంశాలపై ప్రాథమిక శిక్షణ ఈయడం జరిగింది. పదివేలమంది రైతులు, రైతు కూలీలు గ్రామ దళాలుగా ఏర్పడ్డారు. రెండువేల మంది గెరిల్లా దళాలుగా ఏర్పడ్డారు. గ్రామ దళాలోని సభ్యులు తమ వృత్తులు కొనసాగిస్తూనే రజాకార్లను, పోలీసులను నాటు తుపాకులతో ఎదుర్కొనేవారు. గ్రామంలోని శత్రువులు తలెత్తకుండా చేసారు. గ్రామ కమిటీల దైనందిన కార్యకలాపాలలో తోడ్పడటం, ప్రజలను ఉత్సాహపరచి ప్రచారాల ద్వారా వారిని చైతన్యవంతులు చేసే కార్యక్రమం కూడా వారు చేసేవారు. గ్రామ విధ్వంస దళ సభ్యులు తమ మామూలు పనులు చేసుకుంటూనే శత్రువు వాహనాలు గ్రామంలోకి ప్రవేశించకుండా రోడ్లపై గుంతలు తవ్వడం, రోడ్లపై టైర్లు పంక్చర్లు పడడానికి మేకులు చల్లడం, శత్రువుల ఆస్తులు ధ్వంసం చేయడం వంటి కార్యక్రమం చేసేవారు. వారు నాటు తుపాకులు, వలుగులు, పారలు ఆయుధాలుగా వాడుతుండేవారు. తమ కార్యకలాపాలు, తమ గుర్తులు శత్రువులకు దొరకకుండా జాగ్రత్త వహించేవారు. గెరిల్లా దళాలలోని సభ్యులు తమతమ వృత్తులను విడనాడి హోల్‌టైమర్లుగా పనిచేసేవారు. తమ ధైర్య సాహసాలతో పార్టీ మరియు ప్రజల విశ్వాసాన్ని వారు చూరగొన్నారు. ఉన్న కొద్దిపాటి ఆధునిక ఆయుధాలు ఉపయోగించి రజాకార్లు, పోలీసుల దాడులను ఎదుర్కొనేవారు. అన్ని వర్గాల రైతులు మనస్ఫూర్తిగా అంకిత భావంతో ఈ దళాలలో చేరేవారు. ఈ దళంలో చేరనివారు, భూస్వాముల నుండి, రజాకార్ల నుండి, పోలీసుల నుండి ఎదురయ్యే అవమానాలను, దారుణ హింసలను భరించైనా ఉద్యమానికి కార్యకర్తలకు సహాయ సహకారాలు అందిస్తుండేవారు.

వరంగల్, ఖమ్మం, నల్గొండ జిల్లాలకు చెందిన మారుమూల గ్రామాలలో గెరిల్లా దళాలు లేక పోయినా ప్రజలే ఆయుధాలు చేతబూని పోలీసు, రజాకార్ల దాడులను ఎదుర్కొనేవారు. వరంగల్లు జిల్లాలో భైరాన్‌పల్లిలో ప్రజలు సామూహికంగా సాయుధ రజాకార్లను అనేకమార్లు ఎదుర్కొని పారద్రోలారు. అదే సమయంలో భువనగిరికి చెందిన రైతు నాయకుడు రేణిగుంట రామిరెడ్డి తన గ్రామంలో ఒక రక్షణ దళాన్ని ఏర్పరచాడు. అతను పార్టీ సభ్యుడు కాదు. అయినా అతను అనేకమార్లు నిజాం పోలీసుల్ని, రజాకార్లతో పోరాడి గ్రామంలోకి రాకుండా నిరోధించాడు. ఒక రోజు పెద్ద సంఖ్యలో మిలటరీ ఆ గ్రామాన్ని చుట్టుముట్టింది. రామిరెడ్డి అతని దళం వీరోచితంగా పోరాడారు. అతని ఇంటిలో నుండే వారు పోరాటం కొనసాగించారు. మిలటరీ యొక్క అత్యంతాధునిక మారణా యుధాల ముందు వారు నిలవలేక ఒక్కొక్కరే అసువులు బాసారు. రామిరెడ్డి ఒక సాధారణ రైతు మాత్రమే అయినప్పటికీ అతని సాహసం, చిరస్మరణీయం, తెలంగాణా సాయుధపోరాట స్ఫూర్తితో పార్టీ సభ్యులు కానివారు కూడా అంతుతేజంగా సాహసంగా పోరాడారు.

భారత సైన్యం రాకతో ఉద్యమం కాస్త తగ్గవలసి వచ్చినా రైతాంగం గెరిల్లా దళాలకు రక్షణ కల్పించడం, ఆహారం మున్నగు అవసరాలను తీర్చడం, మున్నగు సహాయాలు విరివిగా చేసేవారు. ఇందుకు ప్రతిగా వారిని సైన్యం ఎంత హింసించినా దళాల ఉనికిని మాత్రం వారు బయటపెట్టలేదు. ఎన్ని బాధలైనా భరించారు, కొంతమంది ప్రాణాలు కూడా కోల్పోయారు. అయినా ఎవరూ పెదవి విప్పలేదు. తరువాత కాలంలో జమిందారులతో పోరాడి సాధించుకున్న విజయాలను సంరక్షించుకునే దశలోకి పోరాటం వచ్చినప్పుడు కూడా రైతాంగం తమ ప్రాణాలను పణంగా పెట్టి అయినా గెరిల్లాలకు సహాయ పడుతుండేవారు. ఆ విధంగా రైతాంగం అణచివేతకు గురవుతున్న ఇతర గ్రామీణ ప్రజానీకంతో బాటు ఈ సాయుధపోరాటంలో పాల్గొని భవిష్యత్తులో దేశంలో రాబోయే విప్లవానికి మార్గదర్శకులుగా నిలిచారు.

[illegible]

మహారాష్ట్రలో పాడిపరిశ్రమాభివృద్ధి శాఖ ప్రతిరోజూ 7 లక్షల లీ. పాలను సముద్రం పాల్జేస్తున్నది. ఇంతకన్నా దుర్మార్గం మరొకటి లేదు. నిల్వ పేట్టే సౌకర్యం లేక మార్కెట్ లేక వెన్న తీసి పాలను పారపోస్తున్నట్లు వారు చెప్తున్నా ఇది తీవ్ర జాతీయ సంపదను వృధా చేయడం మినహా మరొకటి కాదు. ఈ పాలను ఆస్పత్రులకు, బీదలకు, స్కూలు పిల్లలకు ఉచితంగా సరఫరా చేసినా ఫలితం దక్కుతుంది.



# కోళ్ళ పెంపకం

(గత సంచిక తరువాయి)....

## కేజ్ కోళ్ల షెడ్లు :

కోళ్ళ పరిశ్రమలో కేజ్ పద్ధతి నూతనాధ్యాయం ఆరంభింప చేసినది. కోళ్ళను కేజెస్‌లో పెంచడంవల్ల స్థలం మిగులుబాటు అవుతుంది. గ్రుడ్ల ఉత్పత్తి అధికం, మేతలో మిగులు, కోళ్ళకు పురుగుల బెడద తప్పడమేకాక, కాక్సీడియా రోగం నివారణ మొదలగు లాభములు ఉంటాయి. గ్రుడ్ల సైజు కూడా పెద్దవిగా ఉంటాయి. కేజెస్ షెడ్ల వల్ల కోడికి సగటు ఖర్చు తక్కువ అవుతుంది. రోగం వచ్చిన కోళ్ళను ఏరివేయడం, గ్రుడ్లు ఉత్పత్తి తగ్గిపోయిన కోళ్ళ ఏరివేత, టీకాలు వేయడం కూడా సులభం. పొదిగే స్వభావం తగ్గిపోతుంది. ఒకదానికొకటి పొడుచుకోవు.

ఈ కారణాలవల్ల నేడు కేజ్ పద్ధతికి విపరీతమైన ఆదరణ లభిస్తున్నది. అయితే సన్నకారు రైతుకు దాదాపు ఇది అసాధ్యం. కారణం ప్రారంభంలోనే అధిక పెట్టుబడి పెట్టవల్సి రావటం, ఇదేకాక, సరిగా తయారు చేయకపోయినా గ్రుడ్లు ఎక్కువ సంఖ్యలో పగిలే ప్రమాదముంది. కొన్ని కోళ్ళు సరిగా కేజ్‌కి అలవాటు పడలేవు.

ఒక కేజ్ భాగం 18 అం. పొడవు, 12 అం. వెడల్పు (లోతు,) 18 అం. ఎత్తు కలిగి ఉంటుంది. ఇందులో 3 లేదా 4 కోళ్ళ నుంచవచ్చును. కేజెస్‌లో చాలా రకాలున్నాయి. ఒక అంతస్తుపై మరో అంతస్తు ఉండే పద్ధతి, అలాకాకుండా రెండు మూడు అంతస్తులు ఒకదానిపై ఒకటి కాకుండా పక్కపక్కగా అమర్చే పద్ధతి, ఈ రెండో పద్ధతి అత్యంత ప్రచారములో ఉన్నది. విదేశాలలో దాదాపు ప్రతి కోళ్ళ షెడ్ కేజెస్‌తోనే నిర్మించబడి ఉంటుంది.

## కోళ్ళ పోషణ - పద్ధతులు :

కోళ్ళ పరిశ్రమ ప్రోత్సాహకరంగా ఉండాలంటే సరియైన దాణాను అందజేయడం, మేతలో పొదుపు అత్యవసరం. ఎందుకంటే, కోళ్ళ పెంపకములో దాదాపు 60-70 శాతం వరకూ మేతకు మాత్రమే ఖర్చవుతుంది. ఈ మధ్య కాలంలో, కోళ్ళ పరిశ్రమ పెరిగినంత వేగంగా, వ్యవసాయ రంగం అభివృద్ధి కాకపోవటం వల్ల, మేత రేటు విపరీతంగా పెరిగిపోతున్నది.

## ఆదర్శవంతమైన మేతకు ఉండవలసిన లక్షణాలు

1. మేత తక్కువ ధరలో, ఎక్కువ పోషక విలువలు కలదిగా ఉండాలి.

2. మేత తాజాగా శుభ్రంగా ఉండి, తేలికగా జీర్ణమయ్యే ఆహార పదార్థాలు కలిగి యుండాలి.

3. కోళ్ళు పీచును సమర్థవంతంగా జీర్ణించుకోలేవు కాబట్టి మేతలో పీచుపదార్థాలు 10 శాతం మించకుండా ఉండాలి.

కోళ్ళ పెరుగుదలకు, గ్రుడ్ల ఉత్పత్తికి, పోషక పదార్థాలు అతి ముఖ్యం. మేతలో పోషక పదార్థాల లోపాల వల్ల కోళ్ళు సరిగా ఎదగవు. గ్రుడ్ల ఉత్పత్తి తగ్గిపోతుంది. ఇతర రోగాలు ప్రబలుతాయి.

రైతు తన కోళ్ళకు కావలసిన మేతను తానే తయారు చేసుకోవచ్చును.

అయితే దానికి కాస్త శాస్త్రీయ విజ్ఞానం అవసరం. తనకు అందుబాటులో ఉన్న వస్తువుల పోషక విలువల గురించిన జ్ఞానం అవసరం.

సాధారణంగా కోడిమేతలో మొక్కజొన్నలు, బియ్యపు తౌడు, నూనె తీసిన వరితౌడు, జొన్నలు మరితర చిరుధాన్యాలు మొదలగునవి ముఖ్యమైనవి. దాణాలో దాదాపు 60 శాతం ఇవే ఉంటాయి. మాంసకృత్తులు నిచ్చేవాటిలో

వేరుశనగపిండి, సోయాబీన్సు పిండి, ప్రొద్దుతిరుగుడు పువ్వు పిండి మొదలగునవి. ఇవేకాక జంతు జన్యమైన మాంసకృత్తులు కూడా తప్పనిసరిగా జత చేయాలి. వీటిలో చేపపొడి, మాంసపు పొడి ముఖ్యమైనవి.

కోడి వయసునుబట్టి పోషకావసరాలు కూడా మారతాయి. కాబట్టి దాణా కూడా మారుతుంది.

ఈ అవసరాలను దృష్టిలో ఉంచుకొని, లభిస్తున్న ముడి ఆహార పదార్థాలనుపయోగించి, దాణా తయారుచేసుకోవచ్చు. గ్రుడ్లు పెట్టే కోళ్ల దాణాకి, మిగతా పిల్లల దాణాకి ముఖ్యమైన తేడా, కాల్షియం విషయంలో. పిల్లలకి 0.75-1 శాతం సరిపోతే, పెద్ద కోళ్ళకు కాల్షియం 2.5 నుండి 3 శాతం వరకూ ఇవ్వాలి. వీటితో పాటు, విటమిన్లు, లవణ మిశ్రమాలు, రోగ నిరోధక మందులు మొదలగునవి కూడా తగుపాళ్ళలో జత చేయవలసి ఉంటుంది. కోడి కడుపులో జీర్ణాశయంలో, ఆహారం జీర్ణం కావడానికి చిన్న గులకరాయి (గ్రిట్) అవసరము. ఈ 'గ్రిట్' సున్నపురాయి రూపంలో కాని, ఆలు చిప్పల ముక్కల రూపంలో గాని ఇవ్వవచ్చును.

## ముఖ్యమైన విషయాలు :

1. మేతలో కలిపే ధాన్యపు గింజలు ముఖ్యంగా వేరుశనగ పిండి, చేప, ఎక్కువ తేమ కలిగియుండకూడదు. ఉన్నట్లయితే ఫంగస్ వల్ల అఫ్లటాక్సికోసిస్ అనే రోగము వస్తుంది.

2. ఖనిజ లవణ మిశ్రమములో మరియుచేపలో ఉప్పు ఎక్కువగా లేకుండా చూడాలి.

3. ఒకే రకం రోగనిరోధక మందులు కాక, తరచుగా మార్చడం ముఖ్యం.

4. చిన్న కోడిపిల్లల మేతలో విటమిన్లు, అంటే 'బయాటిక్, కాక్సిడియోస్టాట్ మరియు నైట్రోఫుర జోలిడోన్ మందులు తప్పకుండా ఉండాలి.

5. కోడి వయస్సు ప్రకారము మరియు కేజ్ కోళ్ళకు కాల్షియం ఆవశ్యకత ఎక్కువగును.

6. వేసవిలో మేతను కాస్త తడిచేసి అందచేయవలెను.

7. మేత వృథాకాకుండా చూడాలి. దీనికోసం సరియైన మేత తొట్లు, ఎలుకల నివారణ అవసరం కోడి వయస్సు ప్రకారము మిశ్రమ దాణాలు అవసరమౌతాయి.

[సశేషం...]





# భద్రాచలం మన్నెం కతలు

"చట్టప్రకారం గిరిజన ప్రాంతంలో భూమి మొత్తం గిరిజనులదే. గిరిజనేతరుడు భూమి సంపాదిస్తే అదెలా వచ్చిందో నిరూపించు కోవలసినది గిరిజనేతరుడే. కానీ అంతదాకా ఎప్పుడూ రాదు. ఎందుకంటే గిరిజనుల భూమి సమస్య అంత ప్రాధాన్యత ను సంతరించుకోవడం లేదు. గిరిజన సీమలో వుండే మొత్తం సేద్యపు భూమిలో యాభైశాతంపైగా భూమి గిరిజనేతరుల చేతుల్లో వుంది. ఆనూచానంగా, వారసత్వంగా గిరిజనులకు వస్తున్న భూమిని గిరిజనేతరులు పలుమార్గాలతో ఆక్రమించు కొంటే ఇంకాస్త లోపలికి అడవిలోకి పోయి 'పోడు' కొట్టుకోక తప్పని పరిస్థితి గిరిజనుడిది. ఆ భూమి అడవి మధ్యలో వుందంటూ జడిపిస్తూ వుంటారు. అటవీ శాఖ అధికారులు, గిరిజనసీమకి పరిశ్రమలు వస్తాయి. వాటివల్ల గిరిజనుడి భూమిపోతుంది తప్ప గిరిజనుడికి ఒరిగేదేంలేదు. తానున్న చోటనే కూలీగానైనా మారాలి లేదా అడవి మధ్యలోకి వెళ్లి అటవీ శాఖ అధికారుల దయాదాక్షిణ్యాల మీదైనా ఆధారపడి వుండాలి."




"భూమి, నీరు, మొక్కలూ, ఈ వరుసలో గిరిజనాభివృద్ధి జరిగితే బాగుంటుంది. గిరిజనులకు భూమిని పంచడంలో, సాగునీటి వసతి కల్పించడంలో, మొక్కలు పెంచుకోనివ్వడంలో ప్రతిబంధకాలు లేకపోతే గిరిజన సమస్యేలేదు" ఈ మాటలు అంటున్నది ఒక రాజకీయనాయకుడు కాదు, కేవలం గిరిజన పక్షపాతంతోనే చెబుతున్న మాటలూ కావు, గిరిజన సమస్యల గురించి ఒక ఐ.ఏ.యస్. అధికారి అభిప్రాయం అది. ఓ రెండేళ్ళ పాటు ఖమ్మం జిల్లా గిరిజన ప్రాంతంలో పనిచేసిన ప్రభుత్వ, అధికారి శ్రీ ఎ. విద్యాసాగర్ తన అనుభవాలూ, అభిప్రాయాలకు అక్షర రూపం ఇచ్చి కొన్నికథలుగా రూపొందించినారు. అవన్నీ 'భద్రాచలం మన్నెం కథలు" గా పుస్తకరూపంలో వెలువడినవి. అడవి తల్లి అనుగు బిడ్డలైన గిరిజనుల పట్ల శ్రీ విద్యాసాగర్ కి కలిగిన ప్రేమాభిమానాలకూ వాత్సల్యానికిఈ ఈ వ్యాస సంకలనం అక్షరాకృతి.

దేశమంటే మట్టికాదు, అధికార మంటే అనుభవించటానికీ కాదు అని నిరూపించి, సమస్యల గుండెలు చీల్చి హృదాంతరాళా లను తాకి పలవరించిన కథలివి. ఈ కథలు చదువుతుంటే మంచి అనుభూతి కలుగుతుంది. గిరిజనుల అభివృద్ధికి పనిచేస్తున్న వారికీ ఎంతో స్ఫూర్తినిస్తుంది. క్షణం కూడా తీరికలేకుండా విధి నిర్వహణతో సతమతమయ్యే ఒక ఉన్నతాధికారి సమాజంలో అణగారిన బడుగు జీవుల వెతలపట్ల చూపిన సానుభూ తిని అభినందించాలి.

ఈ పుస్తకం లోని కథలూ స్వగతాలూ ఇరవై వరకూ వున్నాయి. ఏజన్సీలో ప్రకృతి వైపరీత్యాలు, గిరిజనుల భూమి సమస్య ఫారెస్ట్ అధికారుల ఆగడాలు, గిరిజనేతరుల ప్రాబల్యం, గిరిజనుల అమాయకత్వం, తరిగిపోతున్న అడివిని గురించిన వర్ణనతోపాటు గిరిజనాభివృద్ధికి ప్రభుత్వ పథకాల వివరణ బాగున్నది. గిరిజనుల అభివృద్ధికి చిత్తశుద్ధితో పనిచేస్తున్న కొందరు అధికారు లూ, ఉద్యోగుల గురించి కూడ చెప్పబడింది. ఆంధ్ర దేశంలో గిరిజన పరిశోధనకు అంకితమైన ప్రొఫెసర్ హేమండార్ఫ్ గురించి కొంతైనా తెలుసుకొనే అవకాశం లభిస్తుంది.

గోదావరి నది, శబరి-కిన్నెరసాని ఉపనదులకు వరదలు వచ్చి గిరిజన గ్రామాలను దీవుల్లాగా చేస్తాయి. ప్రజలు కొంపా, గోడు పోగొట్టుకుంటారు. బైట నుండి సహాయం అందించటం

కూడ కష్టంగా వుంటుంది. ఇదంతా 'ఇటూ కిన్నెరసాని అటూ కిన్నెర సాని' మరియు రోడ్డు మీదలాంచి, ఆకాశవాణి నందిగామలో వివరించబడింది. భూమికోసంలో గిరిజనుల జీవనాధారమైన ప్రాథమిక సమస్యపైన చర్చవున్నది. 'శాపలు దాగితే సెరువెండుద్దాసారూ!' కొండకు కట్టెలు మొయ్యమంటరా సారూ. అనే కథల్లో గిరిజనులు అటవీశాఖ అధికారుల్తో పడేఇబ్బందులు వున్నాయి. గిరిజనేతరులైన ఉద్యోగులు, కాంట్రాక్టర్ల కామవాంఛలకు బలైపోయే కోయకన్నెల వెతలు కూడ కళ్లకు కట్టినట్లు వున్నాయి.

"ఇంటి ముందు పూల చెట్లూ, ఇంటి లోపల రెండు అరలు వెదురు తడికెల మీద చక్కటి రంగుల దృశ్యాలు, ఇంటి బయట చక్కగా అలికి ఏవో ముగ్గులు వేసి, వెదురు గోడలపై ఏవో బొమ్మలు వేసి బొమ్మరిల్లులా వుండే కోయల నివాసాలను మనోజ్ఞంగా చిత్రించారు రచయిత. శ్రీసాగర్ రచనలో కవిత్వమూవుంది. కవిత్వంలో సౌందర్య దృష్టివుంది. ప్రకృతి సోయగాల్ని అందమైన మాటల్లో చెప్పిన సందర్భాలు ఎన్నో వున్నాయి. "వాన చిత్తడికి అప్పటికప్పుడే పుట్టు కొచ్చి వెన్ను చేసిన రెల్లు పూలూ, అడవి పూలపొదలూ అల్లుకొన్న బండ్లబాట" గా అడవిబాటను అభివర్ణించారు. 'పళ్లంతా తడిసి ఆరిన కాలిదారులు' 'కసకసమని సందడిచేసే కాండజొన్న చేలూ' వంటి సహజ వర్ణనలు సంకలనంలోని ప్రతి వ్యాసాన్నీ రసభరితం చేస్తాయి. సందర్భానుసారంగా ఫోటోలు కొన్ని వున్నాయి. చివరకొన్ని వివరణలూ వున్నాయి.

ఈ సంకలనంలోని వ్యాసాలను అధ్యయనం చేస్తే ఎవరికైనా గిరిజన సమస్యలూ, వాటికి పరిష్కార మార్గాలూ అర్థమయ్యే అవకాశం వున్నది. గిరిజసీమల్లో పని చేస్తున్న వారికి ఒక రిఫరెన్స్‌లా వుపయోగపడుతుంది. రైతు రంగంలో పనిచేసే కార్యకర్తలకు కరతలామలకంగా వుంటుంది.

నూట ఎనభై పేజీలు వున్న "భద్రాచలం మన్నెం కథలు" వెల రూ.35/-లు, కాపీలు లభించు స్థలము "గౌతమి పబ్లికేషన్స్ ఎన్ బి. 92, సైఫాబాద్, హైద్రాబాద్."

–నాగటి

[illegible]

డంకెల్ ప్రతిపాదనలను ఆమోదించడానికి డిశంబర్ 15వ తేది ఆఖరు గడువుగా నిర్ణయించారు. దీన్ని మన దేశం చేత ఒప్పించడానికి డంకెల్ స్థానంలో "గాట్"కు కొత్తగా డైరెక్టర్ జనరల్‌గా వచ్చిన పీటర్ సూదర్‌లాండ్ గత నెలలో భారతదేశం వచ్చాడు. ఆయన రాకను తీవ్రంగా నిరసిస్తూ అక్టోబర్ 28న ఢిల్లీలో పెద్ద ప్రజా ప్రదర్శన జరిగింది. రైతు సంఘం కూడా భాగస్వామిగా వున్న ఐక్య ప్రజాసంఘాల వేదిక దీనికి నేతృత్వం వహించింది. జీన్ క్యాంపేయిన్ నాయకులు కూడా ఇందులో పాల్గొన్నారు.

కేంద్ర ప్రభుత్వం ఇప్పటికే అమెరికా ఒత్తిడికి లొంగి డంకెల్ ప్రతిపాదనలపై సంతకం చేయడానికి లోపైకారిగా సిద్ధపడింది. అది జరగకుండా చేసేందుకు దేశవ్యాపితంగా ప్రజలు ఎదురు తిరిగి ప్రతిఘటించాలని ఐక్య ప్రజా సంఘాల వేదిక పిలుపునిచ్చింది. ఇందులో భాగంగా డిశంబర్ 3 నుండి 9 వరకు దేశ వ్యాపిత నిరసన కార్యక్రమాలు జరిగాయి.

శుభాకాంక్షలతో.....

ఫోన్ : 8342
కొణితివాడ : EX

# దీ అండలూరు కో.ఆపరేటివ్ రూరల్ బ్యాంకు లిమిటెడ్

నెం. 2010
అండలూరు,
వీరవాసరం మండలం
పశ్చిమ గోదావరి జిల్లా.



శ్రీ గొట్టుముక్కల వెంకటసోమరాజు
కార్యదర్శి

మేకా ఆనందరావు
అధ్యక్షులు.

1. సభ్యుల వాటాధనము ...............24,70,468
2. డిపాజిట్లు ...........................13,73,506
3. రిజర్వులు ............................1,98,690
4. క్షేమనిధి ...............................1,81,896
5. సభ్యులకు యిచ్చిన అప్పులు....1,94,62,460
6. ఎరువులు, పురుగుమందులు, విత్తనములు వ్యాపారము చేయుచున్నాము.
7. 1991–92 ఆడిట్ రిపోర్టు

దాఖలా లాభము. ...................42,135–60

| | | |
|---|---|---|
| 1. యిర్రింకి కేశవరావు | : | ఉపాధ్యక్షులు |
| 2. యాళ్ళబండి భాస్కరరావు | : | డైరెక్టర్ |
| 3. కడలి మృత్యుంజయుడు | : | " |
| 4. దారం సుబ్బారావు | : | " |
| 5. సరెళ్ళ రాముడు | : | " |
| 6. మైగాపుల సుబ్బారాయుడు | : | " |
| 7. పంజా వెంకటేశ్వరరావు | : | " |
| 8. యరకరాజు వెంకట శివరామ కృష్ణంరాజు (చంటి) | : | " |
| 9. పూతాడ మావుళ్ళు | : | " |
| 10. చింతపల్లి రామన్న | : | " |
| 11. శ్రీమతి గొండేటి వెంకాయమ్మ | : | " |
| 12. శ్రీమతి చరగడం చల్లాయమ్మ | : | " |

# మనం – మన ఆహారం

## పండ్లు లేక ఫలాలు :

పండ్లలో కూడా విటమినులూ, ఖనిజాలు లభిస్తాయి. బొప్పాస పండు, మామిడి పండ్లలలో విటమిను "ఏ" పుష్కలంగా ఉంటుంది. ఉసిరిక, నిమ్మ, నారింజ, జీడిమామిడి పండ్లలో విటమిను "సి" ఉంటుంది. మామూలు సీతాఫలములో విటమిను "బి$_1$", "బి$_{12}$" కాకుండా నియసిన్‌తో పాటు విటమిను "సి" కూడా ఎందులోనూ లేనంతగా ఉంటుంది. తగినంతగా చక్కెర కూడా ఉంటుంది. అరటిపండ్లలో విటమిను "సి" కొద్దిగాను,

"రోజుకొక యాపిల్ పండుతింటే డాక్టరును దూరంగా వుంచవచ్చుననే నానుడిలో ఎక్కువ సత్యం లేదు. ద్రాక్ష, యాపిల్‌లలో ఎక్కువ పౌష్టిక విలువలు లేవు"

పిండి పదార్థము పుష్కలంగాను ఉంటుంది. పఊయర్ పండులో క్రొవ్వు పుష్కలంగా అనగా 23 శాతం వుంటుంది. ద్రాక్ష యాపిల్ పండ్లలలో పౌష్టిక విలువలు ఎక్కువగా లేవు. రోజుకొక యాపిల్ పండు తింటే డాక్టరును దూరంగా వుంచవచ్చుననే నానుడిలో ఎక్కువ సత్యం లేదు. కాని – అంత హెచ్చుధరకు ఆ పండు అమ్ముడుపోతుండటము వల్ల అప్పిచ్చేవాడు సన్నిహితుడు కావటము సంభవము.

## పాలు :

పాలు ప్రకృతి సహజమైన ఆహారమని మనకందరికీ తెలుసు. పుట్టిన కొన్ని వారాల వరకు తల్లిపాలే సాధారణంగా బిడ్డలకు ఆహారము. కనుక తల్లి పాలలో ఇంచుమించుగా తగిన మోతాదులో పిండి పదార్థాలు ఉంటాయి. ఆ విధంగానే గేదె, ఆవు పాలలో పోషక పదార్థాలు పుష్కలంగా వుంటాయి. వాటిలో తల్లి పాలలో కంటే చక్కెర తక్కువగా ఉంటుంది. కాని మాంసకృత్తులు అధికంగాను అంతకంటే అధికంగా క్రొవ్వు వుంటాయి. బిడ్డకు ఆవు, గేదె పాలు ఇవ్వాలంటే కొంచెము చక్కెర చేర్చవలసి వుంటుంది. నీరు చేర్చి పాలను పలచన చెయ్యాలి. ఈ పాలలో శ్రేష్టమయిన జంతు సంబంధమైన క్రొవ్వు వుండటంచేత ముఖ్యంగా శాఖాహారులకూ అందులోనూ వయసు మళ్ళిన వృద్ధులకూ పాలు మంచి ఆహారము. పాలలో కాల్షియమ్ పుష్కలంగా వుంటుంది. కాని – విటమిను "సి", ఇనుము చాలా తక్కువ.

పాలలో సగము నీరు ఇరిగిపోయేటట్టుగా మరగ కాచితే తీపిలేని కోవా ముద్ద వస్తుంది. పాలలో ఇంకా నీరు తగ్గించి చక్కెర కలిపినట్లయితే తీపి కలిపిన కోవా అవుతుంది.

పాలపొడి అసలైన పాలనుంచి నీరంతా ఇగిరిపోయేటట్టు కాచగా వచ్చినదే. దీనికి నీరు చేరినట్లయితే తిరిగి అసలైన పాలవుతాయి. అసలైన పాలలో క్రొవ్వు చాలా వుండటంచేత త్వరగా పులుపెక్కుతాయి. అందుచేత మనకు మార్కెట్‌లో దొరికేది (Skinned Milk Powder) వెన్న తీసిన పాలపొడి. దీనిని తయారుచేయటానికి పాలపైన మీగడవంటి క్రొవ్వు పదార్థాన్ని ముందుగా తొలగించి, అటు తరువాత ఆ పాలను పొడిగా తయారు చేస్తారు. మన దేశంలో చాలా నగరాలలో- గేదె పాలలోని క్రొవ్వును తొలగించి, ఎంత క్రొవ్వును తొలగిస్తారో

"పాలలోని క్రొవ్వును తొలగించి, ఎంత క్రొవ్వు తొలగిస్తారో అంతగా పిండి పదార్థములు, మాంసకృత్తులు కలిపి వెన్న తీసిన పాలపొడి రూపంలో తయారుచేస్తారు. ఈ పాలనే 'టోన్డ్ మిల్క్' అని పిలుస్తారు"

అంతగా పిండి పదార్థాలు, మాంసకృత్తులు కలిపి వెన్న తీసిన పాల రూపములో తయారుచేస్తారు. ఈ పాలను టోన్డ్ మిల్క్ అంటారు. కనుక టోన్డ్ మిల్క్‌లో మీగడ వెన్న అసలు పాలలో కంటే తక్కువగా వుంటాయి. కాని-మాంసకృత్తులు, పాల చక్కెర (Milk Sugar) అసలు పాలలో కంటే అధికంగా వుంటాయి. అసలైన మంచిపాలు పెరుగుగా తయారు చేసినప్పుడు ఆ పాలలో వుండే మంచి పోషక పదార్థాలన్నీ నశించక నిలిచే వుంటాయి. పెరుగును కవ్వముతో చిలికి వెన్న తీసిన తరువాత ఆ మజ్జిగలో లేక చల్లలో మాంసకృత్తులు, చక్కెర, విటమినులు, ఖనిజాలవంటి అన్ని పోషక పదార్థాలూ వుంటాయి. క్రొవ్వులో కలిసిపోయే విటమిను "ఏ", క్రొవ్వు మాత్రమే మజ్జిగ నుంచి తీసివేయబడతాయి.

Printed & Published by Vankayalapati Srinivasa Rao on behalf of A. P. Rythu Sangham, at Graphics Den, Himayathnagar, Hyderabad 29 (A. P.) Editor : V. Srinivasa Rao

APGST . NRE -06-2-1753
CST NRE 06 2-1488

26-12-89

Grams : N...
Phone : 2...

# NELLORE STRAWBOARDS Pvt. Ltd.,

NAVALAKH GARDENS

NELLORE - 524 002, (A.P.)





*Manufactures of :*

Straw Boards
'7' OZs to "43" OZs
of all required sizes.

73

RWO I A 122

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | RVV01A 122 |
| పుస్తకం పేరు | తెలుగు వాణి |
| తారీఖు | 22/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 77 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | pragathi |
| పేజీలు విడదీసినది | pragathi |
| స్కాన్ చేసినది | manasa |
| పరీక్ష చేసినది | MOUNIKA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |